


## టక్కులమారి!

'రంగులో ఏముంది.. గుణం ప్రధానంకానీ!' అంటారు. ఈ గుడ్లగూబను చూస్తే అది నిజం కాదేమో అన్పిస్తుంది. శత్రువును బురిడీ కొట్టించేందుకు తన రెక్కల రంగుకు సరిపోయే బెరడుగల చెట్టుతొర్రనే గూడుగా చేసుకునే ఈ గూబలు అమెరికా, కెనడాలో కన్పిస్తాయి.

సంపుటి -31
సంచిక - 5
జూన్ 2008
365వ సంచిక

# చతుర





ముఖచిత్రం : రూప ఛాయాగ్రాహకుడు : రమేష్
చివరి పేజీ : లాస్యప్రియ
ముఖపత్రాలంకరణ : రాజు యాట

సువిశాల ప్రపంచంలో
తన ఉనికి నిరూపించు
కోవాలని భావించిన
ఆధునిక మహిళ
అడుగడుగునా ఎదురొచ్చే
అవాంతరాలను,
అనేకానేక సమస్యలను
సునిశితంగా
చర్చించిన
**వసుంధర**
నవల
**మిసెస్ కాసులమ్మ**
**ఎలియాస్ వికాసిని**
14 వ పేజీలో
బొమ్మలు: రవి



# మనసున ఉన్నదీ...



★ మే చతుర నవల 'నేల నవ్వింది' రైతుజీవితాన్ని చక్కగా విశ్లేషించింది. రైతుల కష్టా లను, పరిస్థితులను సహజంగా చిత్రీకరించారు. ఇజ్రాయెల్ ప్రాజెక్ట్‌లోని నిజాల్ని తెలియజె ప్పిందీ నవల. రచయితకు అభినందనలు. అలాగే, 'గెలుపు', 'వీరకుంకుమ' నచ్చాయి.

*-యస్. ఖాజావలి,* అయ్యప్పకాలనీ, గుత్తి

★ రైతుల ఆర్థిక అవసరాలను తమ స్వార్థానికి, తమ రాజకీయ ఎదుగుదలకు నిచ్చెనలుగా వాడుకోవడం చూసి 'నేల నవ్వింది'. తాతముత్తాతలిచ్చిన నేలను విదేశీ కంపెనీలకు ప్రయో గంగా వాడుకోమన్న రైతన్న అమాయకత్వాన్ని చూసి 'నేల నవ్వింది'. మానవ సంబంధా లను నిలుపుకోలేని పల్లెని చూసి 'నేల నవ్వింది'. మనుషులు లేని, బావులు, చెట్లు, ఎద్దులు అన్నింటినీ పోగొట్టుకుని 'నేలనవ్వింది'.

*- యు. శైలజ,* మోటూరు, కృష్ణాజిల్లా

★ ప్రతినెలా చతురకానుకగా పాఠకులు అందుకుంటున్న నవలలు పారదర్శకంగా వుంటు న్నాయి. పలమనేరు బాలాజీ 'నేల నవ్వింది' చాలా బాగుంది. 'కొత్తగాలి' శీర్షిక మనసును రంజింపజేస్తోంది. చతురని కూడా వారపత్రికగా చూసుకునే భాగ్యాన్ని కలిగించండి.

*-కలియుగం హుమాయున్ సంఘీర్,* గోపాల్‌పేట్, నిజామాబాద్ జిల్లా

★ 'నేల నవ్వింది' నవల పల్లెసీమలో పత్తిరైతు జీవనానికి అద్దం పట్టేలా రచయిత పలమ నేరు బాలాజీ అద్భుతంగా రచించారు. బోరుపైనే అన్ని ఆశలు పెట్టుకున్న మునిక్రిష్ణయ్య చివరకు ఆ బోర్ కూడా తనకు మిగలకపోవడంతో నీరుగారిపోయిన పరిస్థితి బాధాకరంగా ఉంది. పొలం లీజ్ అధికంగా వస్తే తన రెండో కూతురు పెళ్లి జరిపించేయాలనుకున్న అతడి కోరిక నెరవేరకపోవడం హృదయాలను ద్రవింపజేసింది. రైతుల జీవితం అప్పులబా రిన పడకుండా ఉంటే బాగుండుననిపించింది ఈ నవల చదివిన తర్వాత.

*-అల్లంపాటి వెంకటేశ్వర్లు,* చతుర అభిమాని

★ టాంక్‌బండ్ కథలు మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి. 'కొత్తగాలి' శీర్షికన ప్రచు రితమవుతున్న కవితలు చాలా బావున్నాయి. రాయలసీమ రైతుల జీవితాల్లోని వెలుగునీడ లను 'నేల నవ్వింది' రచయిత చక్కగా విశ్లేషించారు. అభినందనలు.

*- యు. శ్రీను,* శ్రీశైలం డ్యాం ఈస్ట్, కర్నూలు జిల్లా

★ నేటి ప్రజాస్వామ్యంలో నాయకులు చేసే దోపిడి ప్రక్రియను కళ్లకు కట్టినట్లు రచయిత 'నేలనవ్వింది'లో ప్రదర్శించగలిగారు. అభినందనీయులు. ఇలాంటి నవలలు ఇంకా 'చతుర' ద్వారా మరెన్నో రావాలని కోరుకుంటున్నాను.

*-వి. వెంకట రాంనర్సయ్య,* హన్మకొండ

★ సుమారు 37 స్త్రీ, పురుషపాత్రలతో 'నేలనవ్వింది' నవల గ్రామీణ వాతావరణంలోని రాజ కీయాల మధ్య రసవత్తరంగా సాగింది. సుశీల, రమణ, కిషోర్, సుజనల వివాహం జరి గివుంటే కనీస న్యాయం మునిక్రిష్ణయ్యకు జరిగి ఉండేది. ఆలోచనలేని ప్రభుత్వ పథ కాలు అమాయక రైతుల జీవితాలను ఏవిధంగా అస్తవ్యస్తం చేసాయో కళ్లకు కట్టి నట్లు చూపించింది ఈ నవల.

*-అక్కినపల్లి రామారావు,* విశాఖ

---

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు
కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -500 082
ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

# విచిత్రమైన హోటళ్లు




ప్రపంచంలోనే అనేక చిత్రమైన హోటళ్లు ఉన్నాయి. స్వీడన్‌లోని జుక్కాస్ జెర్వీ అనేచోట, ఆర్కిటిక్ సర్కిల్‌కి 200 కి.మీ. దూరంలో ప్రపంచ ప్రసిద్ధమైన ఐస్ హోటల్ ఉంది. అక్కడ ప్రవహించే టోర్నీ నది చలికాలంలో గడ్డ కడుతుంది. తర్వాత ఒక మీటరు మందంగల మంచుగోడలతో ఈ హోటల్‌ని ఆ నదిమీద నిర్మిస్తారు. చలికాలం పోగానే మంచుగోడలు కరిగి నదిలో కలిసిపోయి ఐస్ హోటల్ మాయమవుతుంది. ఇలా ప్రతీ ఏట దీన్ని నిర్మిస్తుంటారు.

ఓ రాత్రి జైల్లో గడపాలనుకునే వారు ఆస్ట్రేలియాలో మౌంట్ లాంబియర్‌లోని డి ఓల్డ్ జైల్ మోటెల్‌లో బస చేస్తే, ఆ అనుభూతి కలుగుతుంది. తక్కువ ధరతో నడిచే ఈ హోటల్లో మెస్‌లో క్యూలో నిలబడి భోజనం తీసు




కోవాలి. టాయ్‌లెట్ పక్కన ఉన్న బంక్స్‌లో ఖైదీల్లా పడుకోవాలి.

మురికి గొట్టంలో కూడా ఓ హోటల్ ఉంది. ఆస్ట్రియా దేశంలోని లింట్జ్‌నగరంలో ఓ హోటల్ వారు మురికినీటిని సరఫరా చేసే విశాలమైన గొట్టాలని గదులుగా మార్చి అద్దెకిస్తున్నారు. ఓ డబుల్‌కాట్, దానిపక్కన చిన్నటేబుల్, అద్దం మాత్రం ఉండే ఈ గదులకి ప్రత్యేక అద్దె అంటూ లేదు. ఎవరికి వారు తమకి తోచిన అద్దెని చెల్లించవచ్చు.

ఆస్ట్రేలియాలో మరో విచిత్రమైన హోటల్ ఉంది. దానిపేరు ఫన్ అండ్ ఫెదర్ రెయిన్ ఫారెస్ట్ ట్రీ హౌసెస్. ఓ అడవిలో వంద ఎకరాల్లో, ఓ నది పక్కనగల స్థంభాల మీద కట్టిన గదుల్లో అడవి వాతావరణంలో అతిథులు బస చేస్తారు. మనదేశంలోనే కేరళలో ది గ్రీన్ మేజిక్ ట్రీ హౌస్ అనే హోటల్ ఉంది. తొంభై అడుగుల ఎత్తున్న చెట్లమీద గదుల్లో బస చేయొచ్చు. టెలిఫోన్, బాత్ రూమ్ సౌకర్యాలుగల ఇక్కడ విదేశస్థులు ఎక్కువగా బస చేస్తారు.

అమెరికాలో ఆరెగాన్ రాష్ట్రంలోని పోర్ట్‌లాండ్‌లో మిసెస్ కెనడీ స్కూల్ హోటల్ కూడా చిత్రమైనదే. అదే పేరుగల చారిత్రాత్మక పాఠశాలని హోటల్‌గా మార్చారు. ప్రతి గదిలో నల్ల బోర్డు ఉంటుంది.

న్యూజిలాండ్‌లోని వెయిడమోలోని ఉడ్‌లిన్ పార్క్ మోటెల్స్ మరో చిత్రమైన హోటల్. 1950లలో ఉపయోగించిన రైలుడబ్బాలో ఫైటర్ విమానంలో చిన్న చిన్న గదులని నిర్మించారు. వినోదం కోసం అతిథులు అక్కడ గొర్రెబొచ్చుని కత్తిరించవచ్చు.

గుహల్లో ఉండాలనుకునేవారు టర్కీలో పద్దెనిమిది గదుల గవిరసు కేవ్ హోటల్లో బస చేయవచ్చు. ఈ గుహను గతంలో ఐదువేల సంవత్సరాలుగా నివాసంగా ఉపయోగిస్తున్న దాఖలాలు ఉన్నాయి. వెయ్యేళ్ల క్రితం దీన్ని ఓ మఠంగా ఉపయోగించేవారు.

చైనాలో మౌసోలియం(స్మశానం) తరహా హోటల్ జివాంగ్సు ప్రావిన్స్‌లో లిఫుయా అనే ఊళ్లో నడుస్తోంది. ఓ స్మశానంలో నిర్మించిన ఆ హోటల్లోని మంచాలు శవపేటికల ఆకారంలో ఉంటాయి. గుండెజబ్బుగలవారిని ఈ హోటల్‌లోకి అనుమతించరు. అలాగే మానసిక రోగుల వెంట ఎవరైనా తప్పనిసరిగా ఉండాలి.

అపార్ట్‌మెంటాలజీ-5

# ఆడవారి ఆటలకు అర్థాలే వేరు



యర్రంశెట్టి సాయి

వినాయక చవితి ఉత్సవాలు జరపాలని మా రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ వాళ్ళు - డిసైడ్‌చేశారు.

శంకరమూర్తి కల్చరల్ సెక్రటరీ కాబట్టి ఎలాంటి ప్రోగ్రామ్స్ ఎరేంజ్ చేయాల్సిందీ - అపార్ట్‌మెంట్స్‌లో వాళ్ళందర్నీ సంప్రదించి కొన్ని కార్యక్రమాలు లిస్ట్ చేశాడు.

మొదటిరోజు అపార్ట్‌మెంట్ లేడీస్‌కి పాటలపోటీ! 'పాట' అంటే విరక్తి కలిగే పద్ధతిలో లేడీస్ అందరూ తమ ప్రతిభను మూడు గంటలపాటు వెళ్ళగక్కారు.

రెండోరోజు మిమిక్రీ పోటీలు! అవికూడా ఎక్కువగా మా అపార్ట్‌మెంట్స్ వాళ్ళే చేశారు. ఆఖర్లో- అంటే పదోరోజు రాత్రి జరిపిన కార్యక్రమం చూసి అపార్ట్‌మెంట్ లేడీస్, జెంట్స్ అఫెండ్ అయిపోయి, అలాంటి కార్యక్రమం ఏర్పాటు చేసినందుకు కల్చరల్ సెక్రటరీ శంకరమూర్తి మీద దాడిచేశారు.

ఇంతకూ ఆ కార్యక్రమం ఏమిటంటే చిన్నపిల్లల రికార్డ్ డాన్స్‌లు.

మరీ చిన్న వయసు ఆడపిల్లలు- మన తెలుగు సినిమా హీరోయిన్స్ వేసుకునే సెక్సీడ్రస్‌లు వేసుకుని పరమబూతు పాటలు పాడటమే కాకుండా వల్గర్ విన్యాసాలు కూడా చేయడం! 'అబ్బనీ తీయని దెబ్బ-' అంటూ నడుము ముందుకు జెర్క్ ఇస్తోంటే అపార్ట్‌మెంట్స్‌లోని యూత్ అంతా బూతు కామెంట్స్, విజిల్స్‌తో మోతెక్కించేశారు.

ఆ ప్రోగ్రాం అవగానే మా వాళ్ళందరూ- మిగతా ఆఫీస్ బేరర్స్‌తో సహా శంకరమూర్తి టేస్ట్ చాలా నీచంగా ఉందని కామెంట్ చేయటం మొదలు పెట్టేసరికి శంకరమూర్తి వళ్ళుమండిపోయి ఎదురు తిరిగాడు. ఇలా పదిమందిలో పబ్లిగ్గా గొడవ పడటం బాగుండలేదని మా సొసైటీ ప్రెసిడెంట్ హమీద్‌మియా ఒక రాజీఫార్ములా వదిలాడు.

"నేను రేపాదివారం జనరల్ బాడీ కండక్ట్ చేస్తయ్! అన్నీ ఆ మీటింగ్‌కొచ్చి డిస్కస్ చేసి అప్పుడు శంకరమూర్తి మీద యాక్షన్ డిసైడ్ చేస్తయ్-" అన్నాడు.

ఆ మేరకు ఆదివారం మీటింగ్ మొదలయిపోయింది.

ముందు మా సొసైటీ వైస్ ప్రెసిడెంట్ అంజనీబొపాషా మాట్లాడింది. అంజనీబొపాషా తెలుగావిడకాదు. నేటివ్ ప్లేస్



అస్సాం బెంగాల్ బోర్డర్ గానీ, వాళ్ళాయన ఉద్యోగరీత్యా హిమాచల్‌ప్రదేశ్ కొండజాతుల మధ్య చాలాకాలం గడిపి, ప్రస్తుతం హైద్రాబాద్‌కి బదిలీ మీద వచ్చాడు.

ఆమె అపార్ట్‌మెంట్స్‌కి సంబంధించిన విషయాల్లో యాక్టివ్‌గా ఉండడంతో ఒక వైస్‌ప్రెసిడెంట్ పోస్ట్ ఇచ్చారు.

"ఆడపులులూ, మగపుల్లలూ! చాలా నిజంగా ఆ పిల్లుల రికార్డ్‌డాన్స్‌లు బాగుందిగాలేదు." అంది

అందరూ ఆమె తెలుగుకి తలలు పట్టుకున్నారు.

"సింకరమూతి చాలా నిజంగా ఆ కార్యం కార్యించాడు."

"అమ్మా! నాపేరు సింకరమూతి కాదు తల్లీ! శంకరమూర్తి-"

"నాతెగులు నించంరాదు- ఎడ్జస్ట్ కాసుకోవాలి-"

"కాసుకోవాలికాదు - చేసుకోవాలి-" ఎవరో అరచారు.

ఆ తరువాత లేడీస్ వింగ్ ప్రెసిడెంట్ మంగతాయారు ఆవేశంగా మాట్లాడింది.

"నమస్కారం! మొన్న గణపతి ఉత్సవాల్లో ఆఖ్రరోజున జరిగిన ఆ సిగ్గు చేటు కార్యక్రమం గురించి మాట్లాడ్డానికి మనం ఇక్కడ సమావేశమయ్యాం ఆ చిన్నపిల్లల రికార్డ్ డాన్స్‌లు ఎంత నికృష్టంగా, ఆసహ్యంగా ఉన్నాయంటే నేనూ మా ఆయనా సిగ్గుతో తలవంచుకున్నాం!"

"అవును! ఆ లిరిక్స్ - ఆ పాటలు- మన సోసైటీకే నిండా ఇన్సల్టప్పా" మంగతాయారుని సపోర్ట్ చేశాడు స్వామినాథన్!

భారతమ్మ మైక్ అందుకుంది. "మన భారత సంస్కృతేంటి? మన తెలుగు సంస్కృతి ఎంత గొప్పది? అలాంటిది ఆ చిన్నపిల్లల్తో "ముందు పెట్టుకో- ముద్దుపెట్టుకో' అనే పాటలు పాడిస్తారా ఎవరయినా? "

ఇలా అందరూ వరుసగా ఎటాక్ చేస్తూంటే శంకరమూర్తికి, విజయ్ యాదవ్‌కి వళ్ళుమండిపోయింది.

"అవన్నీ సినిమాల్లో పాట లేనండీ! తెల్లారిలేస్తే అన్ని టి.వి. చానెల్స్‌లో చూపిస్తూనే ఉన్నారు. ఆ సినిమాలకి లేడీస్ ఎగబడి వెళ్ళి వందరోజులాడించారు- ఇప్పుడు సడెన్‌గా "అవన్నీ నికృష్టమైనవి అంటారేంటి? " అంటూ కౌంటరేశాడు.

అంతవరకూ నిశ్శబ్దంగా ఉన్న విజయ్ యాదవ్ కూడా శంకరమూర్తిని చూసుకుని రెచ్చిపోయాడు.

"అసలు పిల్లలందరికీ ఆ బూతుపాటలకు రికార్డ్ డాన్స్‌లు గిట్ట చేయటం నేర్పిం

చినోళ్ళెవళు? దమ్ముంటే ఆ పేరెంట్స్ నడ గండ్రి! మాకెందుకడుగుతున్రు?"

"అతను చెప్పేది నిజమేమరి! అసలి దంతా ఈ ఫాల్తూ టి.వి. చానెల్స్ ప్రభావమండీ! సినిమాల్లోని బూతంతా ఏరి ప్రత్యేక కార్యక్రమాల కింద రోజూ చూపిస్తొంటే పిల్లలు పాడవకుండా ఎలా ఉంటారు?" అంటూ అవధాని ఆవేశంగా శంకరమూర్తిని సపోర్ట్ చేశాడు.

"అసలిలాంటి కార్యక్రమాలు టీవీ ఛానెల్స్ చూపిస్తొంటే గవర్నమెంట్ ఏం చేస్తోంది?" ఇంకెవరో అరచారు.

వెంటనే ప్రెసిడెంట్ హమీద్ మియా మైక్ లాక్కున్నాడు.

"గవర్నమెంటంటే ఎవళురా భయ్? మనమే కదా! పిల్లగాళ్లను పక్కన కూసో బెట్టి టీవీలో వచ్చే అడ్డమయిన చెత్తా చూపిస్తొంటే ఆ పిల్లగాళ్ళేం చేస్తయ్ పాపం?"

అందరూ బిగ్గరగా అరచుకుంటూ మాట్లాడటం మొదలుపెట్టేసరికి లేడీస్ వింగ్ ప్రెసిడెంట్ షైనీ స్టేజ్ మీద కొచ్చి 'సెలెన్స్' అంటూ అరచింది.

షైనీ అంటే అపార్ట్‌మెంట్స్‌లో చాలా మందికి అట్రాక్షన్!

అందుక్కారణం షైనీ మోడ్రన్‌గా డ్రస్ చేసుకుంటుంది. సెక్సీగా, అందంగా ఉంటుంది. అందుకే అందరూ ఏదొక వంక మీద ఆమెతో కల్పించుకుని మాట్లాడుతుంటారు.

ఆమె ఏం అడిగినా ఓకే!

ఏం చెప్పినా ఓకే! యూత్‌లో చాలా మంది ఆమెకు లైన్ వేస్తూంటారు గానీ ఆమె వాళ్ళను ఎంతదూరంలో ఉంచాలో అంత దూరంలో ఉంచగలదు. అదెలాగంటే - ఆమె కరాటే బ్లాక్ బెల్ట్! ఒకసారి అర్ధరాత్రి ఆమె కాల్ సెంటర్ నుంచి స్కూటీ మీద ఇంటికొస్తొంటే తాగుబోతులిద్దరు అడ్డుతగిలారు. స్కూటీకి స్టాండ్ వేసి ఇద్దరికీ చెరో కిక్ ఇచ్చి తనే అంబులెన్స్‌కి ఫోన్‌చేసింది.

"ఇప్పుడు మా లేడీస్ అంతా కోరుతుందేంటంటే డాన్స్‌ల పేరుతో బూతు విన్యాసాలు చేయించిన కల్చరల్ శెక్రటరీ రాజీనామా చేయాల్సిందే" అంది షైనీ.

"అయ్ సపోర్ట్ షైనీ" అంటూ వేదిక మీద కొచ్చాడు బాచులర్ కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి షైనీకి లైట్ కొట్టడం మొదలు పెట్టి సంవత్సరం అయిపోయింది గానీ ఇంతవరకూ ఆ వ్యవహారం ఒక్క ఇంచ్ కూడా ముందుకి జరుగలేదని వాచ్‌మెన్ సింగినాధం ఎప్పటికప్పుడు అందరికీ న్యూస్ రిలీజ్ చేస్తూంటాడు.

కృష్ణమూర్తి, షైనీల గురించే కాదు. మా అపార్ట్‌మెంట్స్‌లో సీక్రెట్‌గా జరిగే సక్రమ, అక్రమ సంబంధాల గురించీ, రెండో నెంబరు దందాల గురించీ, రియల్ ఎస్టేట్ గురించీ- సర్వస్వం- అరగంటకోసారి న్యూస్ రిలీజ్ చేస్తూంటాడు సింగినాధం.

కృష్ణమూర్తి అలా ఓపెన్‌గా ప్రతివిషయానికీ 'అయ్ సపోర్ట్ షైనీ' అంటూ తన వెనుకే తిరగటం షైనీకి నచ్చటం లేదు.

"నాకిప్పుడు సపోర్ట్ అవసరమా?" అనడిగిందతని వేపు తిరిగి. అక్కడున్న చాలా మంది భార్యాభర్తలు కూడా షైనీని సపోర్ట్ చేశారు. దాంతో హమీద్ మియా కంగారుపడి మైక్ అందుకున్నాడు.

"దేఖో భాయియో- అండ్ బెహనో! భారత కల్చర్, తెల్గూ కల్చర్ అంటే నాకూ ఇజ్జత్ ఉన్నయ్! గట్లనే హమారా ఉర్దూ కల్చర్ భీ మంచి గుంటయ్! ఫిర్‌భీ- ఈ ఛోటీసీ బాత్ కేలియే- శంకర్‌మూర్తీనీ రిజైన్ చెయ్ అనటం- మంచిగ లేవ్! ఆప్ భీ- ఇంకోసారి- ఆలోచన చెయ్-" అన్నాడు.

"ఇగో- నువ్ శంకర్‌మూర్తిని సపోర్ట్ చేస్తున్నావ్ గనుక మొత్తం మీ కమిటీ

# అతి వృద్ధురాలైన బ్లాగర్




స్పెయిన్‌లోని ముక్సియా అనే ఊరిలో మేరియా అమేలియా లోపెజ్ డిసెంబర్ 23, 1911న పుట్టింది. ఆవిడ మనవడు డిసెంబర్ 2006లో జరిగే ఆవిడ తొంభై ఆరో పుట్టిన రోజునాడు, ఆమెకి ఓ బ్లాగ్‌ని బహూకరించాడు. ఇంటర్నెట్ వినియోగించడం, బ్లాగ్‌ని రాయడం తదితర విషయాలను ఆమెకి నేర్పించాడు. ఆమె ఒక బ్లాగ్‌ను ప్రారంభించింది. అందులో ఆమె స్పానిష్ భాషలో తన గత జీవితంలోని జ్ఞాపకాలని, పనివాళ్ల హక్కులు, ఫ్యాషన్ తదితర అనేక విషయాల మీద అప్పటినుంచీ రాస్తోంది. ప్రపంచంలోని వివిధ దేశాలనుంచి వేలమంది పాఠకులు ఆ బ్లాగ్‌ని ఆసక్తిగా చదువుతున్నారు. పాఠకులు ఆమెని లిటిల్ గ్రానీ అని పిలుస్తుంటారు.



ప్రతిరోజూ వీలుకాకపోతే కనీసం వారానికోసారి అయిన ఆమె తన బ్లాగ్‌లో రాస్తుంటుంది. తన కాళ్లవాపు గురించి, డాక్టర్ దగ్గరికి వెళ్లిరావడం, తన అనారోగ్యం గురించి... ఇలా అనేక స్వవిషయాలగురించి రాస్తుంటుంది.

నిజానికి అరవై అయిదేళ్ల వయసు పైబడ్డవారిలో ఇంటర్నెట్‌ని ఉపయోగించేవారు బాగా తక్కువ. ఓ సర్వే ప్రకారం డెబ్బై నాలుగేళ్లు పైబడ్డవారు ఎన్నడూ ఇంటర్నెట్‌ని బ్రౌజ్ చేసి ఉండరు. ఆ వయసులో అలా చేసినవారి శాతం 2.5 మాత్రమే. అలాంటిది తొంభై ఆరేళ్ల అమేలియా ఏకంగా బ్లాగ్‌లు బ్లాగ్‌లు రాయడం విశేషమే.

"ఇంటర్నెట్ నాకు జీవితాన్నిచ్చింది. అంతకు మునుపు జీవితం నిస్సారంగా ఉండేది" రాయిటర్స్ వార్తా సంస్థకిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పిందామె.

బ్రెజిల్, రష్యా, జపాన్ మొదలైన దేశాల నుంచి ఆవిడకి ఉత్తరాలు వస్తుంటాయి. బ్రెజిల్‌నుంచి వచ్చిన ఓ అభిమాన పాఠకురాలు ఆమెతో తీయించుకున్న ఫొటో బ్లాగ్‌లో చూడొచ్చు.

"నాకన్నా ముసలివాళ్లు ఇంటర్నెట్‌ని ఉపయోగిస్తే, వారు నాకన్నా చిన్నవాళ్లని అర్థం" అదే ఇంటర్వ్యూలో చెప్పిందావిడ.

ఆ తర్వాత ఆస్ట్రేలియాకి చెందిన 108 ఏళ్ల ఆవిల్‌రైలే కూడా ఓ బ్లాగ్‌ని నడుపుతోంది. దానిపేరు ALL ABOUT OLIVE. COM. AU. "ధనం, లింగం, విద్య కన్నా ఇంటర్నెట్ ఉపయోగంలో చిన్నవారి వయసు ఎక్కువ ప్రాధాన్యం వహిస్తోంది"- స్పెయిన్ పారిశ్రామిక మంత్రి డోమింగో లబోర్డా రాయిటర్స్‌కి ఇచ్చిన ఓ ఇంటర్వ్యూలో చెప్పాడు.

రిజైన్ చేయాలి" అంటూ ఇంకొందరు అరిచేసరికి హమీద్‌మియా కంగారు పడ్డాడు.

శంకర్‌మూర్తిని సపోర్ట్‌చేస్తే తన పదవి ఊడి పోద్దేమోనని భయపడ్డాడు.

"ఠీక్ హై! ఠీక్ హై! మీరు అంత స్ట్రాంగ్‌గా ఫీల్ గిట్ట అయితే గిప్పుడు నేను శంకర్‌మూర్తిని ఎక్స్‌ప్లనేషన్ ఇమ్మనికోరుతుంది" అన్నాడు. దాంతో శంకర్‌మూర్తికి వళ్లు మండిపోయింది. హమీద్‌మియా చేతిలో నుంచి మైక్ లాక్కుని "ఆ పిల్లలు చేసిన రికార్డ్ డాన్సుల్లో ఎవరు ఏ పాటకు డాన్స్ చేయాల్సిందీ నిర్ణయించింది ఆ పిల్లల తల్లులే! కనుక ఆ ఎక్స్‌ప్లనేషనేదో వాళ్ల తల్లుల్నే అడగాలి-"అన్నాడు.

దాంతో అందరూ సైలంటయిపోయారు.

"అబద్ధం లేడీస్ ఎప్పటికీ అలాంటి డాన్స్‌లు సెలక్ట్ చేయరు" అంది షైనీ.

"చేశారు- కావాల్నంటే వాళ్ళనిప్పుడే స్టేజ్ మీదకు లాగండి!" అన్నాడు శంకరమూర్తి ఇంకా రెచ్చిపోతూ.

హమీద్‌మియాకి ధైర్యం వచ్చింది.

"అరే మొహిందర్‌సింగ్! ఆ పిల్లల తల్లులు ఇక్కడెవరయినా ఉంటే స్టేజ్ మీదకు పంపు-" అంటూ వైస్ ప్రెసిడెంట్ మొహిందర్‌సింగ్‌కి చెప్పాడు.

సీతావరదరాజన్ కోపంగా లేచింది.

"యా! మా పాప ఏపాట పాడాలో నేనే సెలక్ట్ చేస్తిని- అయితే ఏమి? " అంటూ టామిళ్ యాక్సెంట్‌తో అదరగొట్టింది.

"షేమ్‌షేమ్" అంటూ అరచారు వింధ్యాదేవి అండ్ కంపెనీ. వాళ్ళలా షేమ్ అని అరవడంతో సీతావరదరాజన్‌కి తమిళ్ కోపం వచ్చేసింది.

"ఏమి? షేమ్‌షేమ్ అంటారు? నా పిల్లలు ఏమి సాంగ్ పాడాలో, ఏమిడాన్స్ చేయాలో నేనుదా నిర్ణయం జేస్తాను? కోశ్చేన్ చేయటానికి నీవెవరు? వాయుముడప్పా!" అంటూ గట్టిగా అరచేసరికి అంతా సైలెంటయిపోయారు.

"సూస్తారేమి? సమాధానం సోల్లుంగో! తెలుంగు సినిమాల నిండా బూతు పాటలు, బూతు డాన్సులు. పదిసార్లు సూస్తారు- ఇంకా తెలుగు కల్చర్ రొంబగొప్పది అంటారు! నా పిల్లలు అదే పాటపాడితే 'ఛీఛీ' అంటారు. ఎన్న అన్యాయం ఇది? ధూ! అన్నీ పాలిటిక్స్-" అంటూ వెళ్లిపోయింది. అందరూ ఆ షాక్‌నుంచి కోలుకుంటూండగానే దీపామెహతా తన పాపతో మైక్ ముందుకొచ్చింది.

"హాంజీ! హమారీ బచ్చీ జోగీత్‌కోనా చీహై, ఓ గీత్‌మైనే చునీతో! తో క్యాహువా? హమారీ బచ్చీహై, హమారీ మర్జీహై! బీచ్‌మే తుమ్‌కౌన్‌హో తేహో బోల్‌నేవాలే? " అంటూ ఛాలెంజ్ చేసేసరికి అంతా డంగైపోయారు.

సునీత వెంటనే తన అభిప్రాయం ఎనౌన్స్ చేసింది. "ఇకనుంచీ కల్చరల్ కార్యక్రమాలేం జరుపదల్చుకున్నా మా లేడీస్ వింగ్‌లో మెంబర్స్‌తో సంప్రదించి మా సూచనలు అమలు చేయాలి! లేడీస్ అయితేనే ఎక్కడా 'అసభ్యం' అనేది లేకుండా డిగ్నిఫైడ్‌గా కార్యక్రమాలు రూపొందించగలరు-" ఆమె సూచనలను అమోదిస్తున్నట్లుగా మెంబర్స్ అందరూ తప్పట్లుకొట్టి మద్దతు తెలియజేశారు.

కానీ శంకరమూర్తికి మాత్రం ఆ ప్రపోజల్ నచ్చినట్లులేదు.

"అన్నీ లేడీస్ చూసుకునేట్లయితే ఇంక కల్చరల్ పోస్టెందుకండీ? ఇప్పుడే రిజైన్ చేస్తున్నా!" అన్నాడు ఆవేశంగా.

విజయ్ యాదవ్ అర్జంటుగా కాగితం పెన్నూ తెచ్చి అతని ముందుంచాడు.

"రిజైన్ చేస్తానంటివిగా! ఇదిగో కాయితం, పెన్నూ!" అన్నాడు.

కల్చరల్ శెక్రటరీ పదవికి శంకరమూర్తితో పోటీచేసి రెండు ఓట్ల తేడాతో ఓడి

పోయాడతను. అప్పటి నుంచీ ఏదోకరోజు శంకరమూర్తిని లేపేసి తనాపోస్ట్ చేజిక్కించుకోవాలని ప్లాన్లో ఉన్నాడు.

శంకరమూర్తి అతని ప్లాన్ని ఇట్టే పసిగట్టేశాడు.

"రాస్తానండీ! ప్రెసిడెంట్‌గారిని ఒకే అనమనండి!" అంటూ కౌంటరేశాడు. ఆ డైలాగ్‌తో హమీద్‌మియా గాబరాబడ్డాడు.

షైనీ ఇంక కల్పించుకోకుండా ఉండలేకపోయింది.

"మిస్టర్ శంకర్ మూర్తీ! ప్లీజ్ లిజెన్! మీ రెజిగ్నేషన్ వల్ల ప్రాబ్లెమ్ సాల్వ్ కాదు. మా లేడీస్ అందరూ కోరుతోందేంటంటే ఏ ప్రోగ్రామ్స్ జరిపినా వాటిల్లో ఎక్కడా అశ్లీలం, అసభ్యం అనేది ఉండకూడదు. అదే మేము కోరేది. ఎందుకంటే మన అపార్ట్‌మెంట్స్‌లో ఉంటోన్న ఫామిలీస్ని మీరు గమనించే ఉంటారు. ఎంత డిగ్నిఫైడ్‌గా ఉంటారు? అవునా, కాదా? "

"అవును" అంటూ అరిచారు లేడీస్.

"అయ్ సపోర్ట్ షైనీ" అన్నాడు కృష్ణమూర్తి అలవాటు చొప్పున. షైనీ విసుగ్గా చూసేసరికి కంగారుపడ్డాడు.

"కనుక ఇలాంటి సున్నితమయిన విషయాలన్నీ మగాళ్లందరూ దృష్టిలో పెట్టుకుంటే మనం కండక్ట్ చేసే ప్రోగ్రామ్స్ అన్నీ బాగానే ఉంటాయ్-" అంది షైనీ.

అంతలో అక్కడకి ఒక టీవీ చానెల్ వాన్ వచ్చింది. ఫేమస్ యాంకర్ మయూరి, కెమెరా యూనిట్‌తో దిగింది.

టీవీ కెమెరా అనగానే తెలిందేముంది? లేడీస్ ఆమె చుట్టూ మూగిపోయారు.

"హలో లేడీస్ అండ్ జెంటిల్‌మేన్! ఇప్పుడు మా తుగ్లక్ టి.వి. చానెల్ వాళ్లు నిర్వహిస్తోన్న 'నీస్టెప్స్- నా హిప్స్' కార్యక్రమం లైవ్‌గా కవర్ చేస్తున్నాం. మీరు చేయాల్సిందేమిటంటే మీ ఆయన్తోగానీ లేక మీ బాయ్‌ఫ్రెండ్‌తోగానీ మీకిష్టమయిన సినిమా పాటను పాడుతూ డాన్స్ చేయాలి. బాగా చేసిన జంటకు ఒక పోర్టబుల్ టీవీని బహుమతిగా ఇస్తారు జంగ్లీ ఎలక్ట్రానిక్స్ వారు. మరి ముందుగా వచ్చే జంట ఎవరు? "

ఒక్కసారిగా లేడీస్ అంతా ఒకర్నొకరు తోసుకుంటూ ముందుకొచ్చారు.

"అందరూ ఒకేసారి వస్తేఎలా? జంటలందరికీ కూడా మా తుగ్లక్ టీవీ అవకాశం ఇస్తుంది గనుక మీరు తొందర పడాల్సిన అవసరం లేదు-"

అంతలో వింధ్యాదేవి, వాళ్ళాయన వీర్రాజుని ఈడ్చుకొచ్చేసింది.

"మీ పేరేంటి? " అడిగింది యాంకర్.

"వింధ్యాదేవండీ"

"ఈయన మీవారా? మీ పేరేంటండీ? "

"వీర్రాజండీ!"

"మీకు పెళ్ళి ఎప్పుడయింది? "

"పదిహేనేళ్ళయిందండీ? "

"పెళ్ళయి పదిహేనేళ్ళయినా ఇద్దరూ హ్యాపీగా ఉంటానికి కారణం? అయ్‌మీన్ మీ ఆవిడలో ఏం ప్రత్యేకత ఉంది? "

"కొంచెం లావుగా వుంటుంది కదండీ! అందుకని కంపల్సరీగా అన్యోన్యంగా ఉండాల్సి వస్తుందండీ!"

"ఫెంటాస్టిక్ రిప్లయ్ వీర్రాజుగారూ- మీరిప్పుడు మీకిష్టమైన డ్యూయెట్ పాడుతూ డాన్స్ చేయాలి- ఏ పాట పాడతారు? "

"ఆరేసుకోబోయి పాట మాకెంతో ఇష్టమండీ!"

"ఓ.కే. కారీఆన్! అచ్చం ఎన్టీఆర్‌లాగానే స్టెప్స్ వేయాలి వీర్రాజుగారూ- వింధ్యాదేవిగారూ కమాన్ స్టార్ట్"

ఇద్దరు ఆ పాటకు డాన్స్ చేస్తుంటే వింధ్యాదేవి సెక్సీ భంగిమలు చూసి యూత్ అంతా విజిల్స్ వేశారు.

వీర్రాజు సరేసరి- తాగినోడు తూలుతు

న్నట్లు డాన్స్ లాంటిది చేశాడు. మధ్యలో వింధ్యాదేవి హిప్స్‌మీద చేత్తో కొడుతూంటే యాంకర్ కెమేరాని వింధ్యాదేవి హిప్స్‌మీదే క్లోజ్ యాంగిల్ పెట్టించింది.

మధ్య మధ్యలో యాంకర్ కూడా నాలుగు స్టెప్స్ వేస్తూ భార్యాభర్తల మధ్యలో దూరింది. అందరూ విజిల్స్ వేశారు.

ఆఖర్లో వింధ్యాదేవి విజృంభించి చాలా అసభ్యకరంగా నడుము ఊపుతూంటే అందరూ షాకయి చూస్తుండిపోయారు.

"ఒండర్‌ఫుల్ వింధ్యాదేవిగారూ! వీర్రాజు గారు కూడా చాలా రసికులే! మీకే బహుమతి వస్తుందని నాకనిపిస్తుంది. మరి జడ్జి ఏం చేస్తాడో చూడాలి!" అంది యాంకర్.

"జడ్జ్‌గారెక్కడున్నారండీ" అడిగాడు వీర్రాజు.

"అదిగో- ఆ బుట్ట పట్టుకుని పల్లీలమ్ముతున్నాడు చూడండి! వాడే! రోడ్‌మీద కనబడితే జడ్జీగా ఉండమని తీసుకొచ్చాను- మా తుగ్లక్ చానెల్ 'మాస్‌నే జడ్జీలుగా పెట్టాలని పాలసీ డెసిషన్ తీసుకుంది-"

అంతలో- అసభ్య నృత్యాలకు వ్యతిరేకంగా వేదిక మీద ఉపన్యాసం ఇచ్చిన సంధ్యాదేవి కూడా వాళ్ళయనతో వచ్చింది.

"మీరే పాటకు డాన్స్ చేస్తారు సంధ్యాదేవిగారూ!" అడిగింది యాంకర్.

"అమ్మనీ తీయనీదెబ్బ- ఎంతకమ్మగా వుంది రోయబ్బా-"

"ఓ ఒండర్‌ఫుల్! నాకూ ఈ పాటంటే ఎంతో ప్రాణం! కమాన్ స్టార్ట్-" అనగానే సంధ్యాదేవి, లావుపాటి వాళ్ళాయనా కలసి పరమ నికృష్టంగా డాన్స్‌లాంటిది చేస్తూ బహుమతి కోసం సెక్స్ భంగిమలతో నడుము, ఛాతి ఊపుతూ ఒకరినొకరు అచ్చం సినిమాల్లోలాగా కౌగిలించుకుంటూ ముద్దులు పెట్టుకుంటూ ఎగుర్తూ గంతులేశారు.

యాంకర్ తప్పట్లు కొట్టేసింది సంతోషం భరించలేక.

ఆ రకంగా పద్నాలుగు జంటలు విచ్చలవిడిగా డాన్స్‌లు చేశాక జడ్జి -సునీతాదేవినీ ఆమె భర్తనీ 'బెస్ట్ డ్యూయెట్ కపుల్'గా ఎన్నిక చేశాడు.

"వాళ్ళనే ఎందుకు ఎన్నుకున్నావ్?" పల్లీలవాడ్ని అడిగింది యాంకర్.

"అందరు లేడీస్‌లోకీ ఆవిడే ముమైత్‌ఖాన్‌లాగా నడుము ఎత్తెత్తి ఊపింది మేడమ్! చెస్ట్ కూడా బాగానే ఊపింది! నిజం చెప్పాలంటే నేను చిన్నప్పుడు మెచ్చుకున్న జ్యోతిలక్ష్మి కంటే కూడా బాగా ఊపారు ఈ లేడీసంతా-" అందరూ తప్పట్లు కొట్టారు.

సునీతాదేవికి పోర్టబుల్ టీవీ బహుమతిగా అందజేస్తూంటే శంకరమూర్తి ఠక్కున మధ్యలో అడ్డువచ్చాడు.

"వన్‌మినిట్ యాంకర్‌గారూ! ఇప్పటిదాకా వీళ్లందరూ చిన్న పిల్లలు చేసిన రికార్డ్ డాన్స్‌లు చాలా అశ్లీలంగా అసభ్యకరంగా ఉన్నాయని నన్ను దుమ్మెత్తిపోశారు.

కానీ ఇప్పుడు టీవీలో కనబడాలనే పిచ్చితో, ఆ పోర్టబుల్ టీవీ గెలవాలనే అత్యాశతో మొత్తం సభ్యత, సంస్కారం అన్నీ తెలుగు గంగలో వదిలేసి- సినిమాల్లో డబ్బుకోసం కక్కుర్తిపడి వళ్ళంతా చూపిస్తూ సెక్స్ డాన్స్‌లు చేసే వాళ్ళకన్నా అన్యాయంగా సెక్సీ భంగిమలు ప్రదర్శిస్తూ నికృష్టమయిన నృత్యాలు చేశారు. వీళ్ళకు తోడు వీళ్ళ భర్తలు! వాళ్ళడాన్స్‌లు చూస్తేనే ఎలర్జీ వచ్చేసింది-

ఛీ! వీళ్ళంట- నాకు తెలుగు సంస్కృతి గురించీ పాఠాలు చెప్తారంట! ఇలాంటి తల్లిదండ్రులున్న పిల్లలు పెద్దయ్యాక ఏమవుతారో అందరూ తేలిగ్గా ఊహించుకోవచ్చు-!!" అనేసి అక్కడినుంచి వెళ్ళిపోయాడు. అందరూ షాకై చూస్తూండిపోయారు.



# పురాతన పానశాల

జనవరి 2, 2008న మెక్సికోలోని ఎల్ ని వెల్ అనే పురాతనమైన బార్‌ని మూసేసారు. దీన్ని నిరసిస్తూ ఓ మెక్సికన్ జాతీయ సాంస్కృతిక స్వచ్ఛంద సంస్థ సభ్యులు ఈ బార్ బయట నిరసనలని, బీర్ తాగుతూ తెలియజేసారు.

ఈ బార్‌ని అద్దెకిచ్చిన నేషనల్ అటానమస్ యూనివర్సిటీ ఆఫ్ మెక్సికో దాన్ని ఖాళీ చేయమని కోరితే ఎల్ నివెల్ బార్ యజమాని రూబెన్ అగూరే అభ్యంతరం చెప్పాడు. దీంతో యూనివర్సిటీవారు కోర్టుకి వెళ్లారు. కేసు పరిశీలించాక ఎల్ నివెల్ బార్‌ని మూసేసి, భవంతిని ఖాళీ చేయాల్సిందని తీర్పు వచ్చింది. ఇక చేసేది లేక జనవరి 2న బార్‌ని మూసేసారు. 1855 నించి ఈ బార్ నడుస్తోంది. ఓ నిరసనకారుడు మార్కో రేస్కో బార్‌ని తిరిగి తెరవాలన్న విన్నపం మీద నిరసనకారుల సంతకాలు తీసుకున్నాడు. దాన్ని యూనివర్సిటీ అధికారులకి పంపాడు.

"జీవితమనే విశ్వవిద్యాలయంలో పాఠాలు నేర్చుకునే ప్రదేశం ఎల్ నివెల్" చెప్పాడతను.




ఒకవేళ యూనివర్సిటీవారు తమ విన్నపాన్ని కొట్టిపారేస్తే, మెక్సికో సిటీ ప్రభుత్వాన్ని ఎల్ నివెల్‌కి తిరిగి లైసెన్స్ మంజూరు చేసి, అది కొనసాగేలా చూడమని కోరతామని కూడా అతను చెప్పాడు.

ఆ బార్‌లో 1863లో తీసిన ఆనాటి బార్ ఫొటోని చూడొచ్చు. 1855లో జారీ చేసిన



తొలి లైసెన్స్‌ని, దానికున్న చారిత్రాత్మక విలువ వల్ల ఓ బ్యాంక్ లాకర్‌లో దాచి ఉంచారు.

ప్రసిద్ధ నాయకులు అనేకమంది ఈ బార్‌కి హాజరయ్యారు. క్యూబన్ ప్రెసిడెంట్ ఫెడల్ కాస్ట్రో 1955లో మెక్సికో సిటీలో నివసించినప్పుడు ఎల్ నివెల్‌కి వెళ్లేవాడు. గెరిల్లా తిరుగుబాటు నాయకుడు ఎర్నెస్టో చే గువేరా కూడా దీనికి వచ్చేవాడు. 19వ శతాబ్దపు మెక్సికన్ అధ్యక్షుడు సెబాస్టియన్ వెర్డో, 1994 నుంచి 2000 దాకా మెక్సికో అధ్యక్షుడైన ఎర్నెస్టో జడిల్లో అక్కడికి దగ్గరగా ఉన్న నేషనల్ ప్యాలెస్ నుంచి బార్‌కి వచ్చేవారు.

పాత భవంతులన్నీ కూలగొట్టి కొత్త అపార్ట్‌మెంట్స్, హోటల్స్, షాపింగ్ మాల్స్‌ని కట్టాలనే ఆలోచనతో దీన్ని ఖాళీ చేయించారు. స్థానిక కళాకారుడు రికార్డో రూయిడ్ ఈ విషయం మీద ఇలా అన్నాడు- "నా వయసు ఇప్పుడు 80. నేను నా పద్దెనిమిదో ఏట నుంచి ఇక్కడికి వస్తున్నాను."

సొంత వ్యక్తిత్వాన్ని ప్రోది చేసుకోవాలని ఎంతో తపన పడిన ఒకానొక కాసులమ్మ వికాసినిగా పరిచితమైంది. ఆ సరికొత్త పేరుతో గుర్తింపు లభిస్తున్న తరుణంలో పెళ్లి చేసుకుని మళ్లీ కాసులమ్మగా మారిపోయింది. చీటికీ మాటికీ మాటలతో సతాయించే భర్తచాటు భార్యగా ఆయన అడుగులకు మడుగులొత్తింది. అసలు కాసులమ్మకేమైంది? మొగుడైన మగవాడు ఆడదాన్ని స్వాతంత్ర్యాన్ని హర్షించడా? స్త్రీ మనోభావాలకు అద్దం పట్టిన వసుంధర రచన మిసెస్ కాసులమ్మ ఎలియాస్ వికాసిని ఈనెల చతుర కానుక.



రిసీవరెత్తగానే, "వికాసిని గారేనా?" అందో పురుషకంఠం.
"రాంగ్ నంబర్" అన్నాను అప్రయత్నంగా.
"ఐతే మీదే నంబరో చెబుతారా?" వినయంగా అన్నదా పురుషకంఠం.
"చెప్పను" అన్నాను చిరాగ్గా.
"చిరాకు పడకండి. నేను చేసిన నంబరు వికాసినిగారిదే. అందుకని అడుగుతున్నాను..."
"పేరు కాదు, మీక్కావాల్సిన నంబరు చెప్పండి" అన్నాను కాస్త సౌమ్యంగానే.
అతడు చెప్పిన నంబరు నాదే మరి. ఒప్పుకుంటే ఇంకా వేధిస్తాడని "సారీ- రాంగ్ నంబర్" అన్నాను వదుల్చుకుందుకు.
"పోనీ- మీరెవరో తెలుసుకోవచ్చా?" ఆ గొంతులో అర్థింపు.
కాసులమ్మ అన్న మాట పెదాల చివరిదాకా వచ్చినా, "చెప్పను" అని ఫోన్ పెట్టేశాను.
వికాసిని... ఎవరీ వికాసిని? ఆ పేరెక్కడో విన్నట్లే ఉంది...
పేరు వింటే మాత్రం ఆ ఫోను నాకెందుకు రావాలి?
ఆ వికాసిని ఫోను నంబరు నాదేనట. అది పరిచయం కోసం ఓ అపరిచితుడాడుతున్న నాటకమనుకుందామంటే, "పోనీ- మీరెవరో తెలుసుకోవచ్చా?" అని అర్థించాడతడు. అలా అడగడంలో నేనే వికాసిని అన్న నమ్మకం ధ్వనించింది.
నేను వికాసినినా?
అతడి నమ్మకానికి నవ్వొచ్చింది.
నేను వికాసిని కాకపోతే అతడు నాకెందుకు ఫోన్ చేస్తాడు? నేనేమైనా పదహారేళ్ళ పడుచుపిల్లనా... పరిచయం కోసం పురుష ప్రపంచం తహతహలాడ్డానికి!
నలభయ్యోపడికి దగ్గర్లో ఉన్నాను. ఇంజనీరింగు ఫైనలియర్లో ఉన్న కొడుకు, ఫస్టియర్లో ఉన్న కూతురు ఉన్నారు నాకు. అపరిచితులు స్వీట్ నథింగ్స్ మాట్లాడాలనుకునే వయసెప్పుడో దాటిపోయింది. పోనీ అని నేను మోడ్రనూ కాను. అసలు నా పేరే కాసులమ్మ. ఆ పేరుకు తగ్గట్లే ఉంటుంది నా రూపమూ, దినచర్యానూ.
ఫోను మళ్ళీ మోగింది. రిసీవరెత్తగానే మళ్ళీ అదే పురుషకంఠం వికాసిని గురించి అడిగింది.
ఈసారి రాంగ్ నంబర్ అని కూడా చెప్పలేదు. ఎలా తీసానో అలాగే ఫోన్ పెట్టేశాను.
అతడెవరో కానీ- వికాసినితో మాట్లాడాలనుకుంటున్నాడు. ఆ ఫోన్ నాకొస్తోంది.
ఎవరీ వికాసిని? ఆమెకీ నాకూ ఏమిటి సంబంధం?
వికాసిని...
పేరు బాగా పరిచితమనే అనిపిస్తోంది. ఆ పేరుతో నాకు చెప్పుకోతగ్గ సాన్నిహిత్యముందనిపిస్తోంది. ఎవరామె?
ఆలోచిస్తూనే ఉన్నాను. ఫోను మళ్ళీ మోగింది.
చిరాగ్గా రిసీవరెత్తి చెవులదాకా తేకుండానే క్రెడిల్ చేసాను. ఆ వెంటనే, "నేను వికాసిని కాదు. ఆ మాట ఎన్నిసార్లు చెప్పాలి?" అంటూ అరిచాను.
అసహనం. ఏమిటో తెలియదు. ఎందుకో తెలియదు...
నా కేకలు విని కాబోలు- "ఎవరితో నమ్మా మాట్లాడుతున్నావు?" అంటూ పక్కగదిలోంచి వచ్చింది అమ్మ.
అమ్మ పేరు వరలక్ష్మి. నుదుట రూపాయి కాసంత బొట్టుతో దేవతామూర్తి వరలక్ష్మినే గుర్తుకు తెస్తుందామె. కానీ నేనామాటంటే ఆమె ఏమాత్రం సంతోషించదు.
నాకు తెలుసు- అమ్మవైపు ఎలా

చూడాలో!

అలాగే చూశాను.

అనుకున్నట్లే అమ్మ నా చూపులకు భయపడినట్లుంది. జవాబుకోసం ఆగ కుండా, "ఎవరూ లేరా... సరేలే" అంటూ వెనక్కు తిరిగి మాయమైంది.

అప్పుడు నాకొచ్చింది అనుమానం. వచ్చిందీ వెళ్లిందీ అమ్మేనా?

ఆమె మాట వింటూనే ఆమె రూపా న్నూహించుకున్నాను. నేను అమ్మను చూశాననుకున్నాను. కానీ అప్పుడెవరైనా అడిగితే ఆమె ఏంచీర కట్టుకుందో చెప్ప లేను.

శబ్దం విని అటు తిరిగాను. ఆమె అక్క డున్నదని తెలుసు. తర్వాత వెళ్ళిపోయిం దని తెలుసు. వికాసిని ఎవరన్న ప్రశ్న పొగమంచై ఆమె రూపాన్ని నాకు అస్పష్టం చేసింది.

వికాసిని ఎవరు?

మళ్ళీ ఫోన్ మోగితే- ఈసారి అతన్ని ఆ విషయం అడిగి తెలుసుకోవాలి.

అప్పుడనిపించింది- అరే- ఈ పని ఇందాకనే చేయాల్సిందని!

ఆ వికాసిని ఎవరో కానీ అతడికి నా నంబరిచ్చి ఉంటుంది. అంటే ఆమె నాకు బాగా తెలిసిన వ్యక్తి అయ్యుండాలి. నేను కాస్త సహనం చూపి అతణ్ణించి పూర్తి వివ రాలు తెలుసుకుని ఉండాల్సింది. పాపం ఆ వికాసినికీ ఫోను ఎంత అవసరమో ఏమో!

పోనీ- అతడి నంబరుకు నేనే ఓ సారి ఫోన్ చేస్తే....?

వెంటనే గుర్తొచ్చింది- నా ఫోన్‌కి కాలర్ ఐడీ లేదని. ఆ వెంటనే నాలో ఉక్రోషం తన్నుకొచ్చింది.

ఆ ఇంట్లో రెండు ఫోన్ కనెక్షన్లు న్నాయి. ఒకటి మా వారికోసం. ఒకటి నా కోసం.

ఆయన ఫోన్‌కి కాలర్ ఐడీ లేదు. నా ఫోన్‌కుంది.

"నాకెవరెవరు ఫోన్లు చేస్తున్నారో నీకు తెలియకూడదు. నీకెవరెవరు ఫోన్లు చేస్తు న్నదీ నాకు తెలియాలి. అందుకే ఈ ఏర్పాటు" అన్నారాయన.

"మీకో న్యాయం, నాకో న్యాయం- ఇది చాలా అన్యాయం" ప్రొటెస్ట్ చేశాను.

"ఇద్దరికీ చెరో న్యాయమని నువ్వే అంటూ మళ్ళీ అన్యాయమంటావేమిటి? "

మాటలకు మెలికలు పెట్టడంలో ఆయ నకాయనే సాటి. పదాలను తూచి తూచి వాడ్డం నాకలవాటు లేదు. అందుకే వాదో పవాదాల్లో ఎప్పుడూ ఆయనదే పైచేయి.

"సరే- మీరీ ఏర్పాటెందుకు చేసినట్లు? నామీద మీకనుమానమా? "

"అలాగని ఎప్పుడైనా నేనన్నానా? "

"మరి నా ఫోన్‌కి కాలర్ ఐడీ ఎందుకు? " రెట్టించాను.

"అలా సూటిగా అడిగితే నేనే చెబుతా నుగా" అంటూ గొంతు సవరించుకున్నారా యన.

"మన దేశంలో ఆడవాళ్ళు ఎంత పవి త్రంగా ఉండాలనుకుంటారో- మగాళ్ళు అంతగా దారితప్పి చరించాలనుకుంటారు. అంచేత నీకు తెలియకుండానే నీ గురించి కూడా కలలు కనే వారెందరో ఉంటారు"

"ఛీ" అన్నాను అప్రయత్నంగా.

"అదిగో- అలా ఊహల్లోకి వెళ్ళిపోయి సిగ్గుపడిపోకు. నువ్వేదో అతిలోకసుందరి వని నేననడంలేదు. పొరుగింటి పుల్లకూర రుచి- అంతే! పరాయి ఆడదానివి. పెళ్ళైన దానివి. అందుకని ఎదుటపడి అడగా లంటే సంకోచం. అలాంటి వాళ్ళకోసం ఈ ఫోన్ సౌకర్యం వచ్చిందిప్పుడు. వాళ్ళు నీకు ఫోన్ చేస్తారు. నోటి దురద తీర్చు కుంటారు. నీక్కోపమొస్తుంది. తిడతావు. వాళ్ళక్కోపం రాదు. నీ గొంతు విని పర వశిస్తుంటారు. అలాగని నువ్వు లతామం

గేష్కరో, సుశీలో అనుకోకు. చెప్పానుగా- పొరుగింటి పుల్లకూర- అంతే!" ఆగారాయన.

ఆయనకు తెలుసు- నాలో రియాక్షనొస్తుందని. అందుకే ఆగేరు.

"సరే- ఇది నా సమస్య. మధ్య మీకు నష్టమేమిటంట? " అన్నాను ఈజీగా తీసుకున్నట్లు నటిస్తూ.

## కొత్తగాలి... 

పొగలేదు
సెగలేదు
మండుతుంది
ఆకలి కడుపు

–కాళహస్తి వెంకట శేషగిరిరావు, వాకాడు

"చూసావా- సాహిత్యంపట్ల అభిరుచి లేకపోవడంవల్ల వచ్చిన ఇబ్బంది ఇదే! నష్టం నీకైతే నా నష్టం గురించి అడుగుతున్నావు. రావూరి భరద్వాజగారు నీలాంటి ఆడవాళ్ళమీద జాలితోనూ, మగాళ్ళనేమో నా అంత గొప్పగా మార్చాలనీ బోలెడు కథలు రాసారు. ఒక్కటీ చదివుండవు. అందులో ఓ కథలో- ఓ ఇల్లాలికి ఎదురింటి మేడమీద కుర్రాడొకడు సైగలు చేస్తే భర్తకు ఫిర్యాదు చేస్తుంది. అందుకు భర్త భార్యనే తప్పు పడతాడు. క్రమంగా ఆమె ఫిర్యాదు చేయడం మానేస్తుంది. వాడు ఇంకా ఇంకా రెచ్చిపోయి ఓ రోజున ఆ ఇల్లాలింటికే వచ్చేస్తాడు. ఇప్పుడీ ఫోన్ కథా అంతే. నీకు ఫోన్ చేసినవాణ్ణి నువ్వు ఫోన్లో తిడతావే తప్ప ఆ విషయం నాదాకా రానివ్వవు. నువ్వూరుకున్నావని కనిపెడితే వాడు రెచ్చిపోతాడు. చివరికో రోజు ఇంటికొచ్చినా రావచ్చు..."

"ఛీ" అన్నాను అప్రయత్నంగా.

"ఛీ" అంటే వాడాగడు కాసులూ- చెప్పుతో కొట్టాలి. ఆ పని నీవల్ల కాదు. కాలర్ ఐడెంటిటీ ఉంటే- నీ సమస్య నేను తీర్చగలను" ధైర్యం చెబుతున్నట్లు అన్నారాయన.

"కానీ మీరు కాలర్ ఐడెంటిటీ చూసి అవతలి వ్యక్తి ఏం మాట్లాడిందీ తెలుసుకోలేరు కదా! నేను చెప్పాలి. కానీ నేనా విషయం మీదాకా రానివ్వనని మీరే అన్నారు. మరి నా సమస్య మీకెలా తెలుస్తుంది? " నిలదీసాను.

"అక్షరాల్ని మాటలుగా మార్చడానికి పెదాలు, నాలిక అవసరమని నీ ఉద్దేశం. కానీ నేను నీ ముఖం చూసి నీ మనసులోని మాటలన్నీ చదివేయగలను"

"కొయ్" అన్నాను చిలిపిగా.

ఆయన గంభీరంగా ముఖం పెట్టి, "కోతలు కాదు, అసలు నేనేమనుకుంటూంటానో తెలుసా? కాలేజీ రోజుల్లోనే నిన్ను పెళ్ళి చేసుకుని ఉండాల్సిందని" అన్నారు.

"ఏమిటీ- మాట మారుస్తున్నారు? " అన్నాను.

"మాటెక్కడ మార్చాను? కాలేజీ రోజుల్లోనే నువ్వు నా పెళ్ళానివైతే- నా చదువంతా నీచేత చదివించేవాణ్ణి. పరీక్ష రోజున నువ్వు నా ఎదుట నిలబడి ఉండడానికి అనుమతి తీసుకునేవాణ్ణి. నీ ముఖం చూస్తూ పరీక్షలు రాసి అన్ని సబ్జక్టుల్లోనూ నూటికి నూరు తెచ్చుకునేవాణ్ణి"

ఎక్కణ్ణించి ఎక్కడికి తీసుకెళ్ళారు? ఆయన ప్రతిమాట వెనుకా ఎంతో ఆలోచన ఉంటుంది. ఆ ఆలోచనలో నా తెలివికి అభినందన కూడా ఉందనిపించి గర్వపడ్డాను.

నా ముఖంలో ఆ గర్వాన్ని పసికట్టారేమో, "మరీ అంత గర్వపడిపోకు. జిరాక్సు వల్ల కాపీ తీయించుకున్నవాడికే ప్రయోజనం. జిరాక్సు మెషినుకు కాదు" అన్నారు.



# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టిపెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

★ 'చతుర'లో ప్రచురితమవుతున్న ప్రవేశికలలోనే సమాధానాలు నింపి గడువుతేదీలోపు కార్యాలయానికి అందేలా పంపించాలి. జెరాక్స్‌లు, తెల్లకాగితాలపై రాసిన జవాబులు పరిశీలనకు స్వీకరించరు.

★ 'మనసున ఉన్నదీ...' పాఠకుల శీర్షిక. 'చతుర' సంచికలపై, శీర్షికలపై తమతమ అభిప్రాయాలను స్వేచ్ఛగా, నిర్మొహమాటంగా వ్యక్తం చేసే వేదిక. స్పష్టంగా, క్లుప్తంగా పాఠకులు తమ అభిప్రాయాలను ఏనెల సంచికపై ఆనెల రాయండి.

## చతుర


**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

తెలివైనవాళ్ళు చిన్నబుచ్చినా సరదాగానే ఉంటుంది. నాకాయన చిన్నబుచ్చితే కోపం రావడం అరుదే. కానీ కోపం నటిస్తాను.

"మీరెక్కించేది ములగచెట్టని తెలుసు. ఐనా మీ మాయలోపడి పైకెళ్ళిపోతాను" అన్నాను.

"అందుకే మరి నీకు కాలర్ ఐడెంటిటీ! నేనే కాదు- నిన్నెవరైనా మాయలోనూ పడేయగలరు. ములగ చెట్టూ ఎక్కించగలరు" అన్నారాయన.

"అన్నింటికీ బాగా సమర్థించుకోవడం వచ్చు" అంటూ మూతి మూడు వంకర్లు తిప్పి- "మీరు కదా అని మాయలో పడ్డాను కానీ- ఇంకెవరైనా ఐతే ఇట్టే చెప్పు తీస్తాను" అన్నాను.

"అలా తేడా చూపించకూడదు. తియ్యాల్సినప్పుడు మొగుడిమీద కూడా చెప్పు తీస్తేనే మీ ఆడవాళ్లకు మోక్షం. లేదూ- ఇలా మగాడి కాలుకింద చెప్పులా పడుండాల్సిందే"

ఆశ్చర్యంగా ఆయన్ను చూశాను. ఆయనకు స్త్రీల సమస్యల గురించి లోతైన అవగాహన ఉన్నదనిపిస్తుంది. ఆయన మాటల్లోని కాఠిన్యం వెనుక ఏదో సందేశమున్నదనిపిస్తోంది.

"ఇలా- అంటున్నారు. నేను మీ కాలి కింద చెప్పుననా మీ ఉద్దేశం? " చిరాకు నటించాను.

"నేను నీ ఫోన్‌కి కాలర్ ఐడెంటిటీ పెట్టాను. నా ఫోన్‌కి పెట్టలేదు. నువ్వు ప్రతిఘటిస్తావా? అభ్యంతర పెడతావా? చెప్పు నీ సమాధానమే తేలుస్తుంది నువ్వు నా కాలికింద చెప్పువో, కాదో!"

"సంసారజీవితంలో ఇవి నాకు చాలా చిన్న విషయాలు. వీటిని నేను పట్టించుకోను. పెద్ద పెద్ద విషయాల్లో మిమ్మల్నెక్కడుంచాలో అక్కడుంచుతున్నాను"

"కాలికింద చెప్పు అనడం నీకు చిన్న విషయం" వ్యంగ్యంగా అన్నారాయన.

అది నాకూ ఆశ్చర్యంగా ఉంది. కాలి కింద చెప్పు అన్నది చాలా అవమానకరమైన పదం. నేనది ఎలా భరించాను?

ఆలోచిస్తే...

నేనాయన్ను ఇంతకంటే పెద్ద మాటలంటాను. ఒక పండక్కి చీర కొనమని ఎన్ని సార్లడిగినా పట్టించుకోలేదాయన.

"మీకేం చెప్పినా దున్నపోతుమీద వాన కురిసినట్లే" అన్నాను ఉక్రోషంగా.

"నన్ను దున్నపోతన్నావ్" హెచ్చరించారాయన.

నాక్కోపమొస్తే నోటికి అదుపుండదు. ఆయన హెచ్చరించినప్పటికీ మాట వెనక్కి తీసుకోలేదు సరికదా, "ఆకారానికే కాదు, బుద్ధులక్కూడా" అంటూ నొక్కించాను.

ఆయన నవ్వేసి వెళ్లిపోయారు. నాక్కోపం తగ్గాక అలా అన్నందుకు నాకే బాధనిపించింది. తర్వాత సారీ చెప్పాను.

"నువ్వన్న మాట నన్ను బాధించదు. నిన్ను బాధించకుండా చూసుకో" అన్నారాయన.

ఆయనక్కోపమొచ్చిందని నా అనుమానం. నేను మరీ మరీ సారీ చెబుతూంటే ఆయన నాకు పాత చందమామలోని ఓ భేతాళకథ చెప్పారు.

ఒక విదూషకుడు రాజును పిరికివాడనీ, కురూపి అనీ, చదువురానివాడనీ రకరకాలుగా నిందిస్తే ఆయన నవ్వుతూ వినోదిస్తాడు. విదూషకుడాయన్ను బట్టతలవాడ నగానే కోపం పట్టలేక జైల్లో పెట్టిస్తాడు. ఎందుకంటే అంతకుముందు విదూషకుడు చేసిన నిందలేవీ నిజాలు కావని అందరికీ తెలుసు. ఆయన అందగాడు, సాహితీవేత్త, పరాక్రమశాలి. కానీ ఆయనకు నిజంగానే బట్టతల ఉంది. ఎప్పుడూ తలకు పాగా ఉండడంవల్ల ఎవరికీ ఆ విషయం తెలీదు. ఉన్నమాట అనేసరికాయనకు ఉలుకొ

చ్చింది.

"నన్ను దున్నపోతంటే నాకు ఉలుకొచ్చిందనుకో. అది ఉన్నమాట ఐపోతుంది" అన్నారాయన.

అప్పుడు నవ్వకుండా ఉండలేకపోయాను. కానీ నా నోటిమీద నాకు అదుపుండదుకదా. ఆ తర్వాత కూడా ఎన్నో మార్లు ఆయనకు సారీ చెప్పాను.

"ఒకటికంటే ఎక్కువసార్లు సారీ చెప్పే మనిషి- ఆలోచించకుండా మాట్లాడుతూంటాడని అర్థం" అని హెచ్చరించారాయన.

అది నిజమని నాకు తెలుసు. నేను మాట్లాడినంత కటువుగా ఆయన మాట్లాడరు. అందుకే ఆయన నాకు సారీ చెప్పిన సందర్భాలు చాలా తక్కువ. ఇప్పుడు కూడా నన్నాయన కాలికింద చెప్పు అని నేరుగా అనలేదు. సూచించి ఊరుకున్నారంతే!

మరి నాక్కోపమొస్తే ఆయనన్నది ఉన్న మాటే ఐపోతుందన్న భయం కూడా నాలో ఉండొచ్చు. ఎలాగైనా మాటల్లో ఆయన్ని జయిద్దామని, "ఆడవాళ్ళ సహనానికి కారణం వాళ్ళ మంచితనం. దానికి పరీక్ష పెడితే ఫలితాలు ఘోరంగా ఉంటాయి" అన్నాను హెచ్చరిస్తున్నట్లు.

"మీ ఆడాళ్ళు మంచితనమనుకుంటారు. కానీ అది అసహాయత, అవకాశవాదం. ఇంకా చెప్పాలంటే సిగ్గులేనితనం. మీకు మనిషిగా ఆత్మగౌరవంకంటే- సమాజంలో హోదా ముఖ్యం. అసలు సిసలు ప్రేమ కంటే బూటకపు పొగడ్తలు ఇష్టం. ఈ బలహీనతలు కనిపెట్టి ఏదో రోజున మగాడు మీ బతుకులకు నిప్పంటిస్తాడు. ఆకులు పట్టుకుందామనుకునేసరికి చేతులు కాలిపోతాయి..."

ఆయన మాటల్లో ఆవేదన కలిసిన ఆవేశం.

అప్పుడు నిర్లిప్తంగా విన్నాను కానీ నిజంగానే ఆయన నా బతుకులో నిప్పులు పోస్తారనుకోలేదు. ఫోన్లో కాలర్ ఐడెంటిటీ చూసినప్పుడల్లా మనసులో కలుక్కుమనేది. ఏదో చేయాలనిపించేది. ఏమీ చేయలేదు కానీ ఆ విషయమై నాలో పేరుకుపోయిన కసి పరిణామం నా ఊహకే అందదు.

ఇద్దరు పిల్లల తల్లినని తెలిసీ ఆయన నిర్దాక్షిణ్యంగా నన్ను వదిలి తన దారి తాను చూసుకుంటే నేను చేసిన మొట్టమొదటి పని నా ఫోన్‌కి కాలర్ ఐడెంటిటీ తీయించివేయడం!




అలా తీయించి ఉండకపోతే ఇప్పుడు వికాసిని ఎవరో తెలిసేదేమో!

ఆలోచిస్తున్నాను- ఫోను మళ్ళీ మోగింది.

చటుక్కున రిసీవరెత్తి, "హలో- మీరేం చెప్పదల్చుకున్నదీ పూర్తిగా చెప్పండి. నేను ఓపిగ్గా వింటాను" అన్నాను.

"ఎవరూ- కాసులా? నేనమ్మా, అమ్మమ్మను. ఓసారి మీ అమ్మను పిలుస్తావా?"

అది నాకు చాలా ఇష్టమైన అమ్మమ్మ గొంతు. కానీ అప్పుడది అమ్మమ్మ గొంతు ఐనందుకు నిరుత్సాహం కలిగింది. ఇష్టాయిష్టాలు మూడ్‌మీద ఆధారపడి ఉంటాయికదా...

రిసీవర్ పక్కన పెట్టి పక్క గదిలోకి వెళ్ళాను.

అమ్మ కునికిపాట్లు పడుతోంది.

అమ్మమ్మ ఫోన్ చేసిందనగానే, "దానికి నిద్ర పట్టదు. నన్ను నిద్ర పోనివ్వదు" అని విసుక్కుంటూ లేచింది. అమ్మమ్మంటే అమ్మకూ ఇష్టమే. కానీ ఇష్టాయిష్టాలు మూడ్ మీద ఆధారపడి ఉంటాయి కదా...

ఐనా ఇప్పుడు మా ఇంట్లో అయినవాళ్ళు ఫోన్లు చేస్తే ఎవరికీ సంతోషంగా ఉండడం లేదు. మంచి మనసుతో చెప్పినా ఓదార్పు మాటలు వినడం కష్టం. ఓదార్పు తియ్యగానే ఉంటుంది కానీ తొందరగా మొహం మొత్తేది కూడా తీపే మరి!

★ ★ ★

ఫోన్లో అమ్మ మాటలు వినబడనంత దూరం వెళ్ళాలని చంద్రిక పడక గదిలో దూరాను.

లోపల మంచంమీద వెల్లకిలా పడుకుని నిద్రపోతోంది నా కూతురు చంద్రిక. దాని



గుండెలమీద సగం తెరిచిన పుస్తకం.

దగ్గరగా వెళ్ళాను. అది చదువుతున్న పుస్తకం ఇంజనీరింగుకు సంబంధించినదే. ఆ సబ్జెక్టెంత లోతైనదో అంతకుమించి అమాయకంగా ఉంది దాని ముఖం.

చంద్రికంటే ఆయనకు ప్రాణం అనుకునే దాన్ని. కానీ అంతా బూటకం.

"మగాడు స్వార్థానికి మారుపేరు. వాడెప్పుడు తన దారి చూసుకుంటాడో చెప్పడం కష్టం. బంధాలు, అనుబంధాలు వగైరాలన్నీ ఆడవాళ్ళకే. అవే వాళ్ళకు సంకెళ్ళవుతున్నాయి" అనేవారాయన.

ఆయనకు సంకెళ్ళు లేవు. నాకు మాత్రం ఇవి నేను తగిలించుకున్న సంకెళ్ళేకదా! ఆయనలాగే నా దారి నేను చూసుకుంటే...

అప్రయత్నంగా చంద్రిక ముఖంలోకి చూశాను.

ఆ ముఖంలో ఎంతటి అమాయకత్వముందో అంతటి ప్రశాంతతా ఉంది. నాన్న దగ్గర లేకున్నా నేనున్నాననేకదా- అదంత ప్రశాంతంగా ఉండగలిగింది?

బంధాలు, అనుబంధాలు తెంచుకోవడం నాకంత సులభం కాదు.

రెండేళ్ళక్రితం ఆయన నాతో, "నా మనసో అమ్మాయివైపు లాగుతోంది. తనూ నేనంటే మోజు పడుతోంది. ఆ ఆకర్షణనుంచి తప్పించుకోవడం కష్టమనిపిస్తోంది. అనుకోనిది జరిగితే నన్నపార్థం చేసుకోకూడదు" అన్నారు.

ఆయనకలా మాట్లాడ్డం అలవాటే. అందుకే నేనేమాత్రం చలించకుండా, "అంటే ప్రదీప్ గురించి నేనేం గిల్టీగా ఫీల వక్కర్లేదన్న మాట" అన్నాను.

"ప్రదీప్ ఎవరు? " ఆశ్చర్యంగా అడిగారాయన.

"ప్రదీప్ తెలియదూ- సుకన్య భర్త!"

"సుకన్య ఎవరూ? " అమాయకంగా అడిగారాయన.

నాకు తెలుసు. ఆయనేం అమాయకుడు కాదు. అమాయకత్వం నటిస్తారు. అది నటనే ఐనా ఆ ముఖానికి అమాయకత్వం ఎంత చక్కగా నప్పుతుందో!

"సుకన్య ఎవరు? " మళ్ళీ అడిగారాయన. ఈసారి ఆయన కళ్ళలో అసహనం, అనుమానం... అది నటన అని నాకనిపించలేదు. ఆయనలో చలనం కలిగించినందుకు సంతోషించాను.

నిజానికి ప్రదీప్, సుకన్యలెవరో నాకూ తెలియదు. ఆయనన్నదానికి సవాలుగా అప్పటికప్పుడు నేనా పేర్లను కల్పించాను. ఆయన కనిపెట్టేస్తారనే నా నమ్మకం. లేకుంటే అలా కల్పించలేనేమో!

"సుకన్య నా అంత బాగుండదు. ప్రదీప్ మీకంటే చాలా బాగుంటాడు..." అన్నాను కొంటెగా.

"అంటే మీ నాన్నగారిలా ఉంటాడన్న మాట" అన్నారాయన చటుక్కున.

"మధ్యలో మా నాన్నగారి ప్రసక్తి ఎందుకూ? " విసుక్కున్నాను.

"మరి నువ్వే ఓసారి- ఈ ప్రపంచంలో మీకంటే చాలా బాగుండే మగాడు మా నాన్నగారొక్కరే- అన్నావు నాతో- మర్చిపోయావా? "

ప్రయత్నించినా నవ్వాగక కిసుక్కున నవ్వాను. ఎప్పుడో అనురాగం పొంగిపొర లిన ఓ బలహీనక్షణంలో ఆయనతో నేనా మాట అన్నాను. అప్పుడాయన,

"మీ నాన్నగారి ప్రసక్తి తేవడానికిదా సమయం? " అన్నారు.

ఇప్పుడు సమయం చూసి ఆ మాట గుర్తు చేసారాయన, "మాటల్లో ఈ చాతుర్యం మీకెలా వచ్చిందండీ? " అన్నాను.

"ఏయ్- మాట మార్చకు. ప్రదీప్ గురించి చెప్పు..." అన్నారాయన.

**కొత్తగాలి...**

**బిల్లు చెల్లించకుండా**
**ఉచిత విద్యుత్**
**వాడుకునే మోతుబరి**
**ఆకాశం**

*-పోలేటి శ్రీనివాసరావు, విజయనగరం*

"చెప్పడానికేముంది? పెళ్ళికిముందే ప్రదీప్‌ని చూసుంటే అతణ్ణే పెళ్ళి చేసుకుని ఉండేదాన్ని" అన్నాను యధాలాపంగా అన్నట్లు.

"ఐతే ఓ పని చేయ్. నువ్వెళ్ళి ఆ ప్రదీప్ దగ్గర రెండ్రోజులుండి రా. నచ్చితే శాశ్వ తంగా వాడితో వెళ్ళిపో" ఆయనా యధా లాపంగా అన్నట్లే అన్నారు.

నేను మాత్రం తెల్లబోయి, "మీరేమంటు న్నారో మీకు తెలుసా? " అన్నాను.

"తెలుసు. నువ్వనలేనిది నేనన్నాను"

ఆయన ఉద్దేశం అర్థంకాక, "ఏమిటి నేన నలేనిది? " అన్నాను.

"నేనో అమ్మాయినిష్టపడుతున్నానని నీతో అన్నాను. ఆమెతో వెళ్ళిపొమ్మని నువ్వనగలిగేవా? "

"బాగుంది- అలా ఎలా అంటాను? "

"నమ్మకముంటే అనొచ్చు" తాపీగా అన్నారాయన.

ఉలిక్కిపడ్డాను. ఈ మాత్రం నాకు స్ఫురించలేదేమిటి?

ఆయన నన్ను నమ్ముతున్నారు. నేనా యన్ను నమ్మలేకపోయాను. అదీ అప్పుడు జరిగింది.

అటు తిరిగి ఇటు తిరిగి మా మాటల్లో ఆయన ఔన్నత్యం బయటపడుతుంది. నా వ్యక్తిత్వం చిన్నబోతుంది. లోపం ఎక్క డుంది?

"ప్రదీప్ నిజంగా ఉంటే మీరా మాట అనేవారా? " నా ప్రశ్న పేలవమని తెలుసు. ఐనా ఏదో ఒకటనాలని అన్నాను.

"నేనో అమ్మాయి అన్నానే తప్ప పేరు చెప్పలేదు. నువ్వేమో ప్రదీప్ అంటూ పేరు కూడా చెప్పావు. నాది ఊహ కావచ్చు. కానీ నీది కల్పన కాదనే అనుకో వాలి"

"ఐతే ఏమంటారు? "

"నువ్వు ప్రదీప్‌తో వెళ్ళిపో- నేనా అమ్మా యితో వెళ్ళిపోతాను..."

"ఛీ" సిగ్గు, విసుగు రెండూను.

"ఛీ ఎందుకు? ప్రదీప్ ఊహల్లోకొస్తు న్నాడా? "

"ప్లీజ్- నిజం చెబుతున్నాను. ఊరికే మిమ్మల్నేడిపించాలని ప్రదీప్ పేరు చెప్పాను. అంతా కల్పన" అంటూ కాళ్ళబే రానికొచ్చాను.

"ప్రదీప్ ఊహల్లో మనిషైతే నువ్వు వాణ్ణి ఊహల్లోనే చంపేయ్. బయటి మని షైతే నేను వాణ్ణి బయట చంపేస్తాను. వాడు బతికుండడానికి మాత్రం వీల్లేదు"

అది పురుషాహంకారమే కావచ్చు. నా మనసుకు సంతోషాన్ని కలిగించింది. ఆయనపై ప్రేమను పెంచింది. ముచ్చ టగా ఆయన్ను చూస్తూ, "ఎందుకీ

హత్యలు? " అన్నాను.

"నా పెళ్ళాం నాకే సొంతం" దృఢంగా అన్నారాయన.

"మరి నా మొగుడు నాకే సొంతమని నేననుకోకూడదా? "

"ఆడాళ్ళలా అనుకోరు..."

"మహా చదివార్లెండి- ఆడాళ్ళని..." నా మూతి వంకర్లు తిరిగింది.

"ఒక్కసారి బయటకెళ్ళు. ఏ థియేటర్లోనైనా ఇద్దరు మొగుళ్ళ పెళ్ళాం కథతో సినిమా ఆడుతుంటే చెప్పు. అప్పుడొప్పుకుంటాను- ఆడాళ్ళలా అనుకుంటారని"

ఏమనాలో తోచలేదు. ఇప్పుడున్న టాప్ హీరోలందరూ సినిమాల్లో ఇద్దరు పెళ్ళాల మొగుళ్ళుగా హిట్లు కొట్టిన వాళ్ళే. వాళ్ళకున్న ఆడవాళ్ళ ఫాలోయింగ్ తక్కువేం కాదు.

ఆయనకు ఆయన రూట్లోనే బదులివ్వాలనుకుని, "మీరనే అమ్మాయి- ఊహల్లో ఉంటే అక్కడే చంపెయ్యండి. నిజంగా ఉంటే ఎక్కడుంటుందో చెప్పండి. నేనెళ్ళి చంపేస్తాను" అన్నాను.

"ఆ అమ్మాయి ఊహ కాదు, నిజం. ఐతే ఆమె ఎవరో నేను నీకు చెప్పను"

"చెప్పకపోతే తెలుసుకోలేనా? " నా సవాలు.

"తెలుసుకున్నా ఆమెను చంపడం నీ వల్లకాదు" అదీ సవాలే!

"ఏం- మీరు ప్రదీప్‌ని చంపగలిగినప్పుడు నేనామెనెందుకు చంపలేను? " అనేసి నాలిక్కరుచుకున్నాను. ఇలాంటి ప్రశ్న వేస్తే ఆయనకు దొరికిపోయినట్లే. ఏదో ఒకటని నన్ను దెబ్బ తీస్తారు.

"నీకూ నాకూ సాపత్యమేంటి? " అన్నారాయన. అనుకున్నంతా అయింది. కొట్టాల్సిన దెబ్బ కొట్టేసారాయన. నాకుక్రోషమొచ్చి, "మీరు నన్ను చిన్నబుచ్చుతున్నారు" అన్నాను.

"నువ్వు నన్ను చిన్నబుచ్చు. సాచి లెంపకాయ కొడతాను. నేను నిన్ను చిన్నబుచ్చితే -మీరు నన్ను చిన్నబుచ్చుతున్నారు -అంటూ నాకే ఫిర్యాదు చేస్తావు- గొర్రె కసాయివాడికి చెప్పుకున్నట్లు లేదూ? " అన్నారు- నాకూ ఆయనకూ సాపత్యమెందుకు లేదో వివరణగా.

ఆయన వివరణ కూడా నన్నే చిన్నబుచ్చింది. ఐనా నాక్కోపం రాలేదు. ఆయన చెప్పిందాన్ని మనసులో విశ్లేషించుకున్నాను.

ఆయన ఉద్దేశమేమై ఉండొచ్చు? తన్ను తాను విమర్శించుకుంటున్నారా- లేక అహంకరిస్తున్నారా? నాకు సందేశమిస్తున్నారా లేక ముందరి కాళ్ళకు బంధమేస్తున్నారా?

నేనేమంటానోనని ఆయన నావంకే కుతూహలంగా చూస్తున్నారు. నేను కాసేపాలోచించి, "అర్థమైంది, మీరు నా ముందరికాళ్ళకు బంధమేస్తున్నారు కదూ? " అన్నాను.

"ముందరి కాళ్ళు పశువులకుంటాయి. పసుపుతాడును పలుపుతాడనుకుంటూ మీ ఆడాళ్ళు తమను తామే చిన్నబుచ్చుకుంటారు. మగాళ్ళు తమను చిన్నబుచ్చారని బాధపడతారు..." అన్నారాయన తడుముకోకుండా.

నాకు తెలుసు- ఆయన దగ్గర చాలా జాగ్రత్తగా పదాలు వాడాలని! కానీ నిజంగానే నాకూ ఆయనకూ సాపత్యం లేదేమో- తరచుగా ఇలాగే దొరికిపోతుంటాను. ఇప్పుడాయన నా మాటలే ఉపయోగించి నన్నో పశువుగా తేల్చారు.

నా కళ్ళలో నీళ్ళు తిరిగితే చీర చెంగుతో ఒత్తుకున్నాను.

ఆయన నాకు దగ్గరగా వచ్చి, "ఏయ్- నేనేదైనా అంటే ఇలా కళ్ళనీళ్ళు పెట్టుకోవడమేనా- నీ తెలివికి పదును పెట్టాలి



గానీ..." అన్నారు.

"ముందరి కాళ్ళకు బంధమేయడాన్ని సామెతగా చెప్పినప్పుడు మనుషులకూ వాడతారని చెప్పే తెలివి లేదా నీకు? "

"మనుషులంటే నాలాంటి మనుషులు. పశువులాంటి మనుషులు..."

"పోనీ- నువ్వు పశువులాంటి మనిషివే- ఒప్పుకున్నాను. నిన్ను పెళ్ళి చేసుకున్నాను కాబట్టి నేనూ అంతే. ఒప్పుకో మరి"

ఆయన గొంతులో తడి. అది చాలదన్నట్లు కళ్ళు కూడా తుడుచుకున్నారు.

"ఏడుస్తున్నారా? " అన్నాను ఆశ్చర్యంగా.

"నువ్వొప్పేసుకుంటావేమోనని" గంభీరంగా అన్నారాయన.

నవ్వొస్తే ఆపేసుకుని, "ఒప్పుకుందుకు- ముందరికాళ్ళ బంధం సామెతను నేను నాకు వాడాను కానీ మీరు మీకెప్పుడూ వాడలేదు కదా!" అన్నాను.

"అమ్మో- ఐతే నేనిప్పుడు నీకా నిజం

చెప్పాల్సిన సమయమొచ్చేసింది" అన్నారా యన.

"అంటే- ఆ సామెతను నిజంగా మీరు మీకు వాడేరా? " అన్నాను. అనుకోకుండా మనసులో సంతృప్తి.

"ఊс..."

నాకు నమ్మకం కుదరలేదు. మాటల దగ్గర ఆయనకు చాలా జాగ్రత్త.

"ఏదో నన్నోదార్చడానికంటున్నారు కానీ- నిజమైతే ఎప్పుడన్నారో చెప్పండి..."

"నీకు తెలుసుగా- మా నాన్నగారికి ఉద్యోగంలో ట్రాన్స్‌ఫర్లెక్కువని. కొన్నాళ్ళు నన్ను బాబాయి దగ్గరుంచి చదివించారని! మా బాబాయి ముగ్గురు పిల్లలూ నాకంటే చిన్నవాళ్ళు. మా పిన్ని రాత్రి పడుకుందుకు తన పిల్లలకు మంచంమీద దుప్పటి పరచి మెత్తటి దిండునుంచేది. నేను దుప్పటి, దిండు లేకుండా పొడవాటి చెక్క బల్లమీద పడుకునేవాణ్ణి. అందుకు నేనేమీ అనకపోయినా తనే ఫీలయ్యేదేమో, 'హైస్కూల్ స్టూడెంటుకక్కర్లేనివి- ఎలిమెంటరీ స్కూలు గుంటవెధవలకి కావాల్సొచ్చాయి. మీకన్నీ సూకిరాలు. అతణ్ణి చూసి నేర్చుకుంటే చదువొచ్చి బాగుపడతారు" అని అంతా వినేలా తన పిల్లల మీద విసుగు నటించేది. అప్పుడప్పుడు నేను- "పిన్నీ- ముందరికాళ్ళకు బంధమేస్తున్నావ్' అనేవాణ్ణి".

ఆపుకుందామన్నా నవ్వాగలేదు. కిసుక్కున నవ్వాను.

"చూసావా- జోకుల్లో నేనెప్పుడూ టాప్" కాలరెగరేసారాయన.

"ఇదో జోకా- దీనికి నేను నవ్వానా? " వెటకారంగా అన్నాను.

ఆయన నవ్వి, "కరెక్ట్- నేనూ అదే అనుకుంటున్నాను. పశువులు కన్నీళ్ళు పెట్టగలవు కానీ నవ్వలేవు కదా! నువ్వు పశువును కాదని నిరూపించుకుందుకు ఓసారి నవ్వాలనుకున్నావు. ఉత్తినే నవ్వితే పిచ్చిదనుకునే ప్రమాదముంది. నవరత్నాలు రాల్చే నీ నవ్వు ఎంత గొప్పదైనా బంగారానికి గోడ చేరుపులా దానికీ ఓ జోకు ఆసరా కావాల్సొచ్చింది. అసలు నేను కూడా ఆసరాకనే జోకాన్లే" అన్నారు.

అప్పుడు నాకు సంతోషం కూడా వచ్చి పకపకా నవ్వాను.

ఆయన నా నవ్వుకు ముచ్చటపడలేదు, "నువ్వేలా నవ్వగల్గుతున్నావో నాకర్థం కావడంలేదు. నువ్వింకొకడి ఊసెత్తడానికి వీల్లేదంటూనే నేనో పిల్లతో వెళ్ళిపోతానంటున్నాను. అది జోకు కాదు, హెచ్చరిక. చేతనైతే ప్రతిఘటించు. లేదా అనుభవిస్తావు" అన్నారు.

ఆ హెచ్చరికను సీరియస్‌గా తీసుకోలేదు. తీసుకుంటే మాత్రం ఏం జరిగేది? దేన్నికైనా మాటలతో వాదించడమే తప్ప మనసుతో ఆయన్ను ప్రతిఘటించాలన్న ఆలోచనే నాకొచ్చేది కాదు.

నేనేనా- లేక ప్రతి భార్యా ఇంతేనా? ....

"ఏంటి చేస్తున్నావ్ మమ్మీ? "

అది చంద్రిక గొంతు. ఆ గొంతు నా ఆలోచనలకు బ్రేకేసింది. ఉలిక్కిపడి దాని కేసి చూసాను. ఎంతసేపైందో అది లేచి కూర్చుని, గుండెలమీది ఇంజనీరింగు పుస్తకభారాన్ని దించి పక్కన పెట్టింది.

"ఏంటి చూస్తున్నావ్ మమ్మీ? " మళ్ళీ అడిగింది చంద్రిక.

చంద్రిక నోట మమ్మీ అన్న పిలుపు- ఆయన మమ్మల్ని విడిచి వెళ్ళాక మొదలైంది.

చంద్రికకు నన్నూ ఆయన్నీ మమ్మీ డాడీ అని పిలవాలని మహా సరదా. ఆయనొప్పుకునేవారు కాదు-

"ఇంగ్లీషులో మమ్మీ అంటే బతికున్న శవం. డాడీ అంటే బతికున్న వాణ్ణి డెడ్ అన్నట్లే అనిపిస్తుంది. మనం తెలుగు

వాళ్ళం. చక్కగా తెలుగులో అమ్మా, నాన్నా అను" అనేవారాయన.

"అలాగైతే నన్ను తెలుగు మీడియంలో చేర్పించాల్సింది. ఇంగ్లీషు మీడియంలో ఎందుకు జేర్పించావు? " చంద్రిక ప్రొటెస్టు.

"నిజమే- నేనీ విషయం ఆలోచించ లేదు. రేపట్నించీ నీకు టిఫినంటే బ్రెడ్ బటర్ జాం. ఇడ్లీ దోస ఉప్మాలిక మర్చిపో. లంచంటే అన్నం, పప్పూ, కూరా కాదు. దొరల తిండి తినాలి..."

"ఏయ్- నాన్నకు దొరల లంచి తెలి యదు. టిఫినంటే చెప్పాడు కానీ లంచే మిటో చెప్పలేదు" దానివన్నీ తండ్రి బుద్ధులే. ఎక్కడో మెలికపట్టి ఎదుటివార్ని ఏడిపించగలదు.

కానీ హనుమంతుడి ముందా కుప్పిగం తులు? - "రేపు డైనింగ్ టేబిల్ దగ్గర దొరల లంచే కాదు డిన్నరేమిటో కూడా నువ్వూ నేనూ తెలుసుకుందాం- సరేనా? " అన్నారాయన.

"వద్దులే నాన్నా- నాకు ఊరగాయలేందే ముద్ద దిగదు. నేను నిన్నూ అమ్మనీ మమ్మీ డాడీ అనన్లే"

ఆయనదంతా చాదస్తం. పిల్ల సరదా పడితే మమ్మీ డాడీ అననివ్వచ్చు కదా!

నేను చంద్రికను చాటుగా పిలిచి, "నీకంత సరదాగా ఉంటే నాన్న లేనప్పుడు నువ్వు నన్ను మమ్మీ అని పిలవచ్చు. నాకే మభ్యంతరం లేదు" అన్నాను.

"వద్దమ్మా- ఏదో ఊరికే అన్నాను కానీ- నాన్న మాటల్లో నిజముందని నాకూ అని పించింది" అంది చంద్రిక నెమ్మదిగా.

"ఎందుకని? "

"నా క్లాస్‌మేట్ రూప ఉందికదా- వాళ్ళమ్మ దానిచేత బలవంతంగా మమ్మీ అని పిలిపించుకుంటుంది. దానికది నచ్చదు. అమ్మను అమ్మా అంటేనే అమ్మనిపిస్తుందంటుందది. మమ్మీ అంటే ఆంటీ అన్నట్లే ఉంటుందిట"

అందుకేనేమో ఆయనంటూంటారు- మనిషిలో జీవాత్మ, పరమాత్మ ఉన్నట్లే భాషాత్మ కూడా ఉంటుంది. మనిషి మాతృభాషలో తాదాత్మ్యం చెందుతాడు. భావంలో అన్వయం పొందుతాడు. పరా యిభాషలో ఆలోచన పరకాయప్రవేశం వంటిది. అవసరానికి నేర్చుకునే భాషకు అవసరమైనంత ప్రాధాన్యమివ్వని మనిషికి మూడింట రెండు ఆత్మలే మిగుల్తాయి.

అప్పుడా విషయం స్ఫురించినా నేను దానికి ప్రాధాన్యమివ్వలేదు. చంద్రికకు నాన్న అంటే ఆరాధన అనుకున్నాను.

నాకు చిత్రంగా అనిపిస్తుంది. ఆయన చంద్రికను ఏడిపిస్తున్నట్లే అనిపిస్తుంది. కానీ అది ఏడవదు. ఆయన్ను అనుసరి స్తుంది, అభిమానిస్తుంది, ఆరాధిస్తుంది.

దానికింకా చిన్నతనం కాబట్టి తెలియద నుకుంటే- మరి నా సంగతేమిటి- నేనూ అంతే!

నేను, చంద్రిక- ఇద్దరం ఆయన్ను ఆరా ధిస్తున్నామంటే- ఆయనలోనే ఏదో విశేష ముండి ఉండాలి. ఏమిటది?

ఆలోచిస్తే మరో విషయం స్ఫురిం చింది. మాటలతో ఎదుటివాళ్ళను దెబ్బతీ యడంలో ఆయనకు నీ నా భేదం లేదు. ఇంటా బయటా తన్ను పలకరించని వా రిది పాపం- అందర్నీ మాటలతో ఇబ్బంది పెడతారు. ఐనా వాళ్ళంతా ఆయన్ని ఎంతో అభిమానిస్తారు...

నేను చూడ్డం చంద్రికనే చూస్తున్నాను కానీ ఆలోచనలెక్కడో ఉన్నాయి.

"ఏంటి చూస్తున్నావ్ మమ్మీ? " మళ్ళీ అంది చంద్రిక.

అప్పటికి ఈ లోకంలోకి వచ్చానేమో- నన్ను శూలమై గుచ్చుకుంది మమ్మీ అన్న పదం, "నాన్న వెళ్ళిపోయారని సంబరం చేసుకుందుకా- నన్ను మమ్మీ అని పిలుస్తు

న్నావు? " అన్నాను. నా మాటలో కోపం లేకపోవచ్చు కానీ నిష్ఠూరముంది. దానికీ తడుముకోదు చంద్రిక. ఆ తండ్రి కూతురు కాదూ?

"ఏంచేయను? నిన్ను చూస్తూంటే అమ్మ అనిపించడం లేదు. మమ్మీవనే అని పిస్తోంది" అంది. తెల్లబోయాను.

మమ్మీ అంటే బతికున్న శవమనేవారా యన. ఆయనకు జంటగా ఉన్నప్పుడు చంద్రికకు నేను అమ్మ.

ఒంటరినైతే మమ్మీ.

అప్పుడు చంద్రికను చూస్తే-

అది నేననుకుంటున్న చిన్నపిల్లలా లేదు. అదన్న మాటలో దాని ఉద్దేశం తెలుస్తోంది. ఏదో సందేశమూ వినిపి స్తోంది.

"మమ్మీ... చెప్పడం మరిచాను. ఇందాకా పోస్ట్‌మన్ వచ్చి ఓ ఉత్తరమిచ్చి వెళ్ళాడు" అంటూ చంద్రిక తన దిండు కిందనుంచి ఓ కవరు తీసిచ్చింది.

అది 9 × 4 సైజు తెల్లటి కవరు. అదెంత అనాసక్తంగా అందించిందో నేనూ అంత నిరాసక్తంగా అందుకున్నాను.

ఇప్పుడింట్లో ఎవరికీ ఉత్తరాలంటే ఉత్సాహం లేదు. అందులోనూ నాకొచ్చే వంటే మరీనూ.

సానుభూతి... అది చూపేవారికెంత ఉత్సాహంగా ఉంటుందో- పొందేవారికంత భయంకరం. అదేమిటో మరి- జీవితంలో పరాజితులకున్న ఆకర్షణ విజేతలకుండదు.

నేను నిరాసక్తంగానే కవరువంక చూస్తే చిరునామా నాది, పేరు వికాసినిది!

వికాసిని... వికాసిని... వికాసిని...

వికాసిని ఉత్తరం నాకెందుకొచ్చింది?

ఎంతోసేపు ఆలోచించకుండానే నాక ప్పుడు చటుక్కున వికాసిని ఎవరో గుర్తుకొ చ్చింది.

"అరే- నన్ను నేను మరీ ఇంతలా మర్చి పోయానా? " అనుకున్నాను.




**నే**ను పుట్టినప్పుడు నా పేరు విషయమై ఇంట్లో పెద్ద దుమారమే రేగిందిట.

అమ్మకు ముందు ఇద్దరు మగపిల్లలు. పెద్దన్నయ్యకు తాతగారు- అంటే నాన్న గారి నాన్నగారి పేరు పెట్టారు. చిన్నన్న య్యకు బామ్మ పేరును మగపేరుగా మార్చి పెట్టారు. మూడోసారి నేను పుట్ట గానే అమ్మమ్మ పేరు పెట్టాలని గట్టి పట్టు పట్టింది అమ్మ.

పేర్ల విషయంలో ఆడపెత్తనం కూడదని బామ్మ కాస్త గట్టిగానే మందలించిందట. ఆడ పెత్తనమన్నారు కదా- మరి ఆ మాట మీరు చెబుతారేమిటని అమ్మ ఎదురు సమాధానం చెప్పిందట. సాధారణంగా మెత్తగా ఉండే కోడలు అలా అనేసరికి అత్తగారు దిమ్మెరపోయి నాన్నకు ఫిర్యాదు చేసిందట. అమ్మ మాటలో న్యాయముంద నుకున్నారేమో- నాన్న, "మనింట్లో ఆడపిల్ల లకు నామకరణం చేసే సంప్రదాయం లేదుకదా. ఎవరిష్టమొచ్చినట్లు వాళ్ళు పిల్చుకుంటే సరిపోదూ? " అంటూ అటూ యిటూ కాకుండా చెప్పారట.

మా ఇంటి సంప్రదాయంలో ఆడపిల్ల కున్న విలువ అలాంటిది. మగపిల్లాడికి పెద్ద హడావుడి చేసి బారసాలలో పేరు. ఆడపిల్లకు పిలవడం కోసమన్నట్లు ఏదో ఒక పేరు.

అమ్మ నన్ను నోరారా కాసులమ్మా అని

నట్టింట సిరులవాన కురవాలని రైతులు అప్పులుచేసి మరీ తమ పొలాల్లో పత్తిపంట వేశారు. ఫలితాలు తలకిందులవడంతో కంగుతిన్నారు. అలాంటి భూమిపుత్రుల్ని మేల్కొల్పడానికి పూనుకొన్నాడాయన. ఇంతకీ ఎవరాయన? ఆ మహాయజ్ఞంలో అతనికి తోడ్పడింది ఎవరు? కష్టనష్టాలకు ఓర్చి వారేం సాధించారు? ఛిద్రమవుతున్న గ్రామీణ వ్యవస్థను సరిదిద్దడంపై వసంతరావు దేశపాండే పూరించిన చైతన్య శంఖం




## గుండ్రంగానే ఉండాలి

**జులై చతుర లో మీకోసం...**

పిల్చుకునేదిట.

ఆ పిలుపు నాలో కలిగించిన స్పందనలను అమ్మ ఎంత శ్రద్ధగా గమనించి గుర్తు పెట్టుకుందో- పెద్దయ్యాక నాకు చాలా వివరంగా చెప్పింది.

ఆ పిలుపుకి మొదట్లో భావరహితంగా చూసేదాన్నట. క్రమంగా ఆ పిలుపు నన్నేనన్నట్లు చలించేదాన్నిట. మూడునెల్లప్పుడు ఆ పిలుపు వినగానే బోసినోటితో నవ్వేదాన్నిట. ఆర్నెల్లప్పుడాపిలుపు విని ఉత్సాహంగా కాళ్ళూ చేతులూ తెగ ఊపేసేదాన్నిట. ఏడాదప్పుడాపిలుపుకు కాళ్ళ గజ్జెలు ఘల్లుమనేలా డాన్సు చేసేదాన్నిట.

విశేషమేమిటంటే నా చేష్టలకు ముగ్ధులై అంతా తమకు తెలియకుండానే ఆ పేరుకు అలవాటుపడిపోయారుట. నన్నలా పిలవడంలోనే అంతా తృప్తినీ, సంతోషాన్నీ పొందేవారట.

ఆ పేరుతోనే స్కూల్లో చేరాను. ఆరో తరగతికొచ్చేదాకా నా పేరు నాకు గొప్పగానూ, గర్వంగానూ అనిపించేది.

నాకు పదేళ్ళప్పుడు మొదటిసారిగా నా పేరు నాకు ఇబ్బందిగా అనిపించింది.

నా క్లాసులో చాలామంది ఆడపిల్లలకి నీహారిక, రమ్య, శ్రావ్య, మాధురి, మాలతి వగైరా ఆధునికంగా అనిపించే పేర్లుండేవి. కొందరికి పాతకాలపు పేర్లున్నా అవి లక్ష్మి, గౌరి, సీత, జానకి, కౌసల్య తరహాలో ఉండి ఎబ్బెట్టుగా అనిపించేవి కాదు. ఒక్క కాసులమ్మ అన్న నా పేరే కొట్టొచ్చినట్లుండడంతో కొందరు చాటుగా నవ్వుకుంటే, కొందరు ముఖంమీదే వేళాకోళం చేయడం మొదలెట్టారు.

అబద్ధమెందుకూ- నాకూ నా పేరు

నామోషిగా అనిపించి- పేరు మార్చమని ఇంట్లో గోల పెట్టాను.

నాన్న కాస్త మెత్తబడ్డారు కానీ అమ్మ ససేమిరా ఒప్పుకోలేదు. ఐతే బామ్మ మిగతా వాళ్ళందర్నీ కూడగట్టుకుని నాకు మద్దతుగా నిలవడంతో- నాకు వికాసిని అన్న పేరు నిర్ధారించారు. నేనాపేరు తల్చుకుని మురిసిపోయాను.

అమ్మ ఈ విషయమై చాలా పెద్దగొడవే చేసింది. ఐతే కన్న కూతుర్నైన నేనూ వికాసిని పేరును కోరడంతో చివరికామె తల్లి హృదయం కాస్త మెత్తబడింది. చివరకు నేను ఇంట్లో కాసులమ్మగానూ, స్కూల్లో వికాసినిగానూ చెలామణీ అవడానికి ఒప్పందం కుదిరింది.

వికాసినిగా నేను టెన్తు ప్యాసయ్యాను. ఇంటర్లో క్లాసు తెచ్చుకున్నాను. బీయస్సీలో కాలేజికే ఫస్టు వచ్చాను. సరిగ్గా అప్పుడే నాకు పెళ్లి కుదిరింది.

కాలేజీలో వికాసిని పేరు మార్మోగిపోయేది.

ఇంటిదగ్గర నేర్చుకున్న శాస్త్రీయ సంగీతపు గమకాల్ని కాలేజీ పాటల పోటీలకు అనుగుణంగా లలితంగా మార్చేదాన్ని. అది అద్భుతమని విన్నవారూ న్యాయనిర్ణేతలూ కూడా అనేవారు. సినిమాల్లోకి వెడితే దేశాన్నో ఊపు ఊపగలననేవారు చాలామంది.

ఒక్క పాటల్లోనే కాదు- వ్యాసరచన పోటీల్లోనూ నేను ఫస్టు. వక్తృత్వపు పోటీల్లోనూ నేను ఫస్టు. టేబిల్ టెన్నిస్‌లో నేను కాలేజీ ఛాంపియన్ని.

కాలేజీలో నాకో అనుచరబృందముండేది. వాళ్ళు కొలీగ్సులా కాక చెలికత్తెల్లా మసిలేవారు.

"చూడ్డానికి హీరోయిన్లాగున్నా- నీవన్నీ హీరో లక్షణాలే" అనేవారు వాళ్ళు.

జీవితంలో ఉన్నతశిఖరాలనధిరోహించాలని నా కోరిక. ముఖ్యంగా చదువులో డాక్టరేట్ చేయాలని మహా మనసు పడేదాన్ని.

నాకు పెళ్లి కుదరగానే అందరూ నన్ను అంతవరకూ ఏ విజయానికీ అభినందించనంతగా అభినందించారు. అప్పుడు నాకు పెళ్ళే నా జీవిత పరమావధి కాబోలు- అనిపించింది.

ఆడపిల్ల జీవితంలో పెళ్ళికంత ప్రాధాన్యమెందుకో అర్థం కాకపోయినా- ఒక విషయమై నేనూ మరీ మరీ ఆశపడ్డాను.

కాసులమ్మ- ఆ పేరు నాది కావడం నాకు బొత్తిగా నచ్చని విషయం.

వికాసిని- ఆ పేరు తల్చుకుంటేనే మనసు గాలిలో తేలిపోతుంది.

ఆ పేరు కారణంగానేమో- నాకు బయట కలిగే ఉత్సాహం ఇంట్లో ఉండేది కాదు.

నా బాధ తెలిసి, "పాతకాలపుదని- నా పేరు నీకు వేపకాయైపోయిందిటే" అని కలిసినప్పుడు నిష్ఠూరమాడేది అమ్మమ్మ.

"ఆ కాలంలోనూ సువర్చల, ప్రభావతి, ఉష వంటి మంచి పేర్లుండేవి. నీకీ కాసులమ్మ పేరు దొరికి నా ప్రాణం మీదికొచ్చింది" అని నేనూ అమ్మమ్మను నిష్ఠూరమాడేదాన్ని.

అత్తింటికి వెడితే నేనిక ఇంటా బయటా కూడా శాశ్వతంగా వికాసినిగా చెలామణీ కావచ్చునని ఆశపడ్డాను. కానీ ఆదిలోనే హంసపాదన్నట్లు శుభలేఖలో నా పేరు కాసులమ్మ అని వేస్తే షాక్ తిన్నాను.

అమ్మకు చెప్పి లాభముండదని నాన్న దగ్గర గోల పెట్టాను.

ప్రింటింగైపోయిందని నాన్న చేతులెత్తేస్తే "మీరు పంచుకునేవి మీ ఇష్టం. కనీసం నా ఫ్రెండ్సుకిచ్చుకునే వాటిలోనైనా నా పేరు వికాసిని అని వేయించుకుంటాను" అన్నాను.

"అలాగైతే బ్రాకెట్లోనైనా వికాసిని అని వేసేవాళ్ళం కదమ్మా- మీ ఆయన కావాలని ఉత్త కాసులమ్మ పేరు వేయించాలన్నాడు మరి" అన్నారు నాన్న.

అప్పుడే అలా వచ్చిన అమ్మ, "నా అల్లుడు బంగారు తండ్రి" అంది ఎంతో మురిపెంగా.

అది కాబోయే నా భర్త ఆదేశమని తెలిసేక- ఆయన ఆంతర్యం అర్థంకాక మధనపడ్డాను. ఉత్తరం రాద్దామా అనిపించింది. సంకోచించాను. ఫోన్ చేద్దామా అనిపించింది. మొహమాటపడ్డాను.

కాసులమ్మగానే పెళ్లికూతుర్నయ్యాను. పెళ్ళి పీటలమీదా, మిగతా పెళ్లి తంతుల్లోనూ ఆయన మొహమాటంగానూ, ముభావంగానూ ఉన్నారు. ఆయన్ను కాసులమ్మ వ్యవహారం గురించి నిలదీయాలనుంది కానీ అందుకోసం శోభనపు మొదటిరాత్రి దాకా ఎదురుచూడాల్సొచ్చింది.

ఆ రాత్రి నాకు తలనిండా మల్లెమొగ్గలు. ముఖంనిండా సిగ్గుల మొగ్గలు.

అమ్మలక్కలు చేతికి పాలగ్లాసిచ్చి నన్ను గదిలోకి తోసారు.

నేను గుమ్మం దగ్గరే ఆగిపోయాను. ముందడుగేయాలంటే మొహమాటంగా అనిపించింది.

దూరంగా మంచంమీద కూర్చున్న ఆయన కాసేపు నాకోసం ఎదురు చూసారు. నా ఇబ్బంది గ్రహించారేమో తనే లేచి నా దగ్గరకొచ్చారు. ఎడంచేత్తో నా చేతిలోని పాలగ్లాసందుకున్నారు. నెమ్మదిగా, "లేడీస్ ఫస్ట్" అని కుడిచేత్తో ముందుకి దారి చూపించారు. నేను ముందడుగేసేలోగా నా వెనక్కొచ్చారు.

నేను నెమ్మదిగా అడుగులేస్తూ మంచం దాకా నడిచి ఆగాను. ఆయన నా వెనకే వచ్చి మంచం పక్కనే ఉన్న చిన్న బల్లమీద పాలగ్లాసుంచి తను మంచంమీద కూర్చున్నారు.

నాకాయనవైపు చూడాలంటే మొహమాటంగా ఉంది. కాసేపు ఇద్దరి మధ్యా మాటలు లేకపోగా, "నాకు పాలు సహించవు. కాబట్టి గ్లాసులో పాలన్నీ నీకే" అంటూ నిశ్శబ్దాన్ని ఛేదించారాయన. నేనేం బదులివ్వకపోతే, "ఇలా కూర్చో" అంటూ తన పక్కన చోటు చూపించారు.

సంకోచంగానే కూర్చున్నాను.

"నువ్వు గదిలోకొచ్చేక నేను మూడు సార్లు మాట్లాడాను. ఇప్పుడు నాలుగోసారి మాట్లాడుతున్నాను. నువ్వూ ఏదైనా మాట్లాడు"

"ఏం మాట్లాడను? "

"నువ్వు కాలేజిలో ఎలక్యూషన్ కాంపిటీషన్సులో ఫస్టుట కదా- మరి నేనొక్కసారి కూడా అలాంటి కాంపిటీషన్సులో పాల్గొలేదు. నీకు నేనేం చెప్పను? "

"అక్కడ సబ్జక్టిస్తారు-"

"సరే- నేను సబ్జక్టిస్తున్నాను. పెళ్ళయ్యాక మొదటి రాత్రి..." చటుక్కున అన్నారాయన.

మొదటిరాత్రి గురించి కాకపోయినా- పెళ్ళయ్యాక ఆడపిల్ల భర్త ఎలా ఉండాలని కోరుకుంటుందో ఉపన్యాసాల్లో చెప్పాను నేను. అవిప్పుడు గుర్తు చేసుకుంటే-

"మనం ముందు ఒకరి గురించి ఒకరు పూర్తిగా తెలుసుకోవాలి" అన్నాను.

"అది పెళ్ళికి ముందు. పెళ్ళయ్యాక నువ్వు నన్ను విడిచిపెట్టవు. నేను నిన్ను విడిచిపెట్టను. మనం కలిసినప్పుడు క్రమంగా ఎలాగూ ఒకరికొకరు తెలుస్తాం. అలాంటప్పుడు ఈ రాత్రి ఆ తెలుసుకోవడం అంత అవసరమా? " అన్నారాయన.

నిజమే. జీవితాంతం కలిసి జీవించాలనే పెళ్ళి చేసుకున్నాం. ఇష్టమైతే సంతోషం. లేకపోతే సర్దుకుపోతాం. ఇదీ మన పెళ్ళి వ్యవస్థ. ఐతే సర్దుకుపోవడం వికాసిని

గానా, కాసులమ్మగానా?

నా మనసదేపనిగా వేధిస్తూంటే, "మీతో వికాసిని గురించి మాట్లాడాలి" అన్నాను.

"వేరే అమ్మాయి గురించి మాట్లాడాల్సిన సమయం కాదిది"

"వికాసిని వేరే అమ్మాయి కాదు, నేనే"

"ఐతే అవనీ- ఈ మూడు రోజులూ నేను నీ గురించి మాట్లాడను. నువ్వు నా గురించి మాట్లాడొద్దు. అపురూపమైన ఈ రోజుల్లో ఇద్దరం ప్రేమ గురించి మాట్లాడు కుందాం. ఇంకేం వద్దు"

ఆ మాటలు నాలో ఏదో తీయని అను భూతిని రేపాయి. తనువు, మనసు పులక రించగా, "ఎంత బాగా చెప్పారు? " అనుకు న్నాను.

వేదమంత్రాలు, పెద్దల దీవెనలు, వయసు, ఏకాంతం- అన్నీ తోడై మమ్మల్ని ఒకటి చేసాయి. మూడు రోజుల్లో మేమి ద్దరం అత్యంత ఆత్మీయులమైపోయాం. ప్రేమ తప్ప మరోమాట లేకుండా రోజులు గడపొచ్చునని మొదటిసారిగా నాకూ తెలి సింది.

నాలుగో రోజున సాయంత్రం మేమిద్దరం ఓ పార్కుకెళ్ళాం. మా మధ్య ఏర్పడిన చనువు నా సంకోచాన్ని పోగొ ట్టగా నేనాయన్ను పేరు గురించి నిలదీ సాను.

"పాతకాలపువాణ్ణి. నాకు అసలు సిసలు తెలుగు పేర్లంటేనే ఇష్టం. నేను నిన్ను కాసులూ అని పిలుస్తాను" అన్నారాయన.

వికాసిని అనమన్నాను. కుదరదంటే ముద్దుగా 'విక్కూ' అనమన్నాను. చాలా మంది కొత్త పెళ్ళాం, కొత్త మోజు అంటారు. ఆయనకలాంటివేం ఉన్నట్లు లేదు. ఎంత చెప్పినా వినకపోతే చివరకు నాక్కోపమొచ్చింది. నేనది దాచుకునే ప్రయత్నం చేయలేదు.

"నాకీ అలకలు నచ్చవు. కాసులమ్మా అంటాను. ఇష్టమైతే పలుకు. ఇష్టం లేదూ- విడాకులు తీసుకో" అన్నారాయన.

అంత తొందరగా విడాకుల ప్రసక్తి వస్తుందని ఊహించలేదేమో షాక్ తిన్నాను. "మనమిద్దరం ఒకటై ఈ వేళ్టికి నాలుగోరోజు. అప్పుడే విడిపోవడం గురించి మాట్లాడుతున్నారా? " అన్నాను.

"మొదటిరోజే మాట్లాడ్డం ఇష్టం లేకే కదా- నిన్నటిదాకా ప్రేమ తప్ప మరో టాపిక్ వద్దన్నాను"

కొత్తగాలి...

**ఫీజులేకుండా**
**పాఠాలు**
**నేర్పించేది**
**జీవితం**

**-యు. కృష్ణమూర్తి, ఊటుకూరు**

"నాకిష్టమైన పేరుతో నన్ను పిలవ మంటే విడాకులంటారా? " ఉక్రోషంగా అడిగాను.

"మీ అమ్మ నిన్నేమని పిలుస్తుంది? " అడిగారాయన.

"కాసులమ్మా అని"

"కన్నతల్లి మానలేని పేరును నేనెందుకు మానాలి? " అడిగారాయన.

"అంటే మీరూ అమ్మా ఒకటేనా? "

"అంటే భర్త భార్యను కన్నతల్లిలా ఆద రించకూడదా? "

ఈ ఎదురుప్రశ్నను ఊహించలేదు. ఓ నిముషం ఆలోచించి, "మీరు నా కన్నత ల్లికి బదులు కన్న తండ్రిని ఆదర్శంగా తీసుకోవచ్చుగా. నాకు వికాసిని పేరు మా నాన్నగారే పెట్టారు" అన్నాను.

"శుభలేఖలో నీ పేరు కాసులమ్మ అని వేయాలన్నాను. మారు మాట్లాడకుండా ఒప్పుకున్నారు మీ నాన్నగారు. మరి నేనా

యన్నాదర్శంగా తీసుకున్నట్లే కదా!" అన్నా రాయన.

"ఆయనకు బదులు నాతో చెప్పాల్సింది. పేరు నాది కదా!" ఇంకా కొత్త కాబట్టి నిష్ఠూరం గొంతులో ధ్వనించకుండా జాగ్ర త్తపడ్డాను.

"కన్నతండ్రి కదా- ఆయనకు చెబితే నీకు చెబుతారనుకున్నాను"

ఆయన మాటలు నా ఆలోచనలను కొత్త రూట్లోకి మళ్ళించాయి.

అల్లుడు కూతురికిష్టం లేని పేరు కోరితే అక్షరాలా పాటించి ఊరుకున్నారే తప్ప- మాటవరసకైనా కూతురికి చెప్పాలనుకో లేదు నాన్న. అమ్మైతే నన్ను నాకిష్టంలేని పేరుతోనే పిలుస్తుంది.

తనూ అలాగే పిలుస్తానంటున్నారా యన.

భార్యా భర్తలంటే ఒకే బండికి రెండు చక్రాలంటారు. అంటే ఇద్దరూ సరిస మానం. ఆయన నన్ను పిలవడానికో పేరు ఎన్నుకొన్నారు. నేనూ ఓ పేరెన్ను కుంటే?

"నేను మిమ్మల్ని కాసులయ్యా అని పిలు స్తాను" అన్నాను.

"థ్యాంక్స్! నేను నిన్ను కాసులమ్మా అన డానికి రాజీపడ్డావు" అన్నారాయన.

నేనేమన్నా, నా మాటల్లోంచి తనకు అనుకూలమైనవి మాత్రమే తీసుకోగల నైపుణ్యముందాయనకి. ఎలాగైనా దెబ్బతీ యాలని, "అంటే మీరు కాసులయ్య కావ డానికి ఒప్పుకున్నట్లేగా?" అన్నాను.

"కాసులయ్య సంగతలాగుంచు. నువ్వ సలు నన్ను పేరు పెట్టి పిలవడానికి వీల్లేదు"

"మరేమని పిలవాలి?"

"ఆఫీసులో నేను నా బాస్‌ని సర్ అంటాను. పొరపాటున కూడా పేరుపెట్టి పిలవను. నా జూనియర్ నన్నూ అంతే. ఇంట్లో నేను నీకు బాస్‌ని. ఇంట్లో ఇంగ్లీష పిలుపు నచ్చదు నాకు. కాబట్టి నువ్వు నన్ను 'ఏమండీ' అని పిలిస్తే నాకిష్టం. మన సంప్రదాయమూ అదే చెబుతుంది"

"సంప్రదాయం పాటించడానికి నాకూ అభ్యంతరం లేదు. కానీ మీరు నాకు బాస్ అంటే ఒప్పుకోను. నేను కూడా మీకు బాస్‌నే!" అన్నాను.

"ఒకే ఒరలో రెండు కత్తులిమడవు. ఒకే ఇంట్లో ఇద్దరు బాస్‌లుండడం కుదరదు.."

"అంతా మీ ఇష్టమేనా?"

"ఆహా- సాగినంతకాలం అంతా నా ఇష్టమే"

"నేను సాగనివ్వకపోతే?"

"చూడు కాసులూ- నేను నిన్ను నాకు నచ్చిన పేరుతో పిలుస్తాను. పలకాలి. నువ్వు నన్ను ఏమండీ అనే పిలవాలి. ఇవి నా షరతులు. నీకివి నచ్చలేదనుకో- మన మిద్దరం వెళ్ళి మీ అమ్మా నాన్నలకు విషయం చెప్పేద్దాం. నువ్వు వాళ్ళ దగ్గ రుంటావో, నా మాట వింటావో వాళ్ళే తేలుస్తారు" గంభీరంగా అన్నారాయన.

ఆలోచిస్తే అర్థమౌతోంది నాకు. అమ్మా నాన్నా ఆయన చెప్పినట్లే వినమంటారు. వినకపోతే నాకే నష్టమంటారు. వింటే నాకు కలిగే నష్టమేం లేదంటారు. విషయం వాళ్ళదాకా వెడితే నా ఆత్మగౌ రవం మరింత దెబ్బ తింటుంది.

"మీరు నాకు ప్రియుడిగా కాక బాస్‌గా ఉందామనుకుంటున్నారా?" అన్నాను నెమ్మదిగా.

"మన సంప్రదాయం భార్య విధుల్ని 'కార్యేషు దాసీ' అన్న శ్లోకంలో నిర్వచిం చింది. అవే భర్తకూ వర్తిస్తాయి. ఒక్క కార్యేషు విషయంలో తప్ప. అక్కడ దాసీ స్థానంలో బాసూ అనాలి" అన్నారాయన. ఆ గొంతులో అనునయం. ముఖంలో చిరునవ్వు.

## 'వికాసిని భర్త' పాత్ర సమాజం నుంచి తీసుకున్నదే!


వసుంధర

చతురలో ఇది రెండో నవల. నవలలో 'వికాసిని భర్త' పాత్రకు ప్రేరణ- పిన్నవయసులోనే కన్నుమూసిన మా ఆప్త(ఆత్మ) బంధువు అపురూప వ్యక్తిత్వమే! జొన్నలగడ్డ రాజగోపాలరావు, జొన్నలగడ్డ రామలక్ష్మి అనే మేము 1966లో పెళ్లయినప్పటి నుంచీ 'వసుంధర' పేర కథలు, నవలలు, నవలికలు ఎన్నో వెలువరించాం. 1971 నుంచీ 'చందమామ'లో కనిపిస్తూ పిల్లల పత్రికలకు వేలాది కథలు, వినూత్న శీర్షికలు నిర్వహించాం. 1988 నుంచి 1999 వరకూ 'బొమ్మరిల్లు' నిర్వహించాం. 1973 నుంచి 'అపరాధ పరిశోధన'కు ఆ పత్రిక ఆగిపోయేంతవరకూ(1988) వందలాది కథలు, నవలికలూ, నవలలూ రాసాం. నాటిక, వచనకవిత, వ్యాసం, పుస్తక సమీక్షల్లోనూ ప్రవేశం ఉంది. 1991 నుంచీ 'రచన'లో 'సాహితీవైద్యం' శీర్షిక ద్వారా కొత్త రచయితలకు సూచనలిస్తున్నాం. మా రచనలు కొన్ని సినిమాలుగానూ వచ్చాయి. ఉషాకిరణ్ నిర్మించిన 'ప్రేమించు-పెళ్లాడు' వాటిలో ఒకటి. మా నవలలను ఆదరించి ప్రోత్సహిస్తున్న సంపాదకులకూ, పాఠకులకూ ధన్యవాదాలు.

చిరునామా: వసుంధర, శ్రీవాణి గిరిజానిలయం, 63 సాకేత్, ఫేజ్ 1, కాప్రా, ఇసిఐఎల్ పోస్ట్, హైదరాబాద్-500062 ఫోన్: 040-27144697

"అంటే- మీరు నాకు ప్రియుడిగా కాక బాస్‌గా ఉందామనుకుంటున్నారు" నొక్కించాను.

"కార్యేషు దాసీ, శయనేషు రంభా ఐతే- కార్యేషు బాసూ,శయనేషు కృష్ణా కాడా? "

ఈ సమాధానం నాకెంతో తృప్తినిచ్చింది. ఎలా పిలిచినా ఏమనుకున్నా భార్యాభర్తలు ప్రేయసీ ప్రియులేనని తేల్చారాయన. ఇక కార్యేషు విషయం తేల్చాల్సి ఉంది, "మీరు నాకు బాస్. నాకది సంతోషమే. నేను మీకు దాసి. మీకది సంతోషమా? " సూటిగా అడిగాను.

"నా ఫ్రెండ్సులో కొందరు బెంగాలీలున్నారు. వాళ్ళు మార్క్సిజం ఒక్కటే గొప్ప సిద్ధాంతమంటారు. వాళ్ళ పిల్లలు బయట కొస్తే బక్కచిక్కిన ముసలి పనివాళ్ళు తాము ఎండలో మాడుతూ ఆ పిల్లలకు గొడుగులు పట్టడం నేను చూసాను" అన్నారాయన.

"నేనేదో అడిగితే మీరేదో చెబుతున్నారు" అన్నాను.

"అర్థం కాలేదా? మనిషిని దాసిలా చూడ్డానికి- నమ్మిన సిద్ధాంతాలు కూడా అడ్డు రావు. మరి నాకైతే ఏ సిద్ధాంతాలూ లేవు. ఐ ఎంజాయ్ ఇఫ్ యూ బికం మై సర్వెంట్"- అనడంలో సంకోచం లేదాయనలో.

"బట్ ఐ డోంట్ ఎంజాయ్ టు బి ఎ సర్వెంట్" అన్నాను దృఢంగా.

"బ్రిటిష్ వారు మనని బానిసలన్నారు. ఒప్పుకున్నవారికి ఉద్యోగాలొచ్చాయి. కొందరికి రావుబహద్దూర్ బిరుదులు కూడా వచ్చాయి. కానీ కొందరు ఒప్పుకోలేదు. నీకులాగే- ఐ డోంట్ ఎంజాయ్ టు బి ఎ సర్వెంట్- అన్నాడు గాంధీ"

ఉబ్బిపోయాను, "నన్ను గాంధీ అంతటి దాన్ని చేసారు, థాంక్స్" అన్నాను.

"ఒకళ్ళు చేస్తే గాంధీలవరు" అన్నారా

యన చటుక్కున.

"ఐతే ఇంతకీ నా గురించి మీ అభిప్రాయమేమిటి- నేను గాంధీనయ్యానా, లేదా?"

"ఆడపిల్ల పెళ్ళి చేసుకుని భర్తకు అణిగి మణిగి బానిసలా పడుంటే ఆమెకు సమాజంలో రావుబహద్దూర్ అంతటి గౌరవం లభిస్తుంది. భర్తకు ఎదురుతిరిగితే ఆ గౌరవం దక్కదు. అదీకాక ఎదురు తిరగడానికి గాంధీ అంత దమ్ముండాలి. ఆయన లాఠీ దెబ్బలు తిన్నాడు, జైలుకెళ్ళాడు. కుటుంబాన్ని నిర్లక్ష్యం చేసాడు. మరి నువ్వు గాంధీవయ్యావో లేదో నువ్వే తేల్చుకో"

"అంటే మీరు నన్ను కొడతారా?" అడిగాను.

"అది నా సంస్కారానికి సంబంధించిన విషయం. ఆ ప్రశ్న నన్నడిగి నువ్వు సాధించేదేమీ లేదు. నేను నిన్ను కొడితే పడతావా అన్నది అసలు ప్రశ్న. పడతావనే నా జవాబు. ఎందుకంటే మనదేశంలో భార్య భర్త తనను కొట్టకపోతే బాగుండుననుకుంటుంది. దెబ్బలు తప్పని సరైతే కాస్త నెమ్మదిగా కొడితే మెరుగనుకుంటుంది. ఇంకా- ఆ కొట్టేది ఇతరులు చూడకుండా అయితే నయమనుకుంటుంది"

"ఇవన్నీ మీకెలా తెలుసు?" అనడిగాను ఆశ్చర్యంగా.

"ఆలోచించి చూడు- నీకూ తెలుసుననే నా నమ్మకం. నీకెలా తెలుసో నాకూ అలాగే తెలుసు"

"అంటే- మీరు కొడితే నేను పడి ఊరుకుంటానంటారు"

"పడి ఊరుకుంటే దాసివి. ఎదురు తిరిగితే గాంధీవి"

అప్పుడు నాకు ఆయన నన్ను కించపర్చడంలేదనీ- తన పద్ధతిలో నాకేదో సందేశమిస్తున్నారనీ అనిపించింది. అదేమైవుంటుందా అని ఆలోచిస్తూండగా ఆయనే మళ్లీ అందుకున్నారు, "చూడు కాసులూ- గాంధీ అహింసాపథంతో బ్రిటిష్ సామ్రాజ్యాన్నే గడగడలాడించాడు. ఆడవాళ్ళకు శత్రువులైన మొగుళ్ళు ఆ సామ్రాజ్యమంత బలవంతులేం కారు. రావుబహద్దూర్ బిరుదులు కోరే మనస్తత్వమే ఆడవాళ్ళను మొగుళ్ళకు బానిసల్ని చేస్తోంది. ఏ మాత్రం త్యాగానికీ సిద్ధపడక టోటల్‌గా రిస్క్‌ఫ్రీ లైఫ్ గడపాలనుకునేవాళ్ళకు దాస్య శృంఖలాలు తప్పవు"

"మరి మీరు - పెద్దల చాటున ఉంటూ- వాళ్ళు చెప్పినట్లు మసలుతూ- వాళ్ళు చెప్పిన చదువు చదువుకుని..."

నేనింకా పూర్తి చేయలేదు. "ఆగు కాసులూ" అంటూ నన్ను మధ్యలో ఆపి, "నీ గురించి నాకు చాలా తెలుసు. కానీ నా గురించి నీకు బొత్తిగా తెలిసినట్లు లేదు" అన్నారాయన.

ఆయన చెప్పింది వింటూంటే అలాంటి వ్యక్తిత్వమే నాకు కొత్త అనిపించింది.




ఆయనది స్వేచ్ఛను కోరే మనస్తత్వం. కుటుంబ సంప్రదాయంలో ఇమడడం చిన్నప్పట్నించీ ఇబ్బందిగా ఉండేదాయనకు. ఇంటికొచ్చిన ఆయన స్నేహితులను- కులాలను బట్టి వేర్వేరుగా ఆదరించేవారు పెద్దలు. అందుకని ఆయన వాళ్ళను

ఇంటికి పిలవడం మానేసి తనే వాళ్ళింటికి వెళ్ళేవారు. ఒక్కోసారి కొందరిళ్ళలో భోజనమూ చేసారు. అందుకాయనకు దెబ్బలు పడ్డాయి.

"నా తప్పేమిటో చెప్పండి, దిద్దుకుంటాను" అన్నారాయన.

"కులం తక్కువ వాళ్ళింట్లో కూడు తినడం తప్పు" అన్నారు మామయ్య.

"ఈ మాట మా స్కూలుకొచ్చి క్లాసులో చెప్పండి. నాలాంటివాళ్ళక్కడ చాలామందున్నారు. అంతా తమ తప్పు దిద్దుకుంటారు" అన్నారాయన.

కొడుకిలా అంటాడని ఊహించక మామయ్య తెల్లబోయారు. పోనీ కొడుకు చెప్పినట్లే చేద్దామంటే ఆయనది గవర్నమెంటు ఉద్యోగం. బహిరంగంగా ఆ మాటనడానికి రూల్సొప్పవు.

ఇంతకీ మామయ్య కులతత్వం జీర్ణించుకుపోయిన మూర్ఖులు కాదు. ఆఫీసులో ఆయన కొలీగ్సులో అన్ని కులాలవారూ ఉన్నారు. అక్కడ వాళ్ళంతా అన్నదమ్ముల్లా కలిసిమెలిసి ఉంటారు.

మన సమాజంలో తప్పొప్పులు తెలియనివారంటూ ఉండరు. కానీ సంప్రదాయంలోని దురాచారాలను అనాలోచితంగా కొనసాగిస్తూంటారు. మాయామర్మం తెలియని పిల్లలకు సహజంగా కలిగే సందేహాలకు తార్కికంగా బదులివ్వక వాళ్ళను అహంకారంతో శాసించాలనుకుంటారు.

మన సమాజంలోని క్రమశిక్షణారాహిత్యం ఈ తరహా జీవన విధానంలోంచే వచ్చింది.

మా వారికి వ్యక్తిగా తండ్రి అంటే గౌరవముంది. ఆయన మాటలంటే గౌరవం లేదు. ఆయన మాటల్ని గౌరవిస్తుందని తల్లి మాటల్నీ గౌరవించేవారు కాదు.

మామయ్య ఆయన్ను రోజూ దేవుడికి దణ్ణం పెట్టుకోమనేవారు. ఆయన అప్పుడేం మాట్లాడక తర్వాత తల్లి దగ్గర దేవుణ్ణి తిట్టేవారు.

తల్లికి దేవుడంటే భయం. కొడుకంటే ప్రేమ. కొడుకును దేవుడికి అనుకూలంగా మార్చడం తనవల్ల కాదని గ్రహించేక భర్తకు చెబుదామా అనుకుందామె. కానీ అందువల్ల కొడుక్కి దెబ్బలు పడతాయని అనుమానం. చివరికామె తన ఇంటికోసారి ఓ సాధువొస్తే కొడుకు గురించి చెప్పుకుని బాధపడింది.

"దిగులు పడకు. ఇలాంటివారిలోంచే మహాభక్తులు పుడతారు" అన్నాడా సాధువు.

తల్లి తృప్తిపడింది కానీ- ఒక్క దేవుడి విషయంలోనే కాక తండ్రికి నచ్చని పనులు ఇంకా చాలా చేసేవారాయన.

చదువుమీద శ్రద్ధ తక్కువే ఐనా ఆయన తెలివి అపారం. ఒకసారి కాస్త శ్రద్ధగా చదివితే క్లాసుకి ఫస్టొచ్చారు. మామయ్య పొంగిపోయి అందరికీ గర్వంగా చెప్పుకున్నారు. ఆయన్ని మాత్రం, "ఓ సారి ఫస్టొస్తే చాలదు. దాన్ని నిలబెట్టుకోవాలి" అని హెచ్చరించారు.

"నాకు ఫస్టొస్తే నన్ను పొగడ్డం న్యాయం. ఆయన గర్వపడతారేమిటి" అన్నారాయన అత్తయ్యతో.

"ఏ తండ్రికైనా కొడుకు బాగా చదివితే గర్వం సహజం కదా" అన్నారు అత్తయ్య.

తర్వాత నుంచి ఆయన మళ్ళీ క్లాసులో ఫస్టు రాలేదు. పరీక్షల్లో అన్ని ప్రశ్నలకూ జవాబులు తెలిసినప్పుడు కూడా కావాలని ఒకటో రెండో వదిలేసేవారు. మళ్ళీ ఫస్టు రానందుకు అప్పుడప్పుడు మామయ్య తిడితే- ఆ తిట్లైనా భరించారు కానీ మామయ్య గర్వపడకూడదన్న ఆశయంతో క్లాసులో ఫస్టు రాకుండా జాగ్రత్తపడేవారు.

మామయ్య ఆయన్ను ఇంజనీరింగు, లేకుంటే సైన్సు- చదివించాలనుకుంటే

# అమెరికన్ చతురోక్తులు

*రష్యా మీద, కమ్యూనిజం మీద ఉన్నట్లే అమెరికా మీద కూడా ఎన్నో జోకులు ప్రచారంలో ఉన్నాయి. వాటిలో కడుపుబ్బ నవ్వించే కొన్ని చతురోక్తులు..*

ఓ అందమైన అమెరికా అమ్మాయి బ్యూటీ సెలూన్‌కు వచ్చింది. హేర్‌డ్రెస్సర్ ఆమెతో, 'ముందు ఆ హెడ్‌ఫోన్లను తీయండి.. నా పని సులువవుతుంది' అన్నాడు.

ఆమె ఒప్పుకోలేదు. చాలా సేపు వాదులాడి, విసుగొచ్చి ఆ రెండు ఫోన్లూ తనే పీకి పక్కకు పడేసి జుత్తు కత్తిరించడం ప్రారంభించాడతను. కొన్నిక్షణాల్లోనే ఆమె స్పృహతప్పి పడిపోయింది.

అతడికి ఎందుకిలా అయ్యిందో అర్థంకాలేదు. హెడ్‌ఫోన్లను వింటే క్లూ దొరకవచ్చని వాటిని ధరించగానే 'ఊఁ.. గాలి పీల్చు.. వదులు' అనే మాటలు విన్పించాయి. అతనికి తను చేసిన తప్పేంటో తెలిసింది.

---

ఆయన కావాలని బీకాంలో చేరారు. మామయ్య దురలవాట్లను నిరసిస్తారని- కావాలని సిగరెట్లు అలవాటు చేసుకున్నారు. మామయ్య తన పలుకుబడితో స్వరాష్ట్రంలో ఉద్యోగం వేయిస్తానంటే- ఆయన స్వయంకృషినే నమ్ముతానని కలకత్తా వెళ్ళారు. అక్కడ ఉద్యోగం సంపాదించి తన పలుకుబడితో హైదరాబాద్‌కు ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నారు.

ఇదంతా చెప్పి "అదీ నేనంటే- నాక్కావాల్సిన ప్రతీదీ పోరాడి సాధించాను" అన్నారాయన.

నాకు చాలా ఆశ్చర్యంగా అనిపించింది, "మీకు మామయ్యంటే ఎందుకంత ద్వేషం?" అన్నాను.

"నా కథ విని నువ్వర్థం చేసుకున్నదిదా- నేను హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నది దగ్గర్లో ఆయనకు ఆసరాగా ఉండాలనేకదా! నాకాయనంటే ప్రేమ, గౌరవం- రెండూ ఉన్నాయి. స్వేచ్ఛను ప్రేమించడం ఆయన్ను ద్వేషించడమౌతుందా? ఈ జీవితం నాది. దాన్ని మరొకరు శాసించడానికి వీల్లేదు"

"మరి మీ పెళ్ళి ఆయనే కుదిర్చారు కదా!" ఎక్కదీసాను.

"పెళ్ళి ఎవరు కుదిర్చారన్నది కాదు కొశ్చను- పెళ్ళయ్యాక నువ్వు నా మాట వింటావా, ఆయన మాట వింటావా అన్నది పాయింటు"

"మీరు చాలా విచిత్రమైన మనిషి" అన్నాను.

"మన దేశంలో స్వేచ్ఛను కోరడం విచిత్రం. నాకు స్వేచ్ఛను మించింది మరొకటి లేదు. కన్నవాళ్ళే నా స్వేచ్ఛను హరించలేకపోయారు. నేను నీకు బాస్‌ని- నువ్వా ప్రయత్నం చేస్తే సాగనిస్తానా?"

ఆయన మాటలు నన్ను చిన్నబుచ్చుతున్నట్లే ఉన్నా- ఏదో ప్రబోధం, ఏదో సందేశం, ఏదో హెచ్చరిక- వాటికి నేపథ్యమై ధ్వనిస్తున్నాయి. అందుకేనేమో నాకు కోపం రావడంలేదు.

"మౌనం అర్ధాంగీకారం, నువ్వు నాకు దాసిగా ఉండటానికి సిద్ధమే కదా!" అన్నారాయన.

"మీరు దాసి అనుకోండి, నేను ప్రేయసి ననుకుంటాను. అంతా అనుకోవడంలోనే కదా" అన్నాను.

ఆయన కాస్త ఆశ్చర్యపడినట్లు కనిపించారు. "అడ్జస్టయిపోతున్నావు" అన్నారు.

"మీరు బాస్‌ననుకోండి. నేను ప్రియుడనుకుంటాను. మిమ్మల్ని ఏమండీ అంటూ కాసులయ్య అన్నాననుకుంటాను. నన్ను కాసులూ అని పిలవండి, విక్కూ అని వింటాను. ఇది అడ్జస్టుమెంటనుకోండి- నేను ప్రేమ అనుకుంటాను" అన్నాను. అప్పుడు నా మనసులో నిజంగానే ప్రేమ

తప్ప మరోటి లేదు.

"గాంధీ అహింసతో ప్రతిఘటించాడు. నువ్వు ప్రేమ పేరుతో లొంగిపోతున్నావు. చేసుకున్నంతవారికి చేసుకున్నంత మహదేవ" అన్నారాయన.

ఆ తర్వాతనుంచి నేను పూర్తిగా కాసుల మ్మనైపోయాను. ఎంతలాగంటే క్రమంగా నేను వికాసినినని కూడా మర్చిపోయాను.

నా చేతిలోని తెల్లని కవర్ని తదేకంగా చూస్తున్నాను. దానిమీదున్న వికాసిని అన్న పేరు ఇంతింతై అంతై ఆ గదంతా నిండిపోతోంది.

ఈ కవరునాయన చూస్తే బహుశా ఇంట్లో పెద్ద ప్రళయం వచ్చేదేమో!

కవరు చింపి అందులోని కాగితాన్ని బయటకు తీసాను.

ఆ ఉత్తరం "పాట మిఠాయి" అనే సంస్థ నుండి వచ్చింది. తేటతెలుగు పాటలను- క్యాసెట్లు, సీడీల ద్వారా అందించనున్న ఆ సంస్థ కొత్త గొంతుల కోసం అన్వేషి స్తోంది. నాలుగు రోజుల్లో జరగబోయే ఆడిషన్ టెస్టుకి రమ్మని నాకు ఆహ్వాన ముంది అందులో.

బహుశా ఇది విశ్వనాథంగారి పనై ఉండాలి.

అది చూడగానే నాకు విశ్వనాథంగారు గుర్తొచ్చారు. ఆయన నేను చదువుకున్న కాలేజీలో సంగీత విభాగానికి హెడ్డు. ఆయనకు నా గొంతు అంటే ఎంతో ఇష్టం.

"ఇలాంటి గొంతు పూర్వజన్మ సుకృతం. దానికి న్యాయం చేకూర్చగల టాలెంటు నీ అదృష్టం. నువ్వు గనుక సంగీతాన్ని కెరీర్ చేసుకోకపోతే అది అపరాధం" అనేవారా యన.

విశ్వనాథంగారికి సంగీతానికి సంబం ధించిన అనేక ప్రముఖ సంస్థలతో పరిచ యాలున్నాయి. నన్ను గాయనిగా తీర్చిది ద్దాలని ఆయన తహతహలాడితే నాన్న ఒప్పుకోలేదు. నా చదువు పాడౌతుందని వంక చెప్పారు కానీ అసలు కారణం వేరే ఉంది.

విశ్వనాథంగారికీ స్త్రీలోలుడన్న పేరుంది. కాలేజీలో ముగ్గురు నలుగురి తోనూ, ఊళ్ళో ఏడెనమండుగురితోనూ ఆయనకు లింకుపెట్టి చెప్పుకుంటారు. ఆయనతో అంటీ ముట్టనట్లుండాలి తప్ప రాసుకుని పూసుకుని తిరిగితే నాకు పెళ్ళి కాదని నాన్న భయం.

నేను విశ్వనాథంగారిలో అసలు సిసలు కళాకారుణ్ణి చూసాను. ఆయన చూపులో, మాటలో, ప్రవర్తనలో అనౌచిత్యం తోచిన సందర్భాలు నాకైతే ఒక్కటీ లేదు. అమ్మకు నేనామాట చెబితే "ఈ మగా ళ్ళంతా ఇంతే- దగ్గరయ్యేదాకా వాళ్ళేమిటో తెలియదు" అంటూ నాన్ననే సమర్థిం చింది.

పెళ్ళై నా మకాం హైదరాబాదుకు మారేక- అక్కడికేదో పనిమీదొచ్చిన విశ్వ నాథంగారు ఓ సాయంత్రం మా ఇంటికొ చ్చాడు. అప్పుడు నేను పక్క గదిలో కంది పొడి కలుపుతున్నాను.

విశ్వనాథంగారు తలుపు తీసిన మా వారికి తన్ను తాను పరిచయం చేసుకు న్నారు. మా వారు నన్ను పిలవబోయిన ట్లున్నారు. "నేను నీతోనే మాట్లాడాలి బాబూ!" అని విశ్వనాథంగారనడం స్పష్టంగా వినిపించింది.

"చెప్పండి" అన్నారాయన.

"వికాసినిది అద్భుతమైన కంఠం. ఆమె సంగీత సాధన మానకూడదు. నువ్వొప్పు కుంటే మూడు కంపెనీలు కాంట్రాక్టు కుదు ర్చుకుందుకు రెడీగా ఉన్నాయి. పెద్దగా డబ్బు రాదు కానీ పేరొస్తుంది. పేరొచ్చాక వద్దన్నా డబ్బొస్తుంది. ఆ గొంతు జనా ల్లోకి వెళ్ళాలని నా కోరిక"

ఆయన విశ్వనాథంగారికి థాంక్సు

చెప్పారు. సంగీత సాధన కొనసాగించడానికి మంచి టీచరు పేరు సూచించమన్నారు. కాంట్రాక్టులు వద్దని మెత్తగా చెప్పారు. లోపలకొచ్చి ఆయన రాక గురించి నాకు చెప్పి కాఫీ టిఫిన్లు ఏర్పాటు చేయమన్నారు.

నేనొచ్చి విశ్వనాథంగారినోసారి పలకరించాను. ఇల్లు చూపించాను. ఆయన్ను మావారికొదిలి కాఫీ టిఫిన్లు సిద్ధం చేసాను.

విశ్వనాథంగారు వెళ్ళిపోయాక మా వారితో, "మీరు విశ్వనాథంగారితో పరుషంగా మాట్లాడతారని భయపడ్డాను. ఎంతో మర్యాదగా వ్యవహరించారు. చాలా థాంక్స్!" అన్నాను.

"నా గురించి నువ్వేమనుకుంటున్నావు? నాకు మర్యాద తెలియదనా నీ ఉద్దేశం" అన్నారాయన కోపం నటిస్తూ.

"అది కాదండీ- మీకు జోక్సు విసురుతూ మాట్లాడడం అలవాటు. అలా చేస్తే ఆయనకు కొత్తకదా- నొచ్చుకుంటారని భయపడ్డాను"

"ఏం కొత్తో- చూడ్డానికి నాకంటే మరీ పెద్దవాడిలా లేడు. కానీ వస్తూనే నన్ను నువ్వన్నాడు. నేను జోక్సు వేస్తే చొరవ పెరిగి ఏరా అంటాడేమోనని భయపడ్డానంతే"

ఆయన సమాధానాలెప్పుడూ అలాగే ఉంటాయి. విశ్వనాథంగారితో అలా మాట్లాడకపోవడం అదృష్టం.

నేను వస్తున్న నవ్వుని మనసుకే పరిమితం చేసి, "ఐతే నాచేత మనింట్లో సంగీత సాధన చేయిద్దామనుకుంటున్నారా- టీచర్ల పేర్లు కూడా అడిగారు" అన్నాను.

ఆయనేదో అంటారనుకున్నాను కానీ సింపుల్‌గా, "అవును" అని ఊరుకున్నారు.

"సుబ్బారావుగారు పాఠాలు బాగా చెబుతారని పేరు..."

"అమ్మో- సంగీతమంటేనే ప్రేమ- ఆ సాధన ఆడాళ్ళూ ఆడాళ్ళూ లేక మగాళ్ళూ మగాళ్ళూ కలిసి చెయ్యడమే మేలు. అందుకే నేను పద్మారావు గారిని సెలక్ట్ చేసాను"

"మీ మనసు ఇరుకు" అన్నాను చిరుకోపంతో.

"ఔను- నువ్వు ఒళ్ళు చేసినప్పట్నించీ" అన్నారాయన చటుక్కున.

పెళ్ళైన ఏడాదికే బాగా ఒళ్ళు చేసానని ఏదోవిధాన దెప్పుతుంటారాయన. కానీ ఇప్పుడన్న మాటలో తన మనసంతా నేనే ఉన్నట్లు ధ్వనించి నాకు సంతోషమే కలిగింది.

మా దాంపత్య జీవితంలో అదేమి చిత్రమో- ఆయన నాతో అనే ప్రతిమాటా పెడసరంగానే ఉంటుంది. నేనేమో అందులోంచీ ఆప్యాయతానురాగాల్ని వెదికి పట్టుకుంటాను. మరి అందరు దంపతులూ ఇలాగే ఉంటారేమో నాకు తెలియదు.

"పాడే వాళ్ళంతా ఒళ్ళుచేసే ఉంటారు. నేను గొప్ప సింగర్నౌతానేమో?" అన్నాను.

"గొప్ప సింగరు కావాలని లతా మంగేష్కరు పెళ్ళి మానేసింది. గొప్ప సింగరుగా ఉండే జిక్కి పెళ్ళి చేసుకున్నాక పాడ్డం తగ్గించేసింది. పెళ్ళి చేసుకుని నువ్వు గొప్ప సింగరయ్యే ఛాన్సు మిస్ చేసుకున్నావు..."

"మరి మీరేకదా- నా కోసం టీచర్ని కూడా చూస్తున్నారు!"

"టీచరుంటే గొప్ప సింగరువైపోతావా? బయట పాడాలి మరి. నేను నిన్ను బయట పాడనివ్వను"

"ఎందుకని?"

"నీ పాట నా కోసం. కేవలం నా కోసమే- అంతే!"

ఆ మాటలెంతో మధురంగా అనిపించా

యేమో నాక్కోపం రాలేదు.

అసలు ఆడదాని ప్రత్యేకతే అదేమో- పురుషుడు తన కోసమే జీవిస్తే ఆమె కూడా అతడి కోసమే జీవిస్తుంది. అతడామెను ఎంతగా స్వంతమనుకుంటే ఆమె అంత సంతోషిస్తుంది. కానీ చివరికది దేనికి దారి తీస్తుంది?

నేను పద్మారావు దగ్గర నా సంగీతానికి మెరుగులు దిద్దుకున్నాను. నా గొంతు మాత్రం నాలుగు గోడలూ దాటలేదు.

ఆయన నన్నడిగి పాడించుకునేవారు. విని పాటను మెచ్చుకోకుండా ఏవో జోక్సు చెప్పేవారు. కానీ ఆయన అడిగి పాడించుకోవడమే మెప్పుగా భావించేదాన్ని.

ఆయన నా పాటనభిమానిస్తారు. కానీ ఆయన సంగీతజ్ఞానం నా అంచనాకు అందదు. ఆయన అభిరుచి నాకు చిత్రంగా అనిపిస్తుంది. టేపులో పాటలు వింటూ సుబ్బలక్ష్మి, మీరా భజన ఓ రెండు నిముషాలు విని మైకేల్ జాక్సన్‌గా మారిపోతారు. సుశీల పాటనుంచి నరేంద్ర చంచల్ కి మారతారు. అన్ని రకాలూ ఎంజాయ్ చేస్తారు కానీ ఏదీ పూర్తిగా వినరు. అదేమంటే- "ఆవకాయలో మామిడిపండు నంజుకోవా నువ్వు? " అని ఠక్కున నా నోరు మూయిస్తారు.

ఎక్కడ దొరుకుతాయో ఆ మాటలు? ఆ తెలివి, చురుకుతనం నాకు ఆశ్చర్యంగా ఉంటాయి. ఒక్కోసారి వాటితో పోటీ పడాలనిపించి భంగపడుతుంటాను.

ఓ రోజున రామదాసు కీర్తనలు ఎల్పీ వింటున్నాను. ఎప్పుడొచ్చారో ఆయన ఠక్కున స్టైలస్ ముందుకు పెట్టి, "ఈ పాట ఇక్కణ్ణించి బాగుంటుంది" అన్నారు. అది పూర్తయ్యేలోగానే ఇంకో పాటకు మార్చారు. అలా నాలుగు పాటలు సగం సగం విన్నాక, "ఇది ఎల్పీ రికార్డు. పాటలిలా సగం సగం వింటే అన్ని గీతలూ సమంగా అరక్క- రికార్డు పాడౌతుంది" అని హెచ్చరించాను.

ఆయన వెంటనే నా చేతికి చిన్న నోట్ బుక్కూ, పెన్సిలూ ఇచ్చి, "ఏ పాట ఎక్కణ్ణించి ఎక్కడిదాకా విన్నదీ నోట్ చేసుకో. నేను వినడమయ్యేక- వినని పోర్షన్సులో ముల్లుపెట్టి తిప్పుకో" అన్నారు.

నేను కిసుక్కున నవ్వాను. ఆయన అదే స్టైల్లో మరికొన్ని పాటలు విన్నారు.

అలాంటి మనిషి- శాస్త్రీయంగా సంగీతాన్ని అభ్యసించి నా పాటను మెచ్చుకుంటే సంతోషించాల్సినదేముంది? కానీ- నా సంగీతమే ఆయన కోసం. నేను పాట నేర్చుకున్నా, పాడినా- కేవలం ఆయన కోసమేనన్న భావనలో ఏదో ఆనందముంది. అదే ఆయనతో చెబితే- సంతోషించడానికి బదులు, "నువ్వు జీవితంలో సింగర్‌గా పేరు ప్రఖ్యాతులు సంపాదించలేవు" అన్నారు.

"అదేమిటి- అలాగనేసారు? " అన్నాను తెల్లబోయి.

"మా నాన్న నన్ను ఇంజనీర్ని చేయాలనుకుంటే నేను బీకాం చదివి బ్యాంకు ఉద్యోగినయ్యాను. అనుకున్నది సాధించాలంటే ఎదిరించాలి. నువ్వు నన్ను ఎదిరించవు. అందుకని ఏమీ కాలేవు"

"అదీ మీకిష్టమేగా? "

"నా ఇష్టం నీకు నష్టమైతే ఎదిరించి తీరాలి"

"ఎదిరిస్తాను. మీక్కోపం రాదుకదా!"

"కురుక్షేత్రంలో భీష్మార్జునుల యుద్ధంలా ఫ్రెండ్లీగా ఉంటే మ్యాచ్‌ఫిక్సింగ్ తప్పదు. పోరాటమంటే ఇండియా- పాకిస్తాన్ క్రికెట్ మ్యాచ్‌లా ఉండాలి"

"ఎందుకు నన్ను మాటిమాటికి పోరాడమని రెచ్చగొడతారో నాకు అర్థంకాదు" విసుక్కున్నాను.

ఆయన నిట్టూర్చి, "నేను నిన్ను గాయ

నిని చేయాలి. నీ అంతట నువ్వు కాలేవు" అన్నారు.

"అది తెలిసినప్పుడు మీరే నన్ను గాయనిగా చేయొచ్చుగా? " అన్నాను.

"చెయ్యను. నువ్వు గాయనివైతే అంతా నన్ను కాసులమ్మ మొగుడంటారు. మిసెస్ హజ్‌బెండ్‌గా రిఫర్ కావడానికి పెళ్ళాలెందుకు సరదాపడతారో తెలియదు కానీ మిస్టర్ పెళ్ళాం కావడం నేను భరించలేను. అది మొదటి కారణం"

"మరి రెండోది? "

"నా సంపాదన మీద ఆధారపడ్డంత కాలమే నువ్వు నాకు అణిగిమణిగి ఉంటావు. మరి గాయనిగా పేరు తెచ్చుకుంటే నీకూ సంపాదన ఉంటుంది. అప్పుడు నువ్వు నన్ను లెక్కచెయ్యవు"

"నా సంపాదన మీ సంపాదనని మించిపోయిందనుకోండి. అప్పుడు నేను మీరూ, మీరు నేనూ అవుతాం. అంతేకదా!"

"కలలు కనకు. సంపాదిస్తున్నానని మిడిసిపడి నన్నెదిరించావో డొక్క చీల్చేస్తాను. నేనంటే నీకు మనసులో లెక్క లేకపోయినా- ఆ భయంతోనైనా అణిగిమణిగి ఉంటావు"

"అలాంటప్పుడు నన్ను గాయనిని చేస్తే మీకు నష్టమేమిటట? " ఏమంటారోనని కుతూహలం.

"ఇంతకాలం ఊరూ పేరూ లేకుండా ఉన్నావు కాబట్టి మనల్నెవరూ పట్టించుకోవడం లేదు. గాయనిగా నీకు పేరొచ్చిందంటే అంతా నన్ను భూతద్దంలో చూడ్డం మొదలెడతారు. పేపరు వాళ్ళు నా గురించి చెడ్డగా రాస్తారు"

"అంటే- మీ బెంగంతా మీ గురించే- మహా స్వార్థపరులు..." నా ఆరోపణలో ముచ్చట ఉంది.

"నా గురించి కాక జీవితభాగస్వామి గురించి బెంగెట్టుకుందుకు నేనేమైనా ఆడపిల్లనా? "

ఆయన విసురు అర్థమైంది, "సరే- రెండో కారణం తెలిసింది. ఇంకా మూడో కారణం కూడా ఉంటే చెప్పండి" అన్నాను కొరివితో తల గోక్కుంటున్నానేమోనని భయపడుతూనే.

"ఇంతకాలం ఇంట్లోనే నీ పాటలు. అప్పుడిక బయట కూడా నీ పాటలే- అది తల్చుకుంటేనే గుండెలు గుబగుబలాడుతున్నాయి"

వినేవాళ్ళకి ఆయన చెప్పిన ఈ మూడో కారణం కూడా నన్ను ఎకసక్కెం చేసినట్లుండొచ్చు. నాకు మాత్రం- నా క్యాసెట్టు రిలీజ్ కావాలి కానీ ఎక్కడ విన్నా నా పాటలేనని ఆయనన్నట్లు తోచింది. అదే చెప్పాను.

"మరందుకే నిన్ను నా దాసిలా అణిచుంచి..."

గుర్తుండవు కానీ నన్ను చిన్నబుచ్చడానికి ఆయన ఇంతకంటే చాలా పవర్‌ఫుల్ పదాలు వాడతారు. నేను స్పందించకపోతే రెట్టిస్తారు కూడా. ఐనా శ్రామికుడి నోటి బూతు పదాల్లా ఆ మాటలు నాకాయన ఆంతర్యాన్నే స్ఫురింపజేస్తాయి.

"మీ మాటలకు నేను రెచ్చిపోను. ఉన్న మాటక్కదా ఉలుకొచ్చేది? " అన్నాను.

ఆయన నా వంక ముచ్చటగా చూసి, "అమ్మో- మాటల్లో నా అంతట దానివౌతున్నావ్!" అన్నారు.

నన్ను మెచ్చుకోవడంలోనూ తన గురించిన అతిశయమే! ఆ చమత్కారం నాకెక్కడిది? అలాగే- ఒక్క సంగీతమే కాదు- ఇంకా చాలా విషయాల్లో ఏదో వంకపెట్టి కట్టడి చేసారాయన నన్ను.

మొదట్లో నేనుద్యోగం చేస్తానన్నాను. వెంటనే, "పెళ్ళాంకంటే పెద్ద ఉద్యోగమా? " అన్నారు.

"పెళ్ళామంటే డబ్బొచ్చే ఉద్యోగం కాదు



కదా- నేనుద్యోగం చేస్తే అది వేణ్ణీళ్లకు చన్నీళ్ళలా..." అంటూ ఏదో చెప్పబోతే,

"నేను శీతాకాలంలో కూడా వేణ్ణీళ్ళు పోసుకోను. నువ్వు వేసవికాలంలో కూడా చన్నీళ్ళు పోసుకోవు. వేణ్ణీళ్ళకు చన్నీళ్ళు ఇద్దరికీ అక్కర్లేదు" అనేసారాయన.

కోరికలు తీర్చుకుందుకు ఇద్దరూ సంపాదించాలన్నాను. కోరికలు తగ్గించుకుంటే ఒక్కడి సంపాదన చాలన్నారాయన. కోరికలు తగ్గించుకోవడం నా కిష్టముండదన్నాను.

"నాకూ ఇష్టముండదు. నా భార్య నాకు వంటచేస్తూ అడిగినవన్నీ అమర్చిపెట్టాలి. నా పిల్లల్ని పెంచి పెద్ద చెయ్యాలి. ఇవి నా కోరికలు. నువ్వుద్యోగం చేస్తే ఇవి తగ్గించుకోవాలి"

"మరి నాకంటూ కొన్ని టాలెంట్లున్నాయి. అవి వృథా కావడంలేదూ? "

"ఓ పనిచేయ్. పెళ్ళాన్ని బలవంతపెట్టి ఉద్యోగాలు చేయించే వాళ్ళు బోలెడుమందున్నారు. నన్నొదిలేసి విడాకులు తీసు

కుని అలాంటివాణ్ణి చేసుకో"

"మరీ మోటుగా మాట్లాడుతున్నారు" అదీ నా అభ్యంతరం.

"నేను మాట్లాడ్డంలేదు. సలహా ఇస్తున్నాను" ఆయన సవరణ.

"మీరింట్లో ఉంటే తెలుస్తుంది. ఇంట్లో ఉత్తినే కూర్చోవడం ఎంత బోరో?"

"నిజంగా నువ్వుద్యోగం చేసి నన్నూ, నా పిల్లల్నీ పోషిస్తానంటే సంతోషంగా ఇంట్లో కూర్చుంటాను. అప్పుడు నాకొచ్చే తీరుబడిలో కంప్యూటర్ కోర్సులు చేయొచ్చు. ఎలక్ట్రానిక్సు నేర్చుకుని ఇంట్లోకి పనికొచ్చే పరికరాలు చేయొచ్చు"

ఆయన ఉత్తినే ఆ మాటనలేదు. అప్పటికే ఆ రెండూ చేస్తున్నారాయన. మరి నేనేం చెయ్యడం లేదు.

ఏదో అనాలని, "ఎమ్మెస్సీకి కడతాను" అన్నాను.

"ఎమ్మెస్సీ అంటే కట్టడం కాదు, చేరాలి. సైన్సు కోర్సు కదా" అన్నారాయన.

"పోనీ కాలేజీలో చేరతాను" అన్నాను పట్టుదలగా.

"ఐతే మనకిప్పట్లో పిల్లలొద్దు..."

నాకు మూడో నెలని అప్పుడు గుర్తొచ్చింది. "ఎమ్మేకి కడతాను" అన్నాను.

కట్టి ఏం చేస్తావన్నారు. ఉద్యోగం చేస్తానన్నాను.

"ఉద్యోగం వద్దంటేనే కదా చదువన్నావు" గుర్తు చేసారాయన.

"చదువు జ్ఞానం కోసం. మరి మీరు కంప్యూటర్ కోర్సు చెయ్యడం లేదూ?" మాట మార్చాను.

"ఐతే నువ్వూ కంప్యూటర్ కోర్సు చేస్తావా?"

అర్థమైంది నాకు. ఆయన చేసే కంప్యూటర్ కోర్స్ ఆఫీసు పనికి ఉపయోగపడుతుంది. ఇంట్లోకి పనికొచ్చేలా ఉంది. ముమ్ముందు కంప్యూటర్‌కి గిరాకీ పెరిగిపోతుందంటారాయన.

నాకా సూచన నచ్చలేదు. చేస్తే పోస్టుగ్రాడ్యుయేషన్ చెయ్యాలి. కానీ మధ్య ఈ చిల్లర కోర్సులేమిటీ అనుకుని చదువు వాయిదా వేసాను. నాకిద్దరు పిల్లలు పుట్టి పెరిగి పెద్దవాళ్ళై తమ పనులు తాము చేసుకోవడం నేర్చేదాకా నేనాయన దగ్గర నా చదువు, ఉద్యోగం గురించి మాట్లాడలేదు.




**వి**కాస్ నాలుగో తరగతిలోనూ, చంద్రిక ఒకటో తరగతిలోనూ క్లాసులో ఫస్టు రాంక్ తెచ్చుకున్నారు. పిల్లలిద్దరూ ఆ క్రెడిట్‌ను నా ట్యూషన్సుకిస్తే ఆయన నాతో, "నీ ట్యూషన్‌తో వీళ్ళ రాంక్సు పడిపోతాయని భయపడ్డాను. నా అంచనా తప్పు చేసావ్. కంగ్రాట్స్" అంటూ అభినందించారు.

అది సాకు చేసుకుని ఆ రాత్రి ఆయనతో, "చాలామంది పిల్లలు అడుగుతున్నారు. నేను ట్యూషన్సు మొదలెట్టాలనుకుంటున్నాను" అన్నాను.

"మరి నేనుద్యోగం మానేయొచ్చా?" అన్నారాయన వెంటనే.

"అయ్యో- ట్యూషన్సు మీదెంతొస్తుందీ- మీరుద్యోగం మానెయ్యడానికి?"

"ఏంలేదు- నన్ను కూడా చాలామంది ట్యూషన్సు చెప్పమని అడుగుతున్నార్లే..."

"అలాగని ఉద్యోగం మానేస్తారా? "

"ఏమో- చాలామంది అడిగితే ట్యూషన్లు చెప్పాలేమోననుకున్నాను"

ఆయన విసురు నాకర్థమైంది, "అది కాదండీ- మన పిల్లలకెలాగూ చెబుతున్నాను కదా- ఆ టైములోనే మరికొందరు పిల్లలు పక్కనుంటే అంతా పనిలోపని..."

"ఐతే వాళ్ళక్లాసులకి మాత్రమే చెప్పు"

"సరే" అన్నానుత్సాహంగా.

"డబ్బు తీసుకోకు" అన్నారాయన నా ఉత్సాహం మీద నీళ్ళు చల్లుతూ.

"అదేంటండీ- ఉత్తినే ట్యూషనా? నాకిక వేరేపని లేదనుకుంటున్నారా? "

"పనిలేదని కాదు, పనిలో పనికదా అని!" ఆ విసురు అర్థమై, "డబ్బు తీసుకోకపోతే ట్యూషన్‌కి విలువుండదు" అన్నాను సంజాయిషీగా.

"నీకు తెలియదేమో, కోచింగ్ సెంటర్ అని పేరు పెడితే చెప్పలేను కానీ- మామూలుగా పనిలోపనిగా ఇంట్లో చెప్పే ట్యూషన్లకూ డబ్బు తీసుకున్నా విలువుండదు..."

అప్పుడూరుకున్నా తర్వాత అందుకు సమాధానంగా విశాల్ మోడల్ స్కూల్ వాళ్ళని కాంటాక్టు చేసాను.

వాళ్లు నన్ను చిన్న క్లాసులకు పాఠం చెప్పడానికి నెలకు ఐదొందలిస్తామనీ, క్రమంగా జీతం పెంచుతామనీ అన్నారు. రెండ్రోజులాగి ఆయనకా విషయం చెప్పాను. ఐదొందలకోసం రోజూ కొన్ని గంటలు ఇల్లొదిలిపోవడం నచ్చదన్నారాయన.

"డబ్బు కోసమా- చదువంటే సమాజ సేవ కదా" అన్నాను.

"అలాగనుకుంటే జీతం తీసుకోకు. ఉత్తినే చదువు చెప్పు"

"నేనూరికే చెప్పానని ఆ స్కూలువాళ్ళు పిల్లలకేం ఫీజులు తగ్గించరు. అయితే జీతం తీసుకుని దాంతో కొందరు పేద పిల్లలకు ఫీజులు కట్టు. సమాజసేవౌతుంది"

"ఏం- నా జీతం తీసుకుంటే మీకు నామోషీయా? "

"చూడు కాసులూ- నా నెలజీతం ఐదంకెల్లో ఉంది. దాని ముందు నీ జీతం దిగదుడుపే కదా- ఐనా జీతముంటే నువ్వు నీ ఉద్యోగాన్నీ, నా ఉద్యోగాన్నీ సమంచేసి మాట్లాడతావు. అది నేను భరించలేను"

నాలో నిరుత్సాహం. ఆ వెను వెంటనే ఆత్మవిమర్శ.

అసలు నా మనసులో ఏముంది- ఉద్యోగం సమాజసేవకా, సంపాదనకా?

ఆయన ప్రశ్నలు యధాలాపంగా అనిపించినా అవి ఆయనంత లోతైనవి.

నా ప్రతి మాటకీ పెడర్థాలు తీసి ఉడికించే ఆయన నాకే లోటూ లేకుండా అవసరాలన్నీ చూస్తారు. నన్ను దాసి అంటారు కానీ తనకు జబ్బుచేస్తే నన్ను సేవలు చెయ్యనివ్వరు. పైగా అంత జబ్బులోనూ, "నీకు శుభ్రం తక్కువ. ఏ చేత్తో ఏం ముట్టేసుకుంటావో తెలియదు. అసలు నీ అశుభ్రంవల్లే నాకీ జబ్బు చేసింది. పెళ్ళానివి కాబట్టి తర్వాత ఎలాగూ తప్పదు. తగ్గేదాకైనా కాస్త దూరంగా ఉండు" అని ఎకసక్కెం చేస్తారు. మరీ స్పృహ లేకపోతే తప్పదు కానీ ఓపికున్నంతవరకూ తన పనులు తనే చేసుకుంటారు.

ఇక నాకు చిన్న జబ్బు చేసినా మంచం దిగనివ్వరు. డాక్టర్లు చెప్పిన టైములు పాటిస్తూ మందులు వాడిస్తారు. చంటిపిల్లకు చేసినట్లు చాకిరీ చేస్తూ కంటికి రెప్పలా చూసుకుంటారు. నేను వారించబోతే, "మాట్లాడకు. నీ నోట్లోంచి సూక్ష్మక్రిములు బైటకొచ్చి నాకు జబ్బంటిస్తాయి" అంటారు.



ఆయన సేవలకు చలించిపోయి, "నాకోపికుంది. నా పనుల్నేను చేసుకోగలను. మీకెందుకండీ శ్రమ? " అంటే, "ఇదంతా ప్రేమనుకుని భ్రమపడకు. మురిసిపోకు. నాకు డ్యూటీ అంటే డ్యూటీయే. మీ అమ్మ పిలిచినట్లే కాసులమ్మా అంటున్నాను కదా! నా పిలుపు మారేదాకా ఈ డ్యూటీ తప్పదు" అంటారు.

"పోనీ అమ్మకు కబురెడదాం. ఊళ్లోనే కదా ఉంది" అన్నాను అమ్మ గుర్తుకొచ్చి.

"అమ్మో... ఆవిడొస్తే నాకు పని తప్పదు కానీ స్వేచ్ఛ పోతుంది. పెళ్ళి చేసుకున్నాక పెళ్ళానికామాత్రం చెయ్యలేవూ అంటూ అన్ని పనులూ నాచేతే చేయిస్తుంది. ఇప్పుడు నాకు నేనుగా చేస్తున్నవన్నీ అప్పుడావిడ నామీద అథార్టీ చేసి చేయిస్తుంది. పని నాదీ, క్రెడిట్ ఆవిడదీ! అందుకు బాధలేదు కానీ నీకు తెలుసుగా... నాకు స్వేచ్ఛ కావాలి. ఒకళ్ళు చెప్పింది చెయ్యను. నాకు తోచిందే చేస్తాను" అనేవారు.

"పెళ్ళి చేసుకున్నాక పెళ్లానికామాత్రం చెయ్యలేవూ... అని అమ్మ మీతో ఎప్పుడంది? " అమ్మమీద అబద్ధపు ఆరోపణ చేశారని ఉక్రోషం నాకు.

"నాతో అనలేదు కానీ మీ నాన్నగారితోనే అన్న మనిషి నాతో అనదా? " ఆయన సంజాయిషీ.



లని నా పంతం. ఆ పంతం నెగ్గదు.

ఆయన ముందు నేనెందుకు బలహీనపడిపోతున్నానని చాలాసార్లు నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. జవాబు దొరకలేదు. కాస్త చనువున్న ఇరుగుపొరుగుల దగ్గర ఆ ప్రస్తావన తెస్తే, "ఈ మగాళ్ళంతా ఇంతేనమ్మా!" అనేవారు. మీ మగాళ్ళంతా ఇంతేనని అమ్మ నాన్నతో అనేది. అత్తయ్య మామయ్యతో అనేది. చాలా సినిమాల్లో ఆడాళ్ళు మగాళ్లనలాగే అంటుంటారు.

అంతమంది అంటున్నారు కదా అని ఓసారి అదే మాట నేనూ అంటే ఆయన జవాబివ్వకుండా ముసిముసిగా నవ్వారు. ఆ నవ్వులోని అపహాస్యాన్ని గుర్తించి, "నవ్వుతారేం? " అన్నాను చిరాగ్గా.

"మీ ఆడాళ్ళంతా ఇంతే... మగాళ్లంతా ఇంతేనంటారు"

"అలా ఎందుకంటారో ఆలోచించారా? "

"ఆలోచనా? మాట్లాడే ముందు అదొకటి అవసరమని అనుకుంటారా మీ ఆడాళ్ళు? "

రుసరుసలాడుతూ చూసి, "అనుకుంటారు" అన్నాను.

"మరి మగాళ్ళంతా ఇంతే అనడంలో ఇంతే అంటే ఏమిటో చెప్పు"

"ఆడాళ్ళంతా ఇంతే అన్నప్పుడు ఆ ఇంతే ఏమిటో చెప్పండి" ఎదురుదాడి.

"ఇంతి అంటే ఆడది అని అర్థం. ఆడాళ్ళంతా ఇంతులే అనకుండా ఇంతే అంటే... ఆడాళ్ళంతా ఒక్కటే అని అర్థం.

"ఛీ... అన్నీ అబద్ధాలు. అమ్మ నాన్నగారితోనూ ఎప్పుడూ అలా అనలేదు"

"కూతురైనా సరే... ఆడాళ్లతో చెప్పుకోలేని విషయాలుంటాయి మగాళ్ళకు. మీ నాన్నగారు నీకు తెలియనివి చాలా చెప్పారు నాకు"

"ఏం చెప్పారు? "

"అసలే వంట్లో బాగోలేదు. చెబితే తట్టుకోలేవు... "

ఆ సంభాషణకక్కడితో ఫుల్‌స్టాప్ పడుతుంది. వంట్లో బాగున్నాక ఆయన్నావిషయమై నిలదీస్తే ఇంకేదో అని మాట దాటేస్తారు. ఆయనదంతా కల్పన అని తెలిసినా... ఆ మాట ఆయనచేతే అనిపించా

మరి మగాళ్ళంతా ఇంతే అంటే ఏమిటో చెప్పు"

తెల్లబోయాను. వాదనలో ఓడిపోయినా ఆ తెలివికి జోహారనాలనిపిస్తుంది. కానీ బయటపడ్డం ఇష్టంలేక, "ఆడాళ్ళ గురించి మీరలా అంటున్నారనే మగాళ్ళూ ఇంతే అంటున్నాం మేము. మీరు మాకేమీ భిన్నం కాదని ఆ మాట అర్థం"

"భిన్నం కానప్పుడు మా ఆడాళ్ళు, మీ మగాళ్ళు అనుకోవడమెందుకు? మన మంతా ఒక్కటే కదా... చక్కగా అమ్మా నాన్నా, అక్కా తమ్ముడూ అని ఆత్మీయంగా అనుకోవచ్చుగా? "

"ఆత్మీయమైన వరసల్లో మొగుడూ పెళ్ళాల గురించి చెప్పలేదు" గుర్తు చేశాను.

"వాళ్ళిద్దరా? నేను ఒక్కటేననుకుంటున్నాను మరి..."

ఆయన మాటలో దాంపత్య జీవితానికి నిర్వచనముంది. ఆయన దృష్టిలో నేను అర్థాంగినని తెలుస్తోంది. మరి నేనాయన్ను అహంకారి, స్వేచ్ఛాపహారి అనుకోవడంలో న్యాయముందా?

నేనాయనముందు అల్పురాలినని చాలా సార్లు అనిపించింది. కానీ అల్పత్వం ఎందులో?

ఆయన డిగ్రీ చేస్తే నేనూ డిగ్రీ చేశాను. ఆయన ఉద్యోగం చేస్తుంటే నేను వంట, ఇంటి పనులు చేస్తున్నాను. ఆయన ఉద్యోగం నేను చేయగలనేమో కానీ నేను చేసే పనులాయన వల్ల కావు. మరి అల్పత్వం ఎందులో?

అల్పుడినన్న భావం ఆయనకు లేదు. అల్పురాలినని నేననుకుంటాను. ఆయన ఆలోచనలు ఉన్నతంగా ఉంటే నావి ఇరుకుదారిలో నడుస్తాయి. ఆయన నన్ను మాటలతో చిన్నబుచ్చుతూ, దాసిలా చూస్తూ మనమిద్దరం ఒకటేనంటే నాకా భావం అంత సులభంగా జీర్ణమౌతుందా?

కొట్టినవాడు మరిచిపొమ్మనే అంటాడు. దెబ్బతిన్నవాడు మరువగలడా?

"మొగుడూ పెళ్ళాలు ఒక్కటెలాగౌతారు? మొగుడు బాస్, పెళ్ళాం దాసి" అన్నాను.

"ఓహ్... నా మాట నాకే అప్పజెబుతున్నావా? నేను చెప్పింది జనరల్ స్టేట్‌మెంటు. ఉదాహరణకు ఆస్ట్రేలియన్లు క్రికెట్ బాగా ఆడతారంటే ఆస్ట్రేలియాలో ఉన్నవాళ్ళంతా క్రికెట్ ఆడతారని కాదు. ఇందాకా నేను మొగుడూ పెళ్ళాలు ఒక్కటేనంటే అది మన గురించి కాదు. మొగుడూ పెళ్ళాల గురించిన జనరల్ స్టేట్‌మెంటు"

"అంటే నేను మీకు దాసినేనంటారు..."

"దాసి అంటే? "

"అన్నింటికీ అణిగిమణిగి పడుండమనిపించుకునేది"

"మరి- చెట్టుకింద ముష్టాడు మీకన్నా నయం అనిపించుకునేవాణ్ణి బాస్ అంటారా? "

ఉలిక్కిపడ్డాను. ఏదో కోపంలో ఓసారి నేనాయనన్న మాట అది!

"ఇంకా పవర్‌ఫుల్ మాటలున్నాయి. గుర్తుచేయనా? "

తడబడ్డాను. కోపం వచ్చినప్పుడు నాకు ఒళ్ళు తెలియదు. నోటికేం తోస్తే అంతా అనేసి తర్వాత సారీ చెబుతాను.

"సారీ ఎందుకూ- శారీ కోసమా? " అంటారాయన తనదైన స్టైల్లో.

"మరి ఇందాకా అనుకోకుండా ఏదో అనేసాను. అందుకు సారీ..."

"ఇందాకా ఏమన్నావ్? "

"ఛీ... మళ్ళీ ఆ మాటలు నా చేత చెప్పించాలనా? "

"మరి నువ్వు చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది? "

"అన్నప్పుడు వినలేదా? "

"ఎలా వింటాను? నీక్కోపమొస్తే నాకు చెవుడొస్తుంది..."

"ఎవరికైనా- లేని చెవుడు అప్పుడప్పుడు వస్తూంటుందా? "

"ఆc... మీ నాన్నగారికీ వస్తుందిట"

"మధ్య ఆయన ప్రసక్తి దేనికి? "

"నేనెక్కడ తెచ్చాను? నీ ప్రశ్నకు జవాబులో ఆయనున్నారు"

మాటకు మాట. సరిగ్గా ఎక్కడ కొట్టాలో అక్కడ దెబ్బ కొడతారు. నేనూరుకుంటానా...

"కోపంలో చెవుడొస్తే చెట్టుకింద ముష్టాడన్న మాట ఎలా విన్నారు? " అన్నాను.

"అది విన్నది నేను కాదు"

"మీరు కాకపోతే ఎవరు? "

"చెబితే- మధ్య మా నాన్నగారి ప్రసక్తి దేనికీ అనకూడదు"

నవ్వకుండా ఉండలేకపోయాను. అది చూసి, "నవ్వులో నీది మీ నాన్నగారి పోలిక" అన్నారాయన.

"మీరల్లుడయ్యాక ఆయన నవ్విందెప్పుడు? "

"నువ్వూ మీ అమ్మా పక్కన లేకపోతే ఆయన ఆగకుండా నవ్వుతుంటారు"

"అవున్లెండి. మిమ్మల్ని చూస్తే నేరుగా జోకర్లా ఎవరికైనా నవ్వొస్తుంది"

"కానీ మీ నాన్నగారికి జోకర్లని చూస్తే నవ్వు రాదట. అందుకే ఇంట్లోనూ, సర్కసులోనూ ఒక్కసారి కూడా నవ్వలేదని నాకు చెప్పారు"

మాటలు పెంచినకొద్దీ మా వాళ్ళమీద జోక్సు పెరిగిపోతాయని భయపడి, "ఇంతకీ మా నాన్నగారు మీ దగ్గరెందుకు నవ్వారు? " అంటూ సూటిగా విషయానికొచ్చాను.

"అత్తయ్యగారు తనని చెట్టుకింద ముష్టాడందని చెప్పి నవ్వారాయన"

"అమ్మకు కోపమొస్తే ఆయనకు చెవుడొస్తుందిగా- ఎలా విన్నారుట? " ఎక్కదీసాను.

"అది మా అత్తయ్య శాంతంగా ఉన్నప్పుడు అన్నమాటట. శాంతంగా ఉన్నప్పుడే ఇలా అంటోంది మరి. కోపమొస్తే ఏమంటుందోనంటూ మీ నాన్నగారు పడిపడి నవ్వారు"




"అబద్ధం. అలాంటి మాటలకేమిగాడూ నవ్వడు"

"అలా వెంటనే స్టేట్‌మెంటిచ్చేయకు. నీకు బాగా దగ్గరగా తెలిసిన మగాణ్ణి నువ్వలా అన్నప్పుడు- ఏం జరిగిందో గుర్తు చేసుకో- అభిప్రాయం మారొచ్చు" హెచ్చరించారాయన.

నా అభిప్రాయం మార్చుకోక తప్పలేదు. శాంతంగా ఉన్నప్పుడు మాటలతో రెచ్చగొడతారేమో కానీ-నాక్కోపమొస్తే ఆయన ముసిముసిగా నవ్వుతారే తప్ప... ఒక్క మాట అనరు.

"ఇంతకీ ఏమంటారు? " అన్నాను.

"నువ్వే చెప్పాలి నాకు. దాసి అంటే ఏమిటో తెలియక కొట్టుమిట్టాడుతున్నాను"

"అంటే నేను దాసిని కాబట్టి నాకు తెలుస్తుందనా? " కోపంగా అన్నాను.

"చాలా సంసారాలు చూసాను. మొగుడూపెళ్ళాళ్ళో ఎవరు ఎవరికి దాసులో చెప్పడం కష్టమనిపించింది. నాకైతే ఆడవాళ్ళే యజమానులనిపిస్తుంది

కూడా"

"ఎలా? "

"ఆడాళ్ళకు చీరలు. నగలు కావాలి. ఇంట్లో షోకేసులో పెట్టుకుందుకు బొమ్మలు కావాలి. ఇంకా ఏమేమో కావాలి. అవన్నీ కొని పెట్టడంకోసం మగాడు వళ్ళొంచి పనిచేస్తాడు. వాడు సంపాదించేదాంట్లో తన కోసం ఖర్చయ్యేది చాలా తక్కువ. యజమాని అన్న హోదాను మగాడికిచ్చి- తనక్కావాల్సిన వన్నీ సంపాదించిపెట్టే దాసుణ్ణి చేసింది ఆడది. ఇలా అని నేను మగాళ్ళనీ, ఆడా ళ్ళనీ వేరు చేస్తున్నాననుకోకు. మొగుడూ పెళ్ళాలు వేరనుకునేవారికోసం చెబుతున్న మాట ఇది."

## కొత్తగాలి... 

**శ్రీరామకోటి, నమాజ్**
**అది వారివారి ఇష్టం**
**విధి నిర్వహణే**
**అసలైన దైవం**

**-మహ్మద్ అబ్దుల్ అజీజ్,** విశాఖపట్నం

ఆయన మాటలు నన్ను ఆలోచనలో పడేసాయి.

నేను కనీసం నెలకో చీర కొంటాను. ఏడాదికో నగ కొంటాను. ఇంట్లో ఎవరికీ పనికిరానివి ఏమేమో కొంటూంటాను. జోక్సు విసురుతూనే అన్నింటికీ ఆయన డబ్బిస్తారు.

ఆయన టీవీ, వీసీఆర్, మ్యూజిక్ సిస్టం, క్యాసెట్లు వగైరాలమీద ఖర్చు చేసినా- అవి ఇంటిల్లిపాదికీ ఎంతో కొంత ఉపయోగపడ తాయి. సగటున చూస్తే వాటిమీదయ్యే ఖర్చు- నామీద పెట్టే ఖర్చుకంటే చాలా చాలా తక్కువ. ఐనా ఆయన ఖర్చు గురించి నేను గొణుగుతూనే ఉంటాను.

ఆయన చేసే ఖర్చుల్లో వంకపెట్టగలి గింది సిగరెట్ల గురించే. డబ్బుకి డబ్బూ, ఆరోగ్యానికి ఆరోగ్యమూ నష్టపోతున్నారని తరచుగా హెచ్చరించేదాన్ని. దానికాయన "నీకు ఆరోగ్యం తక్కువై మందులు వాడు తున్నావు. నాకు ఆరోగ్యం ఎక్కువై సిగ రెట్లు తాగుతున్నాను. నీ మందుల ఖర్చు గురించి నేను మాట్లాడను. నా సిగరెట్ల మాట నువ్వు ఎత్తకు" అనేసారు.

ఏమంటాను? ఏ దురలవాటూ లేని నాకు తింటే అరగని జబ్బు. ఎంతో ఇష్ట మైన పాలు, పెరుగు కూడా తినడానికి లేదు. అందుకని మందులు వాడుతు న్నాను. ఆ మందుల ఖర్చు ఆయన సిగ రెట్ల ఖర్చుకంటే ఎక్కువే.

ఐతే నా మందుల ఖర్చు ఆయన ఆఫీసు భరిస్తుంది. ఆయన సిగరెట్ల ఖర్చు మేమే భరించాలి. సిగరెట్ ఆరోగ్యానికి హానికరమని సంపన్న దేశాలన్నీ గుర్తిం చాయి. తీరికూర్చుని ఆరోగ్యాన్ని పాడు చేసుకోవడమెందుకూ అని నేనంటాను కానీ సిగరెట్ల ప్రసక్తి వస్తే ఆయన సీరి యస్సైపోతారు. అది తన బలహీనతని తెలిసినా తర్కంతో దాన్ని సమర్థించుకో వడమాయనకిష్టముండదు. అలాగని దానికి వ్యతిరేకం గానూ మాట్లాడరు. ఆ టాపిక్ వస్తే తొందరగా కట్ చేస్తారు. లేదా తెలివిగా మాట మార్చేస్తారు. ఆలో చిస్తే నిజంగానే పురుషుడి జీవితం స్త్రీకే అంకితమా అనిపిస్తుంది. మరి స్త్రీలకు అన్యాయం జరిగిపోతోందంటూ పరిస రాల్లో వినిపించే ఘోషకు కారణమేమిటి?

స్వేచ్ఛ!

మన సమాజంలో పురుషుడికున్న స్వేచ్ఛ స్త్రీకి లేదు. ఆమెకు లేమిలో దినది నగండం. కలిమిలో బంగారు పంజరం.

"ఎన్నిసార్లు చెప్పండి- మీకున్న స్వేచ్ఛ

మాకులేదు" అన్నాను.

"నువ్వు నీ గురించే ఆలోచిస్తావు. కాసులూ- నా గురించి ఆలోచించవు. నేను నిన్నన్న ప్రతి మాటా గుర్తుంటుంది నీకు. నువ్వు నన్నన్నది గుర్తు చేసినా నిజమా అన్నట్లు అనుమానంగా చూస్తావు. నీకు నువ్వు పడే బాధలే తప్ప ఇతరులను నువ్వు పెట్టే బాధలు స్ఫురించవు. నీకు ప్రపంచం 'నేను' అనే నీ చుట్టూ తిరుగుతూంటుంది. నేనిది చేశాను, నావల్ల ఇది జరిగింది- అనుకుంటూ అందులో ఇతరుల ప్రమేయం గురించి ఆలోచించవు. అందుకే స్వేచ్ఛ అంటే అర్థం తెలియడం లేదు. నీకు చిన్నతనంలో తల్లిదండ్రుల్నించీ, వయసులో భర్తనుంచీ, వృద్ధాప్యంలో పిల్లలనుంచీ రక్షణ కోరే మనస్తత్వం నుంచీ బయటపడకపోతే- నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి అనే దుష్టనినాదాన్ని గర్హించే అర్హత నీకుండదు. దాస్యం స్త్రీల కర్మ కాదు. అది వారి ఛాయిస్. ఈ మగాళ్లంతా ఇంతే అని కాజువల్ రిమార్క్స్ పాస్ చేయడం మాని స్త్రీలు తాము కోరుకునేదేమిటో తెలుసుకోవాలి. తమ కోర్కెలను మగవాడి దయాధర్మంతో కాక తమకు తాముగా సాధించుకోవాలన్న పట్టుదల పెంచుకోవాలి. మా ఆఫీసులో మీనాక్షి అలాంటిది" ఆయన అప్పుడప్పుడు మీనాక్షి గురించి చెబుతుండేవారు కానీ ఇంత గొప్పగా ఆమెను ప్రస్తావించడం అదే మొదటిసారి.

"ఏమిటండీ- ఆ మీనాక్షి గొప్పతనం?" అడిగాను.

"అదో పెద్ద కథ. ఆమె గురించి నీకు చెప్పాలన్న ఉత్సాహమే ఇప్పుడు నాచేత పలికిస్తోంది. కానీ నాకు కథలు చెప్పడం రాదు. కథ విన్నాక మీనాక్షి గొప్పదనిపిస్తే అదామె గొప్పదనం. అనిపించకపోతే నేను చెప్పడంలో లోపమనుకో" అంటూ ప్రారంభించారాయన.




ఇంటర్మీడియట్ చదువుతుండగా మీనాక్షి పెళ్లయింది. ఆమె భర్త ప్రభుత్వోద్యోగి.

మీనాక్షి భర్తకు తాగుడు అలవాటుంది. ఆ మైకంలో రాత్రిళ్లామెని కొట్టేవాడు. ఆమె అల్లరి చేసి చుట్టుపక్కలవాళ్లని పిలిచింది. వాళ్లతన్ని గట్టిగా మందలిస్తే కోపమొచ్చి అతడామెను పుట్టింటికి తోలేసాడు.

పుట్టింటివారామెకు సమాజంలో ఆడదాని స్థానం గురించి లెక్చర్లిచ్చి, సర్దుకుపొమ్మని నచ్చచెప్పి మళ్లీ కాపురానికి పంపేసి చేతులు దులుపుకున్నారు.

భర్త ఆమెను లోకువ కట్టాడు. ఆమెని ఏడిపించాలని అతడు డబ్బుకమ్ముడుపోయే అమ్మాయిల్ని అడపాదడపా తన ఇంటికి తీసుకురాసాగాడు.

మీనాక్షి ఊరుకోలేదు. భర్త ఆఫీసుకు వెళ్లి విషయం చెప్పింది. ఆఫీసువాళ్లామె నుంచి రాతపూర్వకంగా ఫిర్యాదు తీసుకున్నారు. తర్వాత ఆమె భర్తకు ఆఫీసులో బాగా చీవాట్లు పడ్డాయి. భర్త ఆమెను శారీరకంగా హింసించి ప్రతీకారం తీర్చుకోబోయాడు. ఆమె పోలీస్‌స్టేషన్లో ఫిర్యాదు చేసింది. పోలీసులూ అతడికి వార్నింగ్ ఇచ్చారు.

ఇక చివరి అస్త్రంగా భర్త ఆమెపై దుష్ప్రచారం మొదలుపెట్టాడు. నమ్మినవాళ్లు నమ్మారు. చాలామందికి ఆమెపై సాను

భూతి పుట్టింది. వాళ్లలో మగవాళ్లే ఎక్కువ.

మీనాక్షి అందగత్తె. ఆ అందానికి ఆకర్ష ణీయమైన మెరుగులు దిద్దుతుందామె. అందువల్ల ఆమెపై సానుభూతి పుట్టిన వారిలో ఓ పురుషపుంగవుడామెను ఉంచు కునేందుకు సిద్ధపడ్డాడు.

మీనాక్షి కోపం తెచ్చుకోలేదు. "నాకు ఉద్యోగం కావాలి" అందామె. ఆడదానికి స్వేచ్ఛనివ్వగలిగింది ఉద్యోగమని అప్పు డామె ఉద్దేశం.

పురుషపుంగవుడికది షరతులా ధ్వనిం చింది. ఆయనకు సమాజంలో చెప్పుకోదగ్గ పలుకుబడి ఉండడం వల్ల ఆ షరతు న్యాయంగానూ అనిపించింది. అందుకని బ్యాంకులో డెయిలీవేజ్ మీద గుమస్తా ఉద్యోగమిప్పించాడు. ప్రతిఫలంగా ఆయన సరదాలు తీర్చడానికి ఒప్పుకుంది మీనాక్షి.

ఆమె భర్తను విడిచి వేరే ఇంట్లోకి మారింది. అక్కడికా పురుషపుంగవుడు వస్తూ పోతూ వుండేవాడు.

"వివాహితవు. పరపురుష సంపర్కం నీకు తప్పు" అని కొందరామెను హెచ్చరిం చారు.

"నా భర్త మా ఇంటికి పరస్త్రీలను తీసు కొచ్చాడు. అతనికి బుద్ధి చెప్పండి. అతడి చేత నాకు క్షమాపణలు చెప్పించండి. నేను నా పద్ధతి మార్చుకుంటాను" అంది మీనాక్షి.

ఆడదాన్ని తప్పు పట్టేవాళ్ళు మగాడి తప్పులు పట్టించుకోరని మీనాక్షికి తెలియ కపోలేదు. వాళ్ళకలా చెప్పడంవల్ల కనీసం తను నీతులు వినాల్సిన అగత్యం తప్పు తుందని ఆమె అనుకుంది. ఈలోగా పురు షపుంగవుడి ఇల్లాలు ఆమెను స్వయంగా కలుసుకుని తన్ను తాను పరిచయం చేసు కుంది. మీనాక్షి ఆమెతో వినయంగా, గౌర వంగా వ్యవహరిస్తే- అది సంస్కారమని గుర్తించని పురుషపుంగవుడి భార్య మీనా క్షిలో అపరాధభావమున్నదని పొరపడి, "సాటి ఆడదాని కాపురంలో నిప్పులు పోయడానికి నీకు సిగ్గుగా లేదూ?" అంటూ నేరుగా నిందకు దిగింది.

"మనమిప్పుడు సిగ్గు మాట విడిచిపెట్టి ఒకరినొకరు అర్థం చేసుకుందాం. నా కాపు రంలో నిప్పులుపడి మండుతుంటే ఎవరూ పట్టించుకోలేదు. ఆ నిప్పురవ్వలు మరిన్ని కాపురాలకు చిచ్చు పెడితే ఆ తప్పెవరిది? మనిద్దరిదీ ఒకే పరిస్థితి. సాటి ఆడదానిగా నేను నీపై సానుభూతి చూపిస్తాను. నువ్వూ నాపై సానుభూతి చూపి సాటి ఆడదానివనిపించుకో" అంది మీనాక్షి.

పురుషపుంగవుడి ఇల్లాలు- సిగ్గు గురించి మాట్లాడగలదు. కానీ ఆమెకు సిగ్గంటే తెలియదు. ఎలాగో అలా తన భర్తను మీనాక్షినుంచి కాపాడుకోవడమే ఆమె ధ్యేయం. మీనాక్షికి తనపై సాను భూతి ఉందని తెలియగానే ఆమె మరో ఆలోచన లేకుండా వెంటనే, "ఇవి చేతులు కావు, కాళ్లనుకో. నా భర్తను నాకు విడిచి పెట్టు" అని ప్రాధేయపడింది.

మీనాక్షికి ఆమె వ్యక్తిత్వం అర్థమై ఆమె వంక జాలిగా చూసి, "నావి కూడా చేతులు కావు, కాళ్లనుకుని నీ భర్త నన్ను వదిలిపెట్టేలా చేయి. నీకు ఆజన్మాంతం కృతజ్ఞురాలినై ఉంటాను" అంది.

తన బంగారం మంచిది కాదని స్పష్టంగా తెలుస్తూనే ఉన్నా ఆ ఇల్లాలు ఆ అసహాయతను మీనాక్షిపై కసిగా మార్చి - ఆమెపై మాటల అస్త్రాలను ఆగకుండా ప్రయోగించింది. మీనాక్షి వాటికి చిరున వ్వుతోనే బదులిచ్చింది. కాసేపటికామే, "ఛీ, నీలాంటి వాళ్ళింటికి రావడం నాదే పొర పాటు" అని ఛీత్కరించి వెళ్ళిపోయింది.

ఈ విషయం మీనాక్షి తలిదండ్రులదాకా వెళ్ళింది. వాళ్ళామెను చూడవచ్చి, "నీ

మూలంగా మేము నలుగురిలో తలలు దించుకోవాల్సి వచ్చింది" అని నిష్ఠూరమాడారు.

"మీ తలలు- నా భర్త నన్ను హింసిస్తున్నప్పుడు వంగలేదు. ఆయన చెడు తిరుగుళ్ళకు వంగలేదు. కన్నబిడ్డగా నేను మీ ఆశ్రయం కోరివస్తే బలవంతాన ఆ నరకంలోకే తోసేసినప్పుడు వంగలేదు. ఇప్పుడు నా దారి నేను చూసుకుంటే అవెందుకు వంగుతున్నాయో నాకు తెలియడంలేదు" అంది మీనాక్షి.

ఆ మాటలకూ వారి తలలు వంగలేదు. వారామెను బుజ్జగిస్తూ, "నువ్వు శీలవతిగా ఉన్నంతకాలం మా తలలు వంగలేదు. ఇప్పుడు నువ్వెన్నుకున్న దారి మా తలలను కిందకు దించడమే కాదు, నీ జీవితాన్ని నాశనం చేసి నిన్ను అధఃపాతాళానికి నడిపిస్తుంది" అన్నారు.

"నేను నా భర్త నడిచిన దార్లోనే నడుస్తున్నాను. శీలమంటే నాకు తెలియదు. కానీ అధఃపాతాళమంటే తెలుసు. అందులోకి మీరే నన్ను తోసేసారు. అందులోంచి బయటపడ్డానికే నేనిప్పుడు దారి వెతుక్కుంటున్నాను" అంది మీనాక్షి.

ఆమె తండ్రికి ఉక్రోషం వచ్చింది, "ఆడపిల్లను కనగానే సరిపోదు. మనకు తలవంపులు తెచ్చేలా దీన్ని పెంచావు. వంచే మార్గం నువ్వే చెప్పు" అంటూ కోపంగా తన భార్యవంక చూసాడు.

మీనాక్షి తల్లికి ఏమనాలో, ఏంచేయాలో తోచక అసహాయంగా బిత్తర చూపులు చూసింది. మీనాక్షి ఆమె వంక జాలిగా చూసి, "అమ్మా! నాన్న నన్ను వంచలేనన్నాడు. ఆయనకు వంగి బతుకుతున్న నువ్వు నన్నేం వంచగలవు? అందుకని మీరిద్దరూ ఆ ఆలోచన మానుకుంటే మీ తలవంపులు పోగొట్టే ఉపాయం చెబుతాను" అంది.

"ఏమిటే అది?" అంది మీనాక్షి తల్లి ఆశగా.

## అమెరికన్ బుర్ర



ఓ నార్వేవాడు, ఓ జర్మన్, ఓ అమెరికన్ వెళుతున్నారు. దారిలో అల్లావుద్దీన్ దీపం లాటిది దొరికింది. దాన్ని రుద్దగానే దేవత ప్రత్యక్షమైంది. 'తలో వరమిస్తా.. కోరుకోండి' అంది. వెంటనే నార్వేవాడు పెళ్లాంపిల్లలను విడిచి వచ్చి చాలా రోజులైందని, తక్షణమే వాళ్లదగ్గరికి చేర్చమని కోరాడు.

'తథాస్తు' అందామె. అతను మాయమై తనవాళ్లను కలిశాడు.

తర్వాత జర్మన్ తను హవాయి బీచ్‌లో అమ్మాయిలతో ఉండాలన్నాడు. దేవత అనుగ్రహంతో అతనూ మాయమయ్యాడు.

చివరికి అమెరికన్ వంతు వచ్చింది. 'ఇప్పుడు మాయమైన వారిద్దరూ నాకు మిత్రులు. వాళ్లు లేకుండా బతకలేను. వారిద్దరినీ తక్షణం ఇక్కడికి రప్పించు' అన్నాడు.

'తథాస్తు' అంది దేవత

"మీ తలవంపులకు కారణం తరచుగా ఈ ఇంటికొచ్చే ఓ పురుషపుంగవుడు. అందుకాయన తల ఏ మాత్రమూ వంగలేదు సరికదా- ఆయన పూర్వంకంటే గొప్పగా తలెత్తుకుని తిరుగుతున్నాడు. ఆయన్ను చూసి మీరూ తలెత్తుకుని తిరగడమెలాగో నేర్చుకోండి. లేదూ మీకు తలలు వంగినప్పుడాయన తలెందుకు వంగలేదో అడిగి తెలుసుకోండి" అంది మీనాక్షి.

"దీనికి ఒళ్ళంతా పొగరు బలిసిపోయింది" హూంకరించాడు మీనాక్షి తండ్రి.

"నా తల వంగకపోవడానికి అదే కారణమైతే నేనెప్పుడూ పొగరుగానే ఉంటాను" అందామె.

ఆమె తలిదండ్రులు వెళ్ళిపోయారు. ఆ

తర్వాత ఓ రోజున భర్త వచ్చాడు.

"ఎవరండీ మీరు? " అనడిగింది మీనాక్షి అతణ్ణి.

"అదేమిటి మీనాక్షీ! నేను నీ భర్తను" అన్నాడతడు శాంతంగా.

"నేను మీరు అంటే మీరు నువ్వు అంటా రేమిటి? మర్యాద ఇచ్చిపుచ్చుకోవాలని తెలియదా? "

అతడు కోపగించుకోకుండా, "భార్యాభర్తలు కలిసి ఒకే ఇంట్లో ఉండడం మర్యాద. నువ్వు నాతో వస్తేనే మనం మర్యాద పాటించినట్లవుతుంది" అన్నాడు.

"తాగుబోతులతో కలిసుండడం నాకు మర్యాద కాదు"

"కానీ నేను నీకు తాళి కట్టిన భర్తను"

"తాళి కట్టావని ఆలి జీతంతో తాగి తందనాలాడాలని నీకు సరదాగా ఉందేమో- తాగుబోతుల చేత ఇంట్లోంచి గెంటించుకునే సరదా నాకు లేదు" అందామె తనూ సంబోధన మార్చి

"జరిగిందేదో జరిగిపోయింది. ఇకమీదట మనం ప్రశాంతంగా కాపురం చేసుకుందాం" అతడి గొంతులో అభ్యర్ధన.

భర్త అలా అనడానికి కారణం మీనాక్షికి తెలుసు. ఆఫీసులో అతడిమీద ఎంక్వైరీ కమిటీ వేసారు. ఆ కమిటీ సభ్యులు మీనాక్షిని ఇంటర్వ్యూ చేయాల్సి ఉంది. అతడి ఉద్యోగం ఆమె మాటలమీద ఆధారపడి ఉంది.

"జరిగిందేదో జరిగిపోయింది. నేనిప్పుడు ప్రశాంతంగా ఉన్నాను. ప్లీజ్- నామానన నన్ను బతకనీ" అందామె.

"నీకు ఒళ్ళంతా పొగరు" అన్నాడతడు చివరికి.

"ఆ పొగరు ఒకప్పుడు నీకుండేది. ఇప్పుడు నాకొచ్చింది. ఆ పొగరుతోనే చెబుతున్నాను. గెటౌట్" అందామె.

అతడు వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఎంక్వైరీ కమిటీ సభ్యులు వస్తే మీనాక్షి వాళ్ళ దగ్గర నిజాలొక్కటి కూడా దాచ లేదు.

కమిటీ సభ్యుల్లో ఒకాయన వయసులో కాస్త పెద్దవాడు. ఆయన మీనాక్షిని అనునయిస్తూ, "పొరపాట్లు మానవసహజం. నీ భర్తవల్ల తప్పు జరిగింది. అందుకతడు పశ్చాత్తాప పడుతున్నాడు. నీ కాళ్ళు పట్టుకుందుకు సిద్ధంగా ఉన్నాడు. తాళి కట్టిన భర్త కాబట్టి అతణ్ణి పెద్ద మనసుతో క్షమించు. అలా అతడి ఉద్యోగమూ నిలబడుతుంది. నీ కాపురమూ చక్కబడుతుంది" అన్నాడు.

మీనాక్షి వెంటనే, "నా మనసు పెద్దదే. అందుకే అది చిన్న అబద్ధం కూడా చెప్పదు. నేనాయన గురించి అన్నీ నిజాలే చెబుతాను. మీరు పెద్ద మనసుతో అర్థం చేసుకుని క్షమించి ఆయన ఉద్యోగం నిలబెడితే అందుకు నాకు అభ్యంతరం లేదు" అంది తడుముకోకుండా.

ఆ పెద్దాయనకు నోటమాట రాలేదు.

మీనాక్షిని విచారించడమయ్యేక ఎంక్వైరీ కమిటీ అందజేసిన నివేదిక ప్రకారం ఆమె భర్త ఉద్యోగం ఊడింది. అందుకు భర్త, అత్తింటివారు, సమాజంలోని కొందరు పెద్దమనుషులు ఆమెను దుమ్మెత్తిపోసారు. మీనాక్షి తలిదండ్రులు కూడా ఆమె మొండితనాన్ని చీదరించుకున్నారు.

మీనాక్షి ప్రవర్తనకు ముక్కున వేలేసుకున్నవారిలో ఎక్కువమంది మహిళలే. పెళ్ళాం తప్పుల్ని మొగుడు క్షమించకపోవడం సహజం కానీ- మొగుడి తప్పుల్ని క్షమించలేకపోయిన ఆడది మన సమాజంలో విచిత్రమే కదా!

మీనాక్షి భర్త ఆమె ఉద్యోగం ఊడగొట్టించాలని ప్రయత్నించాడు. ఆమె నడవడిక మంచిది కాదని ఆఫీసుకు ఫిర్యాదు చేసాడు. ఐతే మీనాక్షి అతడి నడవడిక




## అశనిపాతం

పిడుగుపాటు ఎలా ఉంటుందో చూడాలనే కోరిక, కుతూహలం ఉండని దెవరికి? ఓ అంతర్జాతీయ ఛాయా చిత్రగ్రాహకుడు ఆ అపురూప దృశ్యాన్ని తన కెమెరాలో ఇలా బంధించి చూపాడు.

మంచిదికాని కారణంగా భర్త ఉద్యోగం పోగొట్టుకున్న విషయాన్ని ప్రస్తావించ డంతో ఆమె ఉద్యోగానికి ఢోకా లేకపో యింది.

అందులోనూ ఆమెను అభిమానించే పురుషపుంగవుడి పలుకుబడి ఇంతా అంతా కాదు.

డెయిలీవేజ్‌లో చేరిన ఆర్నెల్లకు టెంప రరీ అపాయింట్‌మెంటు. ఆ తర్వాత ఏణ్ణ ర్థానికి ఆమె ఉద్యోగం పెర్మనెంటయింది. తన ప్రొబేషన్ పూర్తయ్యేక ఆమె ఆయనిం టికెళ్ళి స్వీట్సిచ్చింది.

"ఇంటికెందుకొచ్చావ్? నీ ఇంటికొచ్చి తీసుకుందునుగా? " అన్నాడాయన నర్మగ ర్భంగా.

"ఇక మీరు నా ఇంటికి రారు. అది చెప్పడానికే వచ్చాను" అంది మీనాక్షి.

ఆయన నవ్వుతూ, "ఆ మాట కూడా నీ ఇంటిదగ్గరే చెప్పొచ్చు" అన్నాడు.

"నేను మీకు చెప్పడానికి రాలేదు..." అంది మీనాక్షి.

"ఓసారి మీ భార్య మా ఇంటికొచ్చి మీరు నన్ను కలవకుండా ఆపమన్నారు. అది చాలా న్యాయమైన కోర్కె అనిపిం చినా తీర్చడానికింత కాలం పట్టింది. ఐనా బెటర్ లేట్ దాన్ నెవ్వర్ అని ఆవిడకు చెప్పడానికొచ్చాను"

ఆ పురుషపుంగవుడి ముఖం ఎర్రబ డింది, "నేను ఉద్యోగాలు వేయించనూ గలను. తీయించనూ గలను" అన్నాడా యన.

"ఇప్పుడు డెస్టినేషన్ చేరుకుందుకు బోలె డన్ని ట్రెయిన్లూ, బస్సులూ ఉన్నాయి. ఛాయిస్ వాటిది కాదు, కస్టమర్సుదే" అని వెనక్కు తిరిగిందామె.

పురుషపుంగవుడు తెల్లబోయాడు.

బరితెగించిన ఆడది ఏమైనా చెయ్యగ లదు. అలాంటి ఆడపిల్ల కొన్నాళ్ళైనా తనకు లొంగి ఉండడం అదృష్టం. అంత టితో తృప్తిపడి ఊరుకోవడం తనకు మంచిదనిపించినా అహం ఇంకా లోప ల్నుంచి తన్నుకొస్తుంటే, "ఆగు" అన్నాడు.

ఆమె ఆగి వెనక్కు తిరిగి అయన్ను సమీపించింది.

"ఛాయిస్ కస్టమర్‌దే అన్నావుగా, నేనే కస్టమర్ని. నా ఛాయిస్ నువ్వే" అన్నాడా యన.

"యువర్ ఛాయిస్ ఈజ్ వెరీ గుడ్" అంది మీనాక్షి.

"రాత్రి నీ ఇంటికొస్తున్నాను" అన్నాడా యన.

"యువర్ ఐడియా ఈజ్ వెరీ బాడ్" అంది మీనాక్షి.

"గుడ్డో బ్యాడో చెప్పాల్సింది చెప్పాను. రాత్రికి రెడీగా ఉండు" అన్నాడాయన.

"మరి నేను వెళ్ళొచ్చా? "

"ఊఁ" అన్నాడాయన.

ఆ రాత్రి ఎనిమిది దాటేక ఆయన ఆమె ఇంటికి వెడితే తలుపు తీసిన అమ్మాయిది పరిచితమైన ముఖమే కానీ ఆమె మీనాక్షి కాదు.

"మామయ్యగారూ మీరా? నేనిక్కడు న్నానని మీకెలా తెలుసు? " అందామె.

పురుషపుంగవుడామెను గుర్తుపట్టాడు. ఆమె మాలతి. ఆమె తండ్రి పోలీస్ డిపా ర్టమెంట్లో డీయస్పీ. ఆ డీయస్పీ భార్య తన భార్యకు స్నేహితురాలు.

ఆయనకు అర్థమైంది. తన భార్య పరిచ యాలు తక్కువవేం కావు. ఇప్పుడు మీనాక్షి సహకరించడంతో తన ఆటలు కట్టించడానికి తన పరిచయాలనుపయో గించుకుంటోంది.

సమాజంలో తన భార్య తరఫువారికీ చెప్పుకోతగ్గ పలుకుబడి ఉంది. ఇంతకాలం అదుపయోగించుకుందుకు అభిమానం అడ్డొచ్చి ఉండాలి. దేన్నీ తెగేదాకా లాగకూ

డదు. ఇప్పుడు తను తన భార్యతో ఢీకొంటే జయం ఆమెనే వరించడం తథ్యం. అదే జరిగితే ఆమె తనను లోకువ కడుతుంది. ఒకసారి లోకువ కట్టిందా .. అది ఇంట్లో ఎన్నో ప్రమాదకరమైన పరిణామాలకు దారి తీస్తుంది.

అపజయం వేరు. వెనక్కు తగ్గడం వేరు. వెనక్కు తగ్గిన పొట్టేలు మరింత బలంగా ముందుకొచ్చి ఢీకొన గలదన్న భయముండే అవకాశముంటుంది.

పురుషపుంగవుడు గుమ్మంలోనే ఆగిపోయాడు. ముఖానికి కాస్త చిరునవ్వు పులిమాడు. మాలతికేదో కుంటిసాకు చెప్పాడు. వెనక్కు తిరిగాడు. ఆ తర్వాత ఆయన మళ్ళీ ఆ ఇంటి గడప తొక్కలేదు. బయటకూడా మీనాక్షిని పలకరించే ప్రయత్నం చెయ్యలేదు.

ఆఫీసులో మీనాక్షి మంచి పనిమంతురాలిగా పేరు తెచ్చుకుంది. అవసరంలో ఉన్న వారికి తనకు చేతనైనంతలో ధనసాయమూ, పనిసాయమూ చేసేది. ఎప్పుడూ నవ్వుతూ ఉండేది.

ఆఫీసులో అందరికీ ఆమె గతం తెలుసు. అందుకని కొందరు మగాళ్ళకామె అంటే ఆశ. వాళ్ళామెను ఏదో వంకన పలకరించి ఆమె అందాన్ని పొగిడేవారు.

"అందం నాకు దేవుడిచ్చాడు. సామర్థ్యం కృషితో సాధించాను. దేవుడిచ్చిందానికొచ్చే గుర్తింపు నాకు సంతోషాన్నివ్వదు. నా సామర్థ్యానికి తగిన అర్హత లేనప్పుడే అందానికి పొగడ్తలు లభిస్తాయని నేనను కుంటాను" అందామె వారితో.

కొందరామెతో మరింత సూటిగా జీవితంలో తోడుకున్న ప్రాధాన్యాన్ని వివరించే వారు.

"తోడుకోసం నేను పెళ్ళి చేసుకున్నాను. ఆ వెంటనే నాకు తలిదండ్రుల తోడు లేకుండా పోయింది. ఆ తర్వాత భర్త తోడు కాదని తెలిసింది. పెళ్ళి కాగానే ఆడపిల్ల ఏ తోడూ లేనిదౌతుంది. ఒకసారి పెళ్ళయ్యాక ఆడదానికి ఏ తోడూ దొరకదు" అందామె.

వారామెపట్ల సానుభూతిని ప్రదర్శిస్తూ, "నువ్వలా అనుకోకూడదు. అన్నివిధాలా కాకపోయినా మేము నీకు కొన్ని విధాలా తోడు కాగలం" అంటూ తమ సంసిద్ధతను ప్రకటించారు.

వారి సంకేతాన్నామె గ్రహించింది.




సభ్యంగా అసభ్యతను సూచించిన వారిపై కోపగించుకోకుండా, "థాంక్స్! అవసరమనిపిస్తే మీకు తప్పక కబురు పెడతాను" అందామె.

ఆమె వారిని మర్యాదగా వదుల్చుకున్నాననుకుంది కానీ వాళ్ళలో ఆశలు రగిల్చాననుకోలేదు. వాళ్లామె కబురుకోసం ఇంట్లో కలలు కంటున్నారు. ఆఫీసులో ఎదురు చూస్తున్నారు.

వాళ్ళ ఆశకు కారణం లేకపోలేదు.

ఒంటరిపోరాటంతో రాటుదేలిన సబల ఆమె. అందుకే స్త్రీపురుష విభేదం లేకుండా అందరితోనూ నిర్భయంగా మాట్లాడుతుంది. నిస్సంకోచంగా ప్రవర్తిస్తుంది. ఏ మగాణ్ణీ అన్నయ్య అనదు.

పురుషపుంగవుడికీ తనకూ ఉన్న సంబంధం గురించి కూడా ఆమె దాచదు. అలాగని తమ సంబంధాన్ని సరసమైన కథలుగా వినిపించదు.

ఆమె మాటలు చిత్రంగా ఉంటాయి.

"ఒకప్పుడు పాశ్చాత్య దేశాలకు వెళ్ళడం తప్పు. వెళ్ళినవారు తిరిగొచ్చాక చేసుకునే ప్రాయశ్చిత్తమొక పెద్ద తంతుగా ఉండేది. అది అనాగరికయుగమనే అనాలి. తర్వాత పాశ్చాత్య దేశాలకు వెళ్ళడం ఘనకార్యమని పించుకుని సన్మానార్హత తెచ్చిపెట్టింది. ఇప్పుడు విదేశాలు వెళ్ళి రావడం రొటీనుగా మారిపోయింది. శీలాన్ని కూడా రొటీనుగా భావించనంతవరకూ ఆడపిల్ల అనాగరిక యుగంలో ఉన్నట్లే లెక్క!"

మరికొందరు మగాళ్ళు ఆమెపై ఆశప డర్రూ?

కానీ ఆఫీసులో ఎవరికీ ఆమెనుంచి ఆశించిన కబురందలేదు.

ఉద్యోగంలో పెర్మనెంటైన మూడేళ్ళకు కాబోలు ఆమె భర్త మరో పెళ్ళి చేసుకుం దుకుగానూ ఆమె నుంచి విడాకులు కోరాడు.

"మన పెళ్ళి రిజిస్టరు కాలేదు. నేను నీ భార్యననడానికి సాక్ష్యం నా మెడలోని తాళిబొట్టు మాత్రమే. దాన్ని నేనెప్పుడో తీసేసాను. ఒకప్పుడు నువ్వు నా భర్తవని చెప్పుకుందుకు కూడా సిగ్గుపడే నేను నీ భార్యనంటూ నీ కోసం రావడం ఈ జన్మలో జరగదు. నేనిప్పుడు విడాకులంటే అది నీకు భర్తగా గుర్తింపు ఇచ్చినట్లే. అదీ ఈ జన్మకు జరగదు. నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకుంటే ఆ నీ భార్యకు నువ్వు భర్తవు కావడమే దురదృష్టం. ఆ దౌర్భాగ్యురాలిని వేధించే దౌర్భాగ్యానికి పాల్పడే నీచత్వం నాకు లేదు. నేనేమిటో ఇప్పటికైనా తెలు సుకుని మళ్ళీ నా దగ్గరకు విడాకులకు రాకు" అందామె అతడితో. మీనాక్షి భర్తకు పెళ్ళైంది. అది తెలిసేక మీనాక్షికి కూడా రెండు మ్యారేజ్ ప్రపోజల్సు వచ్చాయి. ఆమె అప్పటికప్పుడే వాటిని కాదంది.

మీనాక్షికి మా వారంటే ఆకర్షణ. ఆ ఆక ర్షణలో నమ్మకమూ, గౌరవమూ కలిసుం డేవి. ఎవరికీ చెప్పని విశేషాలాయనకు చెప్పుకుని అప్పుడప్పుడు సలహాలు కూడా అడిగేదామె. మొదటిసారి సలహా అడిగిన ప్పుడు, "ఇంతవరకూ నన్ను సలహాలడిగిన వారు లేరు" అన్నారాయన ఆమెతో.

"పోని మీరెవర్నైనా సలహాలడిగేరా?" అడిగిందామె.

ఆయన తల అడ్డంగా ఊపారు.

"అదీ వ్యక్తిత్వమంటే? మన నిర్ణయాలు మనం తీసుకోగలగాలి. ఒకవేళ అవసరమై ఎవర్నైనా సలహాలడగాల్సొచ్చినా ఒకర్ని సలహాలడగని వ్యక్తిత్వమున్న వారిని వెతు క్కోవాలి. రాజు, సాధువు కథ తెలిసే ఉంటుంది మీకు?" అందామె.

ఆయన తెలియదన్నారు. ఆమె కథ చెప్పింది.

ఒక సాధువు తన ఆశ్రమ నిర్వహణకు డబ్బు కావాల్సొచ్చి ఆ దేశపు రాజును సాయమడగబోయాడు. ఆ సమయానికి రాజు ప్రార్థనామందిరంలో దేవుడి విగ్రహం ముందు నిలబడి, "ప్రభూ! నా రాజ్యం రెండింతలై, నా కోశాగారం పదిం తలై, నేను కలకాలం మరింత వైభవంగా జీవించేలా అనుగ్రహించు" అని ప్రార్థిం చాడు. అది విన్న సాధువు గిరుక్కున వెనక్కు తిరిగాడు. అది చూసిన రాజా యన్ను వెనక్కు పిలిచి, "నాకోసమొచ్చి నాతో ఏమీ చెప్పకుండానే వెళ్ళిపోతు న్నారేం?" అనడిగాడు. సాధువు నవ్వి, "నాయనా! నేను నిన్ను యాచించాలని వచ్చాను. కానీ నువ్వు దేవుణ్ణి యాచిం చడం చూసాక యాచకుడినేమడుగుతాన్లే అని వెనక్కు తిరిగాను" అన్నాడు.

"అదీ కథ. అందుకే నేను మిమ్మల్ని సలహాలడుగుతున్నాను. వేరెవర్నీ కాదు" అందామె.

ఐనా ఆయన ఆమెకు సలహాలిచ్చేవారు

కాదు. ఆమె చెప్పింది శ్రద్ధగా విని చక్కగా విశ్లేషించేవారు. ఆమె ఆ విశ్లేషణను మెచ్చుకుని అదే పది సలహాల పెట్టు అనేది.

తనకు పెళ్ళి ప్రపోజల్సు వస్తున్నాయనీ, తను తిరస్కరిస్తున్నాననీ ఆమె చెప్పినప్పుడు, "మీకసలు పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేదా? " అనడిగారాయన.

"ఉంది. మీలాంటివాడు దొరికితే చేసుకుందామనుకుంటున్నాను" అందామె చటుక్కున.

ఆయన తెల్లబోయి "నాకు పెళ్ళైపోయింది" అన్నారు వెంటనే.

"మిమ్మల్ని అనలేదు. మీలాంటివాణ్ణి అన్నాను" నవ్విందామె.

ఆయన ఉబ్బిపోయి, "థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్" అన్నారు.

"కాంప్లిమెంట్ కాదు, డిజైర్!" అందామె.

డిజైర్ ఆడదాని నోట ఆ ఒక్కమాట చాలు, మగాడి మనసులో సంచలనం కలగడానికి. కానీ ఆయన అదామె ఆశయంగా భావించి ఆ విషయాన్నక్కడితో మర్చిపోయారు.

ఆ తర్వాత వాళ్ళ మధ్య మళ్ళీ ఆమె పెళ్ళి ఊసు రాలేదు.

మీనాక్షి వ్యక్తిగత జీవితం గురించి ఆఫీసులో చాలా పుకార్లున్నాయి. వాటినామె ముఖంమీద అనగల సాహసం ఎవరికీ లేదు. మీనాక్షి చాటుమాటు ప్రచారానికి కన్నీళ్ళు పెట్టుకోదు. చలించదు.

మీనాక్షి అందరితో మంచిగా ఉంటుంది. ఎవరి గురించీ చెడుగా చెప్పదు. తనతో చొరవ చేయబోయిన వారిని కూడా మృదువుగానే మందలిస్తుందామె. ఆఫీసు పనులకూ, వ్యక్తిగత అవసరాలకూ తన అందంమీద కాక సామర్థ్యం మీదా, మంచితనం మీదా ఆధారపడుతుంది.

మనదేశంలోని సగటు ఆడదాని దృక్పథంతో చూస్తే ఆమెకు ప్రతిరోజూ జీవన పోరాటమే. కానీ ఇప్పటికీ ప్రతిరోజూ నవ్వుతూనే ఉంటుందామె.




"ఎన్నేళ్ళుంటాయ్ మీనాక్షికి? " నాకు కథంతా వినగానే కలిగిన మొదటి సందేహమది.

"వయసులో నీకంటే ఐదేళ్ళు తక్కువ. అందంలో నీకంటే ఎన్నో రెట్లు ఎక్కువ" అన్నారాయన. ఏంచెబితే నేను రియాక్టౌతానో అవే చెబుతారాయన. కానీ పండిపోయానుగా. ఆ వివరాలు పట్టించుకోకుండా, "నేనోసారి ఆ పిల్లను చూడాలి" అన్నాను.

"పిల్లంటున్నావు. ఆమెకెన్నేళ్ళని నీ ఉద్దేశం? "

"నాకంటే ఐదేళ్ళు చిన్నదన్నారు..."

"ఎన్నో రెట్లు అందమైనదని కూడా అన్నాను"

"నేను మీరిచ్చిన సమాచారాన్ని నమ్ముతాను. అభిప్రాయాన్ని కాదు"

"ఐతే ఓ సారా పిల్లను చూడు. నా అభిప్రాయమే నీ అభిప్రాయమూ ఔతుంది" అన్నారాయన పిల్ల అన్న పదాన్ని ఒత్తి పలుకుతూ.

"చూస్తాననే కదా అంటున్నాను. మరి చూపించాల్సింది మీరు..."

"సరే చూపిస్తాను"

"ఆ పిల్లా నేనూ మాట్లాడుకుంటున్నప్పుడు పక్కన మీరుండకూడదు" నేనూ పిల్ల అన్న పదాన్ని ఒత్తి పలికాను.

"అలాగంటే ఎలా? అసలే నీకు అదుపు తక్కువ. ఆ పిల్లేమో మాట పడదు. గొడవైతే మనకు బాగుండదు. కాబట్టి నేను పక్కనుండి తీరాలి" అన్నారాయన.

"గొడవెందుకౌతుంది? " నిలదీసాను. ఆయనేదో అనబోయి ఆగిపోతే, "తల్లి పుట్టిల్లు మేనమామ దగ్గిరా? మీరు చెప్పిన రొమాంటిక్ కథ విని నేనేదో మిమ్మల్నినుమానించానని తెగ మురిసిపోకండి. నాకు మీ సంగతి తెలుసు. మా అమ్మా నాన్నా పిల్లనివ్వకపోతే మీకీ జీవితంలో పెళ్ళి ఉండేది కాదు" అన్నాను.

"ఔను. వాళ్ళు పిల్లనివ్వబట్టే- పెళ్ళి ఉండకపోతే ఈ జీవితం ఎంత బాగుండునూ అనిపిస్తోంది"

నాకు తెలుసు. దేనికీ సమాధానానికి తడుముకోరాయన, "ఇలా మాటకు మాట అనుకోవడం రొమాన్సు కాదు. ఆడది చెప్పిందానికల్లా గంగిరెద్దులా తలూపితే అదే రొమాన్సు" అన్నాను.

"ఈవేళా గొప్ప రహస్యం తెలుసుకున్నాను. నీ టేస్టు తెలుసుకుందుకు నిన్ను రొమాన్సుకు నిర్వచనం అడగాలి. ఆహా ఏం టేస్టు? "

ఆయన నన్ను దెబ్బతీయడం కొత్త కాదు. ఐనా ఎప్పటికప్పుడు నాకు ఉక్రోషమొస్తూనే ఉంటుంది.

★ ★ ★

ఆయన అన్నమాట నిలబెట్టుకున్నారు. ఓ రోజున పిల్లలు స్కూల్నించి తిన్నగా ట్యూషన్‌కి వెళ్ళిపోయిన సమయంలో ఆయన మీనాక్షిని మా ఇంటికి తీసుకొచ్చారు. అప్పుడాయనకు ముందుగా ఏర్పాటు చేసుకున్న ఫోన్ కాలొచ్చింది. ఇప్పుడే వస్తానని బయటకెళ్ళారు.

మీనాక్షి బాగుంది. నాకంటే ఐదేళ్ళే చిన్నది కావచ్చు కానీ పదేళ్ళు చిన్నదన్నా నమ్మేలాగుంది. ఇద్దరం డ్రాయింగు రూంలో కూర్చున్నాం.

"సాధారణంగా గృహిణులెవరూ నన్ను తమ ఇళ్ళకు ఆహ్వానించరు. అందుకే మీ పిలుపుకు ఆశ్చర్యపోయాను. ఐతే ఆశ్చర్యం తొందరగానే పోయింది" అంది మీనాక్షి.

ఆమె గొంతు కూడా తియ్యనిదే అనుకుంటూ, "ఆశ్చర్యపోవడం ఆశ్చర్యం కాదనుకుందాం. కానీ ఆ ఆశ్చర్యం పోవడమెలా జరిగింది? " అన్నాను.

"మీవారి సంస్కారం అసామాన్యం, ఆయన ఎన్నిక మీరు" అంది మీనాక్షి.

ఆశ్చర్యంగా ఆమె వంక చూసాను. ఆమె కళ్ళలో మా వారిపట్ల ఆరాధనా భావం స్పష్టంగా కనపడింది. "నేనాయన ఎన్నిక కాదు. మాది పెద్దలేర్పాటు చేసిన పెళ్ళి" అన్నాను.

"కానీ ఆర్నెల్లు సావాసం చేస్తే వారు వీరౌతారంటారు. మీ సహవాసానికి పదిహేనేళ్ళు దాటిందేమో" అందామె.

ఆయనకు మీనాక్షి పుట్టిన రోజు కూడా తెలుసు. కానీ ఆమెకు మా పెళ్ళి రోజు కూడా తెలిసినట్లు లేదు.

"పెళ్ళై ఎన్నేళ్ళైతేనేం మా సావాసం ఆర్నెల్లు దాటిపోయిందిగా. కానీ మారింది నేనని ఎందుకనుకోవాలి? నా సంస్కారమే ఆయనకు అబ్బిందేమో" అన్నాను.

"కావచ్చు కానీ ఈ విషయమై నాకో నిర్దుష్టమైన అభిప్రాయముంది. మీరేమీ అనుకోనంటే చెబుతాను" అందామె కాస్త సంకోచంగా.

"చెప్పండి" అనుమతించాను హుందాగా.

"మన వ్యవస్థలో- ఎలాంటి పెంపకమూ ఆడవాళ్ళకు సంస్కారాన్ని అబ్బనివ్వదని నా అభిప్రాయం" అందామె నమ్మకంగా.

వ్యవస్థ తనకిచ్చిన అనుభవాల్లోంచీ ఆ అభిప్రాయాన్నామె ఏరుకుందని నాకు తెలుసు. ఐనా నేనా అభిప్రాయంలో నాపై విసురును పసిగట్టాను. "అంటే మగాళ్లకు మాత్రమే సంస్కారముంటుందని మీ అభిప్రాయం. నేను మీతో ఏకీభవించలేను" అన్నాను.

"నా కథ తెలిస్తే మీరూ నా అభిప్రాయంతో ఏకీభవిస్తారు" అంది మీనాక్షి నెమ్మదిగా.

ఆయన ముందే తన కథను చెప్పినట్లు నేను మీనాక్షికి చెప్పదల్చుకోలేదు. ఎందుకంటే నేనిప్పుడామె చెప్పింది విని ఆయన చెప్పిందాంతో సరిపోల్చాలనుకుంటున్నాను. ఆయన కొన్నైనా అబద్ధాలు చెప్పారని నా అనుమానం.

అప్పుడు మీనాక్షి తన కథను చెప్పింది. ఆశ్చర్యంగా అది అక్షరం పొల్లు పోకుండా అచ్చం మావారు చెప్పిన కథలాగానే ఉంది. ఐతే ఇంకో విశేషం నన్ను మరింత ఆశ్చర్యపర్చింది. ఒక ఆడది ఏ దాపరికమూ లేకుండా వివాదాస్పదమైన తన జీవిత విశేషాలను అలా చెప్పగలగడం అసాధారణం కదా!

"నా కథ నా ఒక్కతి కథ మాత్రమే కాదు. అది ఒక ఆడపిల్ల ఆడతనపు సమస్య. కానీ మన చుట్టూ ఉన్నవారిలో ఎంతమంది ఆడవాళ్ళు దీన్ని ఆడతనపు సమస్యగా తీసుకుంటారు? కొందరు చోద్యం చూస్తారు. కొందరు రాళ్ళు రువ్వుతారు. ఒక్కరూ సానుభూతి చూపరు. నా భర్త గురించి తెలిసిన నేను మగాళ్ళందరూ సంస్కారవంతులనడం అసంబద్ధంగా ఉంటుంది. కానీ ఆడవాళ్ళలో- కన్న తల్లి కూడా నాకు చేయూతనివ్వడం తనకు వీలుకాని మహాసాహసంగా భావించి ఊరుకుందంటే ఏమనుకోవాలి?" అంది మీనాక్షి.

అది అనుభవంలోంచి పుట్టిన వేదన. దానికి నా వద్ద సమాధానం లేదు. కానీ ఈ విషయంలో తప్పంతా ఆడవాళ్లదేనా? వ్యవస్థ ఆడదాకీ, ఆడతనానికీ సృష్టించిన సమస్యలన్నీ- ఆడది ఆడదానికి చేయూతనిస్తే తొలగిపోతాయా?

ఆలోచిస్తున్నాను.

మీనాక్షి నా జవాబు కోసం ఎదురుచూడకుండా, "ఇప్పుడు మీరు నా కథ విన్నారు. మీకు నన్ను మెచ్చుకోవాలనిపిస్తోందా? నన్ను ప్రేరణగా తీసుకోవాలనిపిస్తోందా? ఇలా ఎందుకడుగుతున్నానంటే- నా కథను ఈ నోటా ఆ నోటా విన్న ఆడవాళ్ళందరూ నన్ను దగ్గరకు రానివ్వకూడదనే నిర్ణయించారు. మీకూ నా గురించి ఎంతో కొంత తెలిసుంటుందనే నా నమ్మకం. ఐనా మీరు నన్ను ప్రత్యేకంగా మీ ఇంటికాహ్వానించారు. ఆ సంస్కారం వాళ్ళూ మీరూ వేరని చెప్పకనే చెబుతోంది" అంది.

ఇప్పటికి దొరికావు కదా అనుకుని "ఆ సంస్కారాన్ని ఓ ఆడదానికి ఆపాదించలేకపోయారు. అందుకే దాన్ని నా భర్తకు అంటగట్టారు" అన్నారు.

"నేనిచ్చిన జనరల్ స్టేట్‌మెంటుకి మీరు బాగా హర్టైనట్లున్నారు. నాది పొరపాటే. ఒప్పుకుంటున్నాను. చెప్పమంటే సారీ కూడా చెబుతాను" అంది మీనాక్షి.

"అడిగి సారీ చెప్పించుకునే వయసు దాటిపోయింది" నవ్వాను.

"పోనీ- సారీ చెప్పను కానీ సంజాయిషీ ఇస్తాను. నాకు మీవారు చాలా ఏళ్ళుగా తెలుసు. ఆయన సంస్కారం ఒకరంటిస్తే వచ్చేది కాదు. అది పుట్టుకతో సహజంగా రావాలి" అందామె.

ఆమె గొంతులో నిజాయితీ. కళ్ళలో ఆరాధన. అవి నేను చదివాను. మీనాక్షిపై మావారి ప్రభావం సామాన్యమైనది కాదని

నాకు స్పష్టమైంది. విశేషాలను జోక్సుగా చెప్పొచ్చుగాక- ఆయన అబద్ధాలు మాత్రం చెప్పరనిపించి ఎంతో సంతోషమైంది. ఐతే ఆ సంతోషం కొద్ది సెకన్లే. మీనాక్షి మా వారిపై చూపుతున్న ఆసక్తి, వారిపై ఆమె కున్న ఆరాధనాభావం నా అహాన్ని కాస్త దెబ్బతీసి వారిపై అసూయను పుట్టిం చాయి.

"ఇంతవరకూ మీకు సంస్కారంలో మా వారిని మించిన పురుషులు ఒక్కరు కూడా తటస్థపడినట్లు లేదు" అన్నాను. మామూలుగా అందామని ఎంతో ప్రయత్నించాను. కానీ అసూయ నా గొంతులోని వ్యంగ్యాన్ని దాచలేకపోయింది.

మీనాక్షి ఆలోచిస్తుందనుకున్నాను. కానీ ఆమె నా ప్రశ్న ఇలా పూర్తవగానే అలా తల అడ్డంగా ఊపుతూ, "లేదు" అంది.

నేను ముందు ఆశ్చర్యపోయాను. ఆ తర్వాత నాలో భయం. అందుక్కారణం- మీనాక్షి ఆలోచనల్లో ఆయనకున్న స్థానం- నాకు ప్రమాదకరంగా పరిణమించదు కదా అన్న అనుమానం.

మావారి అంచనాలో తప్పులేదు. మీనాక్షి నాకంటే అందమైన చిన్నది. చిన్నదంటే వయసులోనూ చిన్నది. తనతో పోల్చితే నా వ్యక్తిత్వం చిన్నది. చిన్నదంటే చిన్నబోవడంవల్ల చిన్నది.

నేను కూడా తల అడ్డంగా ఊపుతూ, "నేను నమ్మను" అన్నాను.

మీనాక్షి నవ్వింది. ఆ నవ్వు మనోహరంగా ఉంది. నా అవగాహనాలోపానికి జాలిపడుతున్నట్లుగా ఉంది. "నమ్మమని మిమ్మల్ని బలవంతపెట్టను. కానీ చిన్న రిక్వెస్టు. సంస్కారంలో మీవారిని మించిన పురుషులెవరైనా మీకు తటస్థపడితే వారి గురించి చెప్పండి. నా పరిజ్ఞానాన్ని పెంచుకుంటాను" అందామె. గొంతులో కుతూహలం అనిపించినా నాకు మాత్రం సవాలు వినిపించింది.

"దొరికావు" అనుకున్నాను ఉత్సాహంగా, "భార్యకు భర్త బాస్. భర్తకు భార్య దాసి. అలాగని భార్య ముఖం మీదే అనేవాణ్ణీ, ఆమె తల్లిదండ్రులను హేళన చేసేవాణ్ణీ మీరు సంస్కారవంతుడనే అంటారా?"




అన్నాను.

నేనలా ఎందుకడిగానో మీనాక్షికి అర్థమైనట్లుంది. నమ్మలేనట్లు నన్నే చూస్తూ, "అనసుగాక అనను" అంది.

"మా వారి గురించి మీకు తెలియని, నాకు తెలిసిన- నిజమిది" అన్నాను.

మీనాక్షి ముఖంలో ఆశ్చర్యం. ఆ వెంటనే అసంతృప్తి. "ఆయన్ను చూస్తే అలాగనే టైపు అనిపించదు. దీన్నిబట్టి ఏ మనిషినైనా అంచనా వెయ్యాలంటే ఓ మాదిరి పరిచయం చాలదనిపిస్తోంది"

ఆమె గొంతులోని బాధ నాలో విజయ గర్వాన్ని సృష్టించగా, "మిమ్మల్ని నేను కలుసుకోవాలనుకున్న కారణమూ అదే! మీరన్నారట కదా- పెళ్ళయ్యాక ఆడది తోడులేనిదౌతుంది- నాకూ అదే నిజమనిపించి మీతో నా అభిప్రాయాలు పంచుకోవాలనుకున్నాను. ఇంతకీ మీవారు కూడా మిమ్మల్ని దాసి అనేవారా?" అనడిగాను.

"దాసి కాదు. కాలికింద చెప్పు అనేవాడు. అనడమేకాదు, అలాగే చూసేవాడు..."

## కొట్టిందెందుకో..?

ఒక మెట్రోరైలులో ఒక లావుపాటి మహిళ, ఓ అందమైన అమ్మాయి, ఓ కెనడా వాడు, ఓ అమెరికన్ ప్రయాణిస్తున్నారు. రైలు సొరంగంలో ప్రవేశించినపుడు కంపార్ట్‌మెంటంతా చీకటైంది. ఆ సమయంలో 'ఛెళ్' మని చెంపదెబ్బ కొట్టిన శబ్దం వచ్చింది. రైలు సొరంగం వెలుపలికి వచ్చాక చూస్తే అమెరికన్ చెంప వాచిపోయి కన్పించింది.

లావుపాటావిడ, 'ఈ వెధవ ఆ పిల్లని చీకట్లో గట్టిగా వాటేసుకున్నాడు.. అదేమో చెంప ఛెళ్లు మన్పించింది' అనుకుంది.

అందమైన అమ్మాయేమో, 'నన్ను వాటేసుకోబోయి ఆ బొండాన్ని పట్టుకున్నాడు కాబోలు.. తగినశాస్తి జరిగింది' అనుకుంది.

అమెరికన్, 'ఆ కెనడా వెధవ అందమైన అమ్మాయిని వాటేసుకోబోతే వాడనుకుని నన్ను కొట్టినట్టుంది' అనుకున్నాడు.

కెనడావాడు మాత్రం, 'ఇంకో సొరంగం వచ్చేదాకా ఆగలేను. ఈ వెధవను ఇంకో చెంప కూడా పగలగొట్టాలి' అనుకున్నాడు.

ఆమె ముఖం చూస్తే ఏమో గుర్తు చేసుకుంటున్నట్లనిపించింది. ఆమెను మాట్లాడించాలని, "అనడానికీ, చూడ్డానికీ తేడా ఉందంటారా? " అన్నాను.

మీనాక్షి నా ప్రశ్న విన్నట్లు లేదు, "తిట్టేవాడు, కొట్టేవాడు. ఇంట్లో అతడి ఉనికి నన్ను భయంతో వణికించేది. అదీ మామూలు భయం కాదు, ప్రాణ భయం..." ఆగింది మీనాక్షి.

ఆమె అతిశయోక్తులు పలుకుతోందనిపించింది. టాపిక్‌ని నాకు అనుకూలంగా మళ్ళించాలని, "మరెప్పుడూ ప్రేమగా మాట్లాడేవారు కాదా? " అనడిగాను.

"మాట్లాడేవాడు. కానీ అది హృదయం లోంచీ వచ్చిన ప్రేమ కాదు. అవసరం. అంతే! అది గ్రహించేక అతడు ప్రేమగా మాట్లాడినా భయమేసేది...."

నాకు కొంత అర్థమైంది. ఆ దృశ్యాలు ఊహించుకుంటే నాకూ భయమేసింది. "అంటే మీరు నరకం చూసారన్న మాట" అన్నాను.

"చూడ్డంకాదు, అనుభవించాను. దాన్నించి బయటపడ్డమెలాగో నాకు తెలుసు. కానీ అంతా నన్నా నరకంలోనే సర్దుకుపొమ్మన్నారు. ఎక్కడైనా సర్దుకుపోవచ్చుకానీ నరకంలో ఎలా సర్దుకుపోవడం? అదీ ఏ పాపమూ చేయకుండా! ఈ అమానుషాన్ని ఎదిరించడానికి ఎవరి తోడూ దొరక్క చివరికి కన్నవాళ్ళను ఆశ్రయిస్తే వాళ్ళూ నలుగురితోపాటు నారాయణా అయ్యారు. అప్పుడు కలిగింది నాకు- పెళ్ళయ్యాక ఆడది తోడు లేనిదౌతుందన్న భావం..."

భారంగా నిట్టూర్చాను. భర్త పేరు చెప్పి ఆమె అనుభవించిన కష్టాలు ఇన్నీ అన్నీ కావు. ఆమె నుంచి చాలా తెలుసుకోవాలి.. నేర్చుకోవాలి. "మీరన్నది గొప్ప జీవితసత్యం. ప్రతి ఆడపిల్లా ఈ నిజాన్ని తెలుసుకోవాలి..." అన్నాను.

"తెలుసుకుని ఏం లాభం? ఏ ఆడపిల్లైనా ఈ జీవిత సత్యాన్ని కొటేషన్‌గా వాడుకుంటుందేమో తప్ప తనున్న రొంపిలోంచి బయటపడాలనుకోదు"

"ఎందుకనుకోదు? ముందు తరానికి మీరే ఆదర్శం. ఈ రోజునుంచీ నేనే మీ గురించి ప్రచారం ప్రారంభిస్తాను" ఆవేశంగా అన్నాను.

"ముందుతరం సంగతలా ఉంచండి. మీ విషయమే తీసుకుందాం. మీరు కూడా నా గురించి ప్రచారం చేస్తాననంటున్నారే తప్ప నన్ను ఆదర్శంగా తీసుకుంటాననడంలేదు" అంది మీనాక్షి.

నేను తెల్లబోయి, "మిమ్మల్నాదర్శంగా తీసుకోవాల్సిన అవసరం నాకుండాలి కదా!" అన్నాను.

"ఎందుకు లేదు? ఇందాకనే మీదీ

నాలాంటి జీవితమేనన్నారు. తను మీకు బాస్‌నంటూ మిమ్మల్ని తనకు దాసిని చేసిన మీ భర్త మీకో రొంపి కాదా? ఆ రొంపినుంచి బయటపడాలని మీరనుకుంటున్నారా? " నిలదీసిందామె.

ఉలిక్కిపడ్డాను. మీనాక్షి సంభాషణను ఎక్కణ్ణించి ఎక్కడికి మళ్ళించింది?

రొంపినుంచి బయటపడడమంటే మావార్ని నేను విడిచిపెట్టాలి. అదీ మీనాక్షిని ఆదర్శంగా తీసుకుందుకు. మరి మీనాక్షి నాకు ఆదర్శమా?

మొగుణ్ణొదిలేసింది. ఇంకొకడితో కులికింది. పెళ్లీ పెటాకులూ మాని విచ్చలవిడిగా తిరుగుతోంది. ఆమెను నేను ఆదర్శంగా తీసుకోవాలా- ఎందుకు?

అడగాలనే అనుకున్నాను, కానీ ఎలా?

మా వారిపై మీనాక్షికి దురభిప్రాయం కలిగించాలని ఆయన గురించి కొన్ని నిజాలు బయటపెట్టాను. ఆమె అవి విని ఏకంగా ఆయన్నే విడిచిపెట్టమంటోంది.

ఏమనాలో తెలియక మీనాక్షి వంక చూస్తే ఆమె నవ్వి, "మొగుణ్ణొదిలేశాను. ఇంకొకడితో కులికాను. పెళ్లీ పెటాకులూ మాని విచ్చలవిడిగా తిరుగుతున్నాను. నేను మీకు ఆదర్శమా- అనిపిస్తోంది కదూ? " అంది.

నా మనసులోని మాట ఉన్నదున్నట్లు చెప్పింది. ఆమెకు థాట్ రీడింగ్ తెలుసా?

"అలాగని నేనన్నానా? " అన్నాను నొచ్చుకుంటూ.

"మీరనలేదు, కానీ నామీద చాలామంది ఆడవాళ్ళ అభిప్రాయమదే. ఎవరైనా కొందరు నన్ను మెచ్చినా మెచ్చవచ్చునేమో గానీ- ఆదర్శంగా తీసుకోవాలని ఒక్కరూ అనుకోరు" అంది మీనాక్షి.

జవాబివ్వడానికి ఆలోచించాలంటే భయమేసింది. మీనాక్షి నా మనసులో దూరి నా ఆలోచనలు చదివేస్తుందని ఆ భయం!

కొరివితో తల గోక్కున్నందుకు తప్పదు కాబట్టి, "మీనాక్షిగారూ! మీరైతే రికామీగా ఉన్నారు కాబట్టి అనుకున్నది చేయగలిగారు. నాకిద్దరు పిల్లలు" అని సంజాయిషీ ఇచ్చాను.

మీనాక్షి తడుముకోలేదు. "పిల్లలు పుట్టక మునుపు మిమ్మల్ని మీవారు దాసిలా చూడలేదా? "

"మొదట్నించీ ఒక్కలాగే ఉన్నారాయన"

"మరి అలాంటప్పుడు పిల్లలు పుట్టక ముందే ఆయన్నెందుకు వదిలిపెట్టలేదు? "

ఆమె మరీ అంత సూటిగా అలాంటి ప్రశ్న అడుగుతుందని ఊహించలేదు. దానికేదైనా జవాబిచ్చినా మళ్లీ- పిల్లలు పుట్టకుండా ఎందుకు జాగ్రత్తపడలేదని- ఇంకో ప్రశ్న వేయొచ్చు. ఎలాగో అలా ఈ సంభాషణనిక్కడితో తుంచేయాలనుకుని, "నా కాళ్లమీద నేను నిలబడలేనిదాన్ని. ఆయన్ను వదిలి నేనేమైపోతాను? " అన్నాను.

"ఆయనా గ్రాడ్యుయేట్. మీరూ గ్రాడ్యుయేట్. ఆయన తన కాళ్లమీద నిలబడి మిమ్మల్నీ, మీ పిల్లల్నీ పోషిస్తున్నారు. మీరేమో- ఆయన్ను వదిలితే ఏమైపోతానా అని భయపడుతున్నారు. అంటే- కండిషన్సన్నీ ఒకటైనప్పుడు కూడా మీరాయన కంటే తక్కువ. అంతేనా? " అందామె.

నాకు చిరాకేస్తే దాచుకున్నాను. "కావచ్చు" అన్నాను.

"అందుకనే- మీరాయన దుష్టుడు, అహంకారి, తుంటరి, అధిక ప్రేలాపి. అయినా గతిలేక భరిస్తున్నారు..." అంది మీనాక్షి.

ఆమె నన్ను కవ్విస్తోందని గ్రహించినా మధ్యలో వారినన్ని మాటలనడం నచ్చక, "మావారి గురించి మీరిలా మాట్లాడ్డం మర్యాద కాదు" అన్నాను.

"మర్యాద కాదా, మీకు నచ్చదా? "

"నేనే కాదు, భర్తను పరాయివాళ్లిలా అనడం ఏ భార్యా సహించదు" అన్నాను. కానీ ఉన్నట్లుండి నేనెప్పుడిలా పవిత్ర భారతనారినై పోయానా అని నాకే ఆశ్చర్యం కలిగింది.

"అలాగనకండి. మరి నా సంగతే తీసుకోండి. మీరు ఇప్పటికిప్పుడు నా భర్తను వెధవ అనండి. తిట్టడానికి తోడు దొరికిందని సంబరపడి పోతానే తప్ప ఇసుమంతైనా బాధపడను. అందుక్కారణం- ద్వేషం. నేనతన్ని నరనరాలా ద్వేషిస్తున్నాను. మీరు మీ వారిని ద్వేషించడం లేదా? "

"నేను మావారినెందుకు ద్వేషించాలి? " నేనిక విసుగును దాచే ప్రయత్నం కూడా చెయ్యలేదు.

"మిమ్మల్నాయన దాసిలా చూశారు కాబట్టి" ఠక్కున బదులిచ్చింది మీనాక్షి.

"చూసారని ఎవరన్నారు? "

"మీరే? "

"దాసిలా చూసారనలేదు. దాసి అన్నారన్నాను"

"చూడడానికీ అనడానికీ తేడా ఉంటుందా? "

ఇదే ప్రశ్న ఇందాక నేనడిగినట్లు గుర్తొచ్చింది. అప్పుడు మీనాక్షి ప్రశ్నకు బదులివ్వకుండా భర్త తన్ను పెట్టిన హింసలు చెప్పింది.

సాలోచనగా, "ఉంటుందేమో? " అన్నాను.

"ఏమో కాదు. ఉంటుంది. అది నాకూ మీకూ ఉన్నంత తేడా. లేదంటారా- మరి నేను నా భర్త వేరే పెళ్ళి చేసుకుంటే పీడ విరగడైందని సంతోషించాను. మీరూ అలా చేయగలరా? "

"అదీ సంగతి" అనుకున్నాను.

సందేహం లేదు. మీనాక్షి మా వారికి గాలమేస్తోంది. అందుకే నన్నాయనకు వ్యతిరేకంగా రెచ్చగొడుతోంది. విడిపొమ్మని ప్రోత్సహిస్తూ నా చుట్టూ ఉచ్చు బిగించాలని చూస్తోంది. ఆ ఉచ్చులో నేను పడకూడదు.

ఇంతవరకూ వచ్చేక ఇక దాగుడు మూతలెందుకని, "ఇదంతా మీరు నాకెందుకు చెబుతున్నట్లు? నేను నా భర్తను విడిచిపెడితే అందువల్ల మీకేమిటి లాభం? " అనడిగాను కాస్త సూటిగానే.

"ఇదే ప్రశ్న- కొన్నేళ్ళ క్రితం నేను రేష్మీని అడిగాను" అంది మీనాక్షి.

"రేష్మీ ఎవరు? " అన్నాను ఆశ్చర్యంగా.

"తోడు లేని చెల్లి"

"అంటే? "

మీనాక్షి గొంతు సవరించుకుంది. రేష్మీ కథ ఆమె నోట పలకసాగింది.

## 7

ఉత్తరాది అమ్మాయి రేష్మీది మీనాక్షికి పొరుగిల్లు. ఆమె తండ్రికి ఫాన్సీ షాపు మీద మంచి ఆదాయమొస్తుంది.

వయసులో రేష్మీ మీనాక్షికంటే ఐదేళ్ళు పెద్దది. ఆమెకో తమ్ముడు, చెల్లెలు ఉన్నారు. కానీ ఆమె ఎక్కువగా మీనాక్షి తోనే కబుర్లాడేది.

ఇంటర్ చదువుతూ రేష్మీ ప్రేమలో పడింది. అబ్బాయి బెంగాలీ. ఇంట్లో చెప్పింది. తలిదండ్రులు పెళ్ళికొప్పుకోలేదు. ఆమె తలిదండ్రుల్నెదిరించి ఇంట్లోంచి బయటకు వచ్చేస్తానంది. ప్రియుడందుకొప్పుకోలేదు. భారీగా కట్నమొస్తుందని ఆశించాడతడు. అది జరిగే పని కాదని తెలియగానే ఆమెకు ముఖం చాటేసాడు.

రేష్మీ డిగ్రీ చదువుతుండగా తండ్రి ఆమెకో పెళ్ళి సంబంధం చూసాడు. ఆమె తండ్రితో తను పెళ్ళే చేసుకోనంది. ఆ విషయమై ఇంట్లో పెద్ద గొడవైంది. పెళ్లి చేసుకోనంటే ఇంట్లో ఉంచుకోనన్నాడు తండ్రి.



రేష్మీ ఇల్లొదిలిపెట్టి ఓ బ్యూటీషియన్ వద్ద చేరింది. త్వరగా పని నేర్చుకుని తన నేర్పరితనంతో బాగా సంపాదించేది. అలా ఆర్నెల్లు గడిచేక తండ్రి రేష్మీని కలుసుకుని బతిమాలి ఇంటికి తీసుకొచ్చాడు.

తన కాళ్లమీద తాను నిలబడ్డానని గర్వ పడేది రేష్మీ.

"ఇల్లొదిలి వెళ్లావు. మళ్లీ వెనక్కొచ్చావు. నువ్వు సాధించిందేమిటి? " అని మీనాక్షి ఆమెను కుతూహలంగా అడిగింది.

"ఇల్లొదిలి వెళ్ళకపోతే నాకు స్వేచ్ఛ లేదు. ఇప్పుడు మా ఇంట్లో నన్నెవరూ దేనికీ అదుపు చెయ్యరు. నేను ఎవరిమీదా ఆధారపడి లేను కాబట్టి నా పెళ్ళి నా ఇష్టం" అంది రేష్మీ.

"మరి పెళ్ళి చేసుకోనన్నావుగా? " అడి

గింది మీనాక్షి.

"పెళ్ళి ఓ పెద్ద జంజాటం. నాకు రికా మీగా బతకాలనుంది. అందుకే పెళ్ళి చేసు కోనన్నాను. నాన్న ఒప్పుకోలేదప్పుడు. ఇప్పుడొప్పుకున్నాడు. నా పెళ్ళి నా ఇష్ట మంతే- పెళ్ళి చేసుకోకుండా ఉండిపోయే స్వేచ్ఛ నాకుంది" అంది రేష్మీ.

"మరి నావాళ్లు నాకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు" అంది మీనాక్షి.

"మీవాళ్ళ నెదిరించు. పెళ్ళి వద్దను" సలహా ఇచ్చింది రేష్మీ.

"ఏమో- మా వాళ్లను నేను ఎదిరించ లేననిపిస్తోంది" అంది మీనాక్షి అసహా యంగా.

"అంటే నీకు పెళ్ళి చేసుకోవాలనే ఉంది. అది నీ ఇష్టం. కానీ బాగా ఆలోచించుకో. పెళ్లి చేసుకున్నాక విచారిస్తావు" హెచ్చరిం చింది రేష్మీ.

"ఐతే పెళ్లి చేసుకున్న వాళ్లందరూ విచా రిస్తున్నారా? "

"అది మనం చూసి తెలుసుకోవాలంతే! ఒక్కరూ నిజం చెప్పరు. నీకంతగా పెళ్ళి చేసుకోవాలనుంటే ముందు నీ కాళ్లమీద నిలబడు"

మీనాక్షి మాట తప్పిస్తూ, "అసలు నువ్వు పెళ్ళి చేసుకోకుండా ఎలా ఉంటావు? భర్త, పిల్లలు లేకుండా ఆడ దాని జీవితానికి అర్థమేముంటుంది? " అంది.

"భార్య, పిల్లలు లేకుండా మగాడి జీవితా నికి అర్థం లేదు. కానీ పెళ్ళి ఆడదాని జీవి తానికే అర్థం తెస్తుందని మగాళ్లంటారు. అది కాదని నిరూపించడానికి ఆడపిల్ల లంతా ఒక్కటై పెళ్లికి స్వస్తి చెప్పాలి. ఇదో విప్లవం" అంది రేష్మీ.

"విప్లవమా? అంటే నువ్వు నాయకురా లివా? " ఆశ్చర్యంగా అడిగింది మీనాక్షి.

"ఒక్కరైనా నన్ననుసరించడం లేదు. నేనేం నాయకురాల్ని? మా ఇంట్లోనే నా తల్లి, చెల్లి నా విప్లవాన్ని గౌరవించరు. అందుకని నాకు తోచింది నేను చేయదల్చు కున్నాను. హాయిగా ఒంటరి జీవితాన్ని గడిపేద్దామనుకుంటున్నాను"

కొన్నాళ్ళకు మీనాక్షికి పెళ్ళి కుదిరింది. రేష్మీ మళ్ళీ, "పెళ్ళి వద్దను. ఇంట్లోంచి బయటకొచ్చేసేయ్. నువ్వు నీ కాళ్ళమీద నిలబడే దారి నేను చూపిస్తాను" అంటూ మరీ మరీ చెప్పింది. మీనాక్షి వినలేదు.

కొన్నాళ్లకు మీనాక్షికి పెళ్ళైపోయింది. కాపురానికి వెళ్లింది. అక్కడ భర్త తీరు ఆమెకు నచ్చలేదు. పుట్టింటికొచ్చినప్పుడా విషయం ఆమె నోట విన్న రేష్మీ, "ఇప్పటి కైనా మించిపోయింది లేదు. మొగుణ్ణొదిలి వచ్చేసేయ్" అని హితబోధ చేసింది.

కానీ మీనాక్షికి ఇంట్లో తలిదండ్రుల జ్ఞానబోధ. సంప్రదాయానికి భిన్నంగా నడ వాలంటే భయం.

"నేను పెళ్ళి చేసుకుని తప్పు చేశాను. కానీ ఇప్పుడు నా భర్త తన తప్పు తెలుసు కునేలా చెయ్యాలనుకుంటున్నాను. అందు కని అతడితో మరి కొంతకాలం కాపురం చేస్తాను" అంది మీనాక్షి రేష్మీతో.

"నీ భర్తను తన తప్పు తెలుసుకునేలా చెయ్యడం నీవల్ల కాదని రాసిస్తాను" అంది రేష్మీ.

"అలా చెయ్యగలనని నేను రాసివ్వనా? " అంది మీనాక్షి.

"వద్దులే కానీ ఈ రోజు కాకపోతే రేపైనా నువ్వు నీ భర్తను విడిచిపెట్టక తప్పదు. ఈ రోజు నా మాట విని నీ మొగుణ్ణొదిలి వచ్చేస్తే నీకు మా బ్యూటీపా ర్లర్లో ఉద్యోగమిప్పిస్తాను. ఆ తర్వాతొస్తే నీకు నానుంచి మాట సాయం కూడా అందదు. ఎందుకంటే నేను మూర్ఖులకు సాయపడను"

"ఇదంతా నువ్వు నాకెందుకు చెబుతు

# తారలు తీరులు

హాలీవుడ్ స్టార్స్ అంటే ప్రపంచానికి ఎంతో గ్లామర్ ఉన్నా, వారిలో ఒకరిమీద మరొకరికి ద్వేషం కనిపిస్తుంటుంది. ఓ చిత్రంలో కలిసి నటించే నటీనటులకు ఆ చిత్రం పూర్తయ్యేసరికి స్పర్థ ఏర్పడి ఒకరి నొకరు విమర్శించుకోవడం హాలీవుడ్ చరిత్రలో చాలాసార్లు జరిగింది.

సెక్స్ సింబల్ అయిన మార్లిన్ మన్రోతో ఓ చిత్రంలో కలిసి నటించాక టోనీ కర్టిస్, "ఆమెని ముద్దుపెట్టుకోవడం అంటే, హిట్లర్ని ముద్దుపెట్టుకోవడమే" అన్నాడు. సౌండ్ ఆఫ్ మ్యూజిక్ చిత్రంలో జూలీ ఏండ్రూస్‌తో నటించాక క్రిస్టఫర్ ప్లమ్మర్, "ఆమెతో పనిచేయడం అంటే మొనదేలిన వేలంటైన్ కార్డుతో నెత్తిమీద కొట్టినట్లే".

జేనీ మాన్స్‌ఫీల్డ్ మీద సహనటి బెక్కి డేవిస్ విమర్శ- "ఆమె ఉద్దేశంలో నాటకీయమైన కళ అంటే స్వెట్టర్ ముందుభాగాన్ని ఎలా నింపాలో తెలిసి ఉండటం".

ఈస్తర్ విలియమ్స్‌ని అనే నటి మీద శాన్నీ బ్రైస్ అనే మరోనటి, "తడిస్తే ఆమె స్టార్. పొడిగా ఉంటే కాదు" అని అంది.

మార్గరెట్ ఓ బ్రైన్ అనే నటి గురించి లయోనెల్ బేరిమోర్, "ఆమె నాలుగువందల ఏళ్ల క్రితం పుట్టివుంటే మంత్రగత్తె అనుకొని




కాల్చేసి వుండేవారు" అని తీవ్రమైన మాటలు అన్నాడు.

మార్లిన్ బ్రాం డోతో పనిచేసాక బర్ట్ రేనాల్డ్స్ అనే నటుడు, "అతనితో మాట్లాడటం గోడతో మాట్లాడటమే. నిజానికి గోడతో మాట్లాడితే కొంత ఆసక్తి కలిగించేది ఏదో ఒకటి ఉంటుంది. ఆయన దగ్గర అదీ లేదు". సాధారణంగా కలిసి పని చేసే కళాకారుల మధ్య, ఎవరికి వారు తమ గొప్పతనం చాటుకోవడానికి ఏర్పడే అహంభావ సమస్యల వల్ల ఇలాంటి సందర్భాలు, మాటలు ఉద్భవిస్తుంటాయి.



న్నావు? నేను నా భర్తను విడిచి పెట్టడం వల్ల నీకేమిటి లాభం?" చిరాగ్గా అడిగింది మీనాక్షి.

"నేను బదులివ్వను. ఆలోచిస్తే సమాధానం నీకే దొరకొచ్చు" అని ఊరుకుంది రేష్మీ.

★ ★ ★

"అడుసు తొక్కనేల కాళ్లు కడుగనేల- అంటుంది రేష్మీ. నేనామె హెచ్చరిక లెక్క చెయ్యకపోవడం వల్ల- కోరి నరకంలో ఇరుక్కుని కొన్నాళ్లు నరకయాతనలనుభవించి అప్పుడు బయట పడ్డాను. రేష్మీ ఇప్పటికీ పెళ్లి చేసుకోలేదు. ఇప్పుడు ఆమే నాకాదర్శం" అంది మీనాక్షి.

రేష్మీ కథ కొత్తది కాకపోవచ్చు. కానీ అదిప్పుడు నా ఆలోచనలను కొత్త దారిలోకి తీసుకెళ్లింది.

ఆలోచిస్తే నా జీవితం వడ్డించిన విస్తరేననిపిస్తుంది. ఆ వడ్డన నా అభీష్టం ప్రకారం జరిగిందా? అంటే అది వేరే విషయం.

రేష్మీ ఎవరో వడ్డించిన విస్తరి తనకొద్దంది. తన విస్తట్లో తనే వడ్డించుకుంటానంది. కానీ...

"మరి రేష్మీకి పిల్లలొద్దా?" అన్నాను అప్రయత్నంగా.

"స్త్రీకి మాతృత్వం దేవుడిచ్చిన వరమంటుంది రేష్మీ. కానీ మన వ్యవస్థ ఆ వరాన్ని శాపంగా మార్చిందిట. ఆడదానికున్న స్వేచ్ఛంతా పెళ్లితో పోతోంది. పెళ్లి లేకుండా పిల్లల్ని కనేటంత ఎత్తుకి మన వ్యవస్థ ఇంకా ఎదగలేదుట. తండ్రి పేరు చెప్పలేని బిడ్డకు మానసికంగా ఎన్నో వేధింపులెదురౌతాయి కాబట్టి తను పిల్లల్ని కనకూడదనే నిర్ణయానికొచ్చిందామె. నిజానికి- ఆడదానికి దేవుడిచ్చిన మాతృత్వపు వరం వల్ల- ఎక్కువ ప్రయోజనం పొందేది పురుషుడేనట. అతడది గుర్తించేదాకా ప్రతి స్త్రీ తన వరాన్ని శాపంగా భావించాలంటుంది రేష్మీ.

"అలాగనుకుని ఆమె సంతోషంగా ఉండగలుగుతోందా?"

"ఎవరెస్టు శిఖరం ఎక్కాలంటే వణికించే చలి, అడుగడుగునా ఒడిదుడుకులు, పైకి వెళ్లేకొద్దీ ప్రాణవాయువు సరిపోక అవస్థ. శిఖరం చేరినవాణ్ణి - సంతోషంగా ఉందా అంటే లేదంటాడా?"

అర్థమైంది నాకు. అనుకున్న లక్ష్యం చేరడానికి మార్గం సుగమం కాకపోవచ్చు. కానీ లక్ష్యాన్ని చేరడంలో గొప్ప ఆనందముంది.

"అంటే మీరు కూడా రేష్మీలాగే ఎప్పటికీ పెళ్ళి చేసుకోకుండా సంతోషంగా ఉంటానంటారు?"

"పెళ్ళి విషయంలో నేను రేష్మీ అంత ఖచ్చితంగా వద్దనుకోవడం లేదు. తగిన వరుడు దొరికితే పెళ్ళి చేసుకుందుకు నాకభ్యంతరం లేదు"

మీనాక్షి దృష్టిలో తగిన వరుడంటే మావారు. అటు తిప్పి ఇటు తిప్పి మీనాక్షి తన సంభాషణను ఆయనవైపే మళ్ళిస్తోంది. అది నా ఊహ కాదని తేల్చుకుందుకు, "తగిన వరుడంటే?" అన్నాను.

ఆమెకు సంకోచం తక్కువ కాబట్టి సూటిగా తన మనసులోని మాటను బయట పెడుతుందనుకున్నాను. కానీ ఆమె తెలివిగా "ఆ విషయంలో ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి. ఇప్పుడవన్నీ మనకెందుకుగానీ- ఇందాకా మీరు నన్ను- నేను నా భర్తను విడిచిపెట్టడం వల్ల మీకేమిటి లాభమని అడిగారుకదా- ఆ తర్వాత రేష్మీ కథ విన్నారు కదా- ఇప్పుడు మీ కేమనిపిస్తోంది?" అంది.

ఆమె ఉద్దేశం నాకర్థమైంది. నా ప్రశ్నకు జవాబు నాచేతే చెప్పించాలని ఆమె ప్రయత్నం. "మీరింకా నా ప్రశ్నకు బదులి

వ్వలేదనే అనిపిస్తోంది" అన్నాను ఏమ నాలో తెలియక.

"రేష్మీ నా మేలుకోరి నాకో సలహా ఇస్తే అర్థం చేసుకోక ఎదురుప్రశ్నలు వేసి అందుకు ఫలితం అనుభవించాను. ఇప్పుడు నేను మీ మేలు కోరి ఓ సలహా ఇచ్చాను. అది విని మీరు ఎదురుప్రశ్న వేసారు. అంటే అప్పుడు నేను చేసిన తప్పే మీరు చేస్తున్నారని మీకనిపించడం లేదా? "

అంతవరకూ పెళ్ళి, పురుషాధిక్యత, దోపిడీకి గురౌతున్న ఆడది- వగైరా టాపిక్సన్నీ గజిబిజిగా నా మెదడునాక్రమించుకుని ఉన్నాయి. ఇప్పుడామె చెప్పేసరికి అసలు విషయం నా అవగాహనకు రాగా- మీనాక్షి ఆలోచనల్లోని స్పష్టతకు ఆశ్చర్యపోయాను. ఆమెకూ అంత స్పష్టంగానూ బదులివ్వాలనుకుని, "మీకు మీ భర్త నచ్చలేదు. విడిచి పెట్టాలనుకున్నారు. నాకూ భర్త నచ్చలేదు. విడిచిపెట్టాలనుకోవడం లేదు. ఈ విషయంలో మనిద్దరి స్వభావాలూ కలవవు" అన్నాను. మీనాక్షి నవ్వి, "లక్ష్యం గొప్పదైనప్పుడు మంచుకొండైనా ఎక్కవచ్చు కారడవినైనా దాటవచ్చు దుష్టుడైన భర్తతో కాపురం చెయ్యడం గొప్ప లక్ష్యమని నేననుకోను. మీరనుకుంటారనుకోను. మీరు మీ భర్త మీకు నచ్చలేదనుకుంటున్నారు కానీ అది నిజం కాదు. మీ భ్రమ. ఆ భ్రమ నుంచి బయటపడాలంటే- నేను నా భర్తను విడిచిపెట్టాలని ఎందుకనుకోవడంలేదని మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి. జవాబుగా మీ ప్రేమా- అందుక్కారణమైన మీవారి ఔన్నత్యం బయటపడతాయి. ఇది నా భ్రమ అనుకోకండి. ఒక్కసారి నేను చెప్పినట్లు మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి"

"అంటే మావారు మంచివారేనని మీ నమ్మకం" అన్నాను. అదేమిటో - ఆమె నమ్మకం నా మనసుకు సంతోషాన్నే ఇచ్చింది.

"ఔను" అంది మీనాక్షి.

"భార్యగా నా అనుభవాలు విన్నాక కూడా..." అన్నాను అపనమ్మకంగా.

"నేనాయన్ను తిట్టాను. మీకు నచ్చలేదు. అంటే మీరాయన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నారనే నాకు తోచింది. ఆడది తెలిసి దుష్టుల్ని భరిస్తుందేమో కానీ ప్రేమించ లేదు"




"నాకిది చిత్రంగా ఉంది. మీరు నా గురించి నాకే చెబుతున్నారు"... అన్నాను.

"మనిషి మనసు చిత్రమైనది. మీరు క్యాన్సరు రోగ లక్షణాలు చదవండి. మీకు క్యాన్సరుందనిపిస్తుంది. ఎయిడ్స్ గురించి చదవండి. ఎయిడ్సుందనిపిస్తుంది. అలాగే ఎందరో ఆడవాళ్ళు- స్త్రీవాదులు గుర్తించిన మహిళా సమస్యలు తమకూ ఉన్నాయనుకుంటారు. క్యాన్సరూ, ఎయిడ్సూ ఎంతటి భయంకర వ్యాధులో- స్త్రీ వాదులు గుర్తించిన సమస్యలూ అలాంటి దారుణసత్యాలు. ఎటొచ్చీ ప్రతివారూ వాటిని తమకు అన్వయించుకుని బాధితులమనుకుంటే సమస్య పక్కదారులు పడుతుంది. అపహాస్యం పాలౌతుంది"

మీనాక్షిది లోతైన పరిశీలన అనిపించింది. నేను పత్రికల్లో కొన్ని రోగాల గురించి చదివినప్పుడూ, ఎవరి నోటైనా

కొన్ని రోగలక్షణాలు విన్నప్పుడూ- అవి నాకూ ఉన్నట్లనిపించి వణికిపోతూం టాను. అలా చాలామందికి ఔతుందని మీనాక్షి మాటల్నిబట్టి తెలుస్తోంది. అలా గని అన్ని విషయాల్లోనూ అలాంటి భ్రమ లకు గురౌతాననడం న్యాయమా?

అదేదో ఆమెచేతే చెప్పించాలని, "ఇంతకీ మీరేం చెప్పదల్చుకున్నారు? " అన్నాను.

"మన వ్యవస్థలో కొందరాడవాళ్ళకు పెళ్ళి శాపంగా పరిణమిస్తున్న మాట నిజం. కానీ మెజారిటీ ఆడవాళ్ళకు పెళ్ళిలో సుఖం, సదుపాయం, భద్రత వగైరాలెన్నో కనిపించి సంతోషాన్నిస్తున్నాయి. అందుకే వారు పెళ్ళిని ప్రతిఘటించడం లేదు. ఆ విషయం ఒప్పుకుందు కిష్టపడక- లేని కష్టాలనూహించుకుని సర్దుకుపోతు న్నట్లు భ్రమపడుతూంటారు వాళ్ళు. అందువల్ల పెళ్ళి అనే సిస్టమ్‌లోని అసలు సిసలు లోటుపాట్ల పట్ల సరైన అవగాహన ఏర్పడటం కష్టమౌతోంది. అవినీతి పెరుగుతున్నా కొనసాగే ప్రజాస్వామ్యంలాగే- పెళ్ళి కూడా చెప్పుకోతగ్గ మార్పులు లేకుండా మన వ్యవస్థలో కొనసాగిపోతోంది"

"ఐతే నేనిప్పుడేంచేయాలంటారు? "

"ఇందాకనే చెప్పాను. మీవారిని మీరెందుకు విడిచి ఉండలేరో ఆలోచించండి. అప్పుడాయన ఔన్నత్యం మీకు తెలిసొస్తుంది. అదేమిటో నాకు చెప్పండి"

"వారి ఔన్నత్యం గురించి నేను తెలుసుకుంటే చాలదా? అది మీకు చెప్పాలా? "

"చెప్పమని మిమ్మల్నడగడంలో నాకు ప్రయోజనముంది. మాటల పరిచయంతో మనిషిని అంచనా వేసే శక్తి నాకొచ్చిందని నేననుకుంటున్నాను. మీవారి గురించి నేను కొన్ని అభిప్రాయాలేర్పరచుకున్నాను కదా- ఆయన గురించిన నా అంచనా తప్పు కాదని మీ మాటలు నాకు తెలియజేస్తే నామీద నాకున్న నమ్మకం మరింత పెరుగుతుంది" అందామె.

అంటే మీనాక్షి మావారి గురించి ఎక్కువగా ఆలోచిస్తోంది. అసలామెకాయన్ను అంచనా వేయాల్సిన అవసరమేమిటి? వేసిన ఆ అంచనా తప్పుకాదని ఋజువు కాకపోతే నష్టమేమిటి?

ఐనా వచ్చినప్పట్నించి చూస్తున్నాను. అటుతిప్పి ఇటుతిప్పి సంభాషణను మావారివైపే మళ్ళిస్తోందామె. ఎందుకు?

చెప్పొద్దు. అప్పుడు నాకు భయమేసింది. ఆ భయంతోనే ఆమెను చూస్తే చిన్న అవకాశం దొరికితే చాలు మా వారిని నాకు కాకుండా చేయగల సత్తా ఉన్న మనిషిలా కనిపించింది.

"మిమ్మల్ని చూసేక నామీద నేను నమ్మకం పెంచుకోవడం అవసరమనిపిస్తోంది" అన్నాను.

"ప్రతి మనిషికీ ఆ అవసరం సహజం. మీకది ఇప్పుడే తోచడం చిత్రంగా ఉంది" అందామె.

"ఏమో- ఆయనతో ఎన్నోసార్లు వాదించాను. ఓడినా నా అభిప్రాయాలు మారేవి కాదు. ఈరోజు మీతో మాట్లాడేక అదేమిటో నా అభిప్రాయాలు మారిపోతున్నాయి" అన్నాను.

నేను నిజమే చెప్పాను. అదామె గ్రహించినట్లుంది. మారిన నా అభిప్రాయాల గురించి తెలుసుకోవాలన్న కుతూహలం ఆమె కళ్ళలో స్పష్టంగా కనపడింది. చెప్పాలని నాకూ ఉంది. కానీ అంతలో ఆయన రానే వచ్చారు.

టాపిక్ మారిపోయింది

★ ★ ★

"ఏం మాట్లాడేవు మీనాక్షితో? " ఆయన గొంతులో కుతుహలం.

నేను దాచకుండా జరిగినదంతా ఆయనకు చెప్పాను.

"ఈ రోజుతో నీ తెలివి చాలా రెట్లు పెరిగింది. కానీ అంతకంతా తరిగింది నా పరువు" అన్నారాయన బరువుగా నిట్టూర్చుతూ.

"బాధగా ఉందా? " జాలిగా చూస్తూ అడిగాను.

"ఇంటిగుట్టు రచ్చకెక్కిందని కాస్త బాధగా ఉన్నమాట నిజమే కానీ- నువ్వు నన్ను విడిచిపెడతావేమోనని ఆశగానూ ఉంది. మరి తొందరగా ఓ నిర్ణయం తీసుకో"

"నేనొదిలేస్తానని ఆశా? అంటే నేనొది లేస్తే మీకు బాధగా ఉండదన్న మాట!" నాలో కాస్త రోషం.

"మరి మీనాక్షికి నా గురించి అవీ ఇవీ చెప్పడం నీకు బాధగా అనిపించలేదా? "

ఆ ఊరికి ఈ ఊరెంత దూరమో- ఈ ఊరికీ అంతే! కానీ నేనన్నది ఉన్నమాటే కదా- అదే ఆమెకు చెప్పాను.

"ఉన్నమాటే ఐనా అనకూడని చోట్లుంటాయి"

"ఎలా"?

"చనువు, చొరవ ఉన్నచోట సెన్సారింగు ఉండదు. నేను నిన్నేమైనా అనగలను. నువ్వేమన్నా పడగలను. ఎవరెవరి గురించో నేను నీతో అన్న మాటలు మన ఏకాంతానికే పరిమితం. వాటిని అభిప్రాయాలుగా ఇతరులకు పరిచయం చేస్తే పరిణామాలు తీవ్రంగా ఉంటాయి" అన్నారాయన.

అర్థమైంది. నాకు అత్తమామలంటే చాలా ఇష్టం. వాళ్ళకూ నేనంటే ప్రాణం. కానీ నేను అత్తయ్య గురించీ, మామయ్య గురించీ అప్పుడప్పుడు ఆయన దగ్గర అన్న మాటలు వాళ్ళమీద నా అభిప్రాయాలు కావు. అవాయన వాళ్ళకు చేరిస్తే?

"సారీ? " అన్నాను.

"సారీ చెప్పావు. శారీ కోసమా? " అన్నారాయన.

నేను హృదయపూర్వకంగా సారీ చెబుతానంటే ఆయనొప్పుకోరు. సారీ చెప్పానంటే ఏదో ప్రయోజనాన్నాశిస్తున్నానని నాతోనే అంటారాయన.

"అవును. కొంటారా? "

"కొంటాను. వారం రోజులాగి"

"వారం రోజులూ- ఎందుకు? "

"ఈలోగా నువ్వు నన్ను విడిచిపెట్టావనుకో- అప్పుడు శారీ కొనక్కర్లేదుగా"

చటుక్కున నా కుడి అరచేత్తో ఆయన పెదాలు మూసి, "వారం రోజులాగక్కర్లేదు. నేను మిమ్మల్ని ఎప్పటికీ వదలనుగా" అన్నాను.

ఆయన నా అరచేతిని మృదువుగా ముద్దు పెట్టుకున్నారు. నాకు వళ్ళు ఝల్లుమంది. అప్పుడాయన నా అరచేతిని తన

## ఎవరి హస్తం?

ఇరాక్‌లో వందమంది అమెరికా సైనికులు కాలు జారి తమ తుపాకులమీదే తాము పడి బాయ్‌నెట్లు గుచ్చుకుని చనిపోయారని వివరిస్తున్నాడు అమెరికా రక్షణామంత్రి.



'అదెలా జరిగిందంటే ఆనందకేళిలో ఉన్న ఇరాక్ ప్రజలు అకస్మాత్తుగా వీధిలోకి విసిరిన బియ్యం, గులాబీ పువ్వుల మీద నడిచి సైనికులు జారిపడ్డారు. బహుశా చైనా కాంట్రాక్టర్లెవరైనా వారికీబియ్యం సరఫరా చేశారేమో తేల్చమని పెంటగాన్ పరిశోధకులను పంపించాం'




చెంపలకు రాసుకుంటూ, "ఆ విషయం నాకెప్పుడో తెలుసులే! ఇంతకీ నీకు మీనాక్షితో మాట్లాడాలని ఎందుకనిపించిందీ?" అన్నారు.

"ఆమె పెళ్ళయ్యాక ఆడదానికి తోడుండదన్నారు. అది నాకు చిత్రంగా తోచినా-నా విషయంలో కూడా అది నిజం కాదు కదా అని అనుమానం కూడా వచ్చింది. అది తీర్చుకుందుకు ఆమెతోనే మాట్లాడాలనుకున్నాను"

"మరిప్పుడు నీక్కూడా ఏతోడు లేకుండా ఆమెకిలా స్వేచ్ఛననుభవించాలనుందా?"

మీనాక్షి మాత్రం తన స్వేచ్ఛను ఎంజాయ్ చేస్తోందా? మావారిలాంటి పురుషుడి తోడుకోసం కలలు కంటోంది. ఆమె కల నాకు వాస్తవం.

"లేదండీ -ఈరోజే నాకు నా గురించిన నిజమొకటి తెలిసింది. నాకు మీ తోడూ నీడా కావాలి. మిమ్మల్ని వదిలి నేనుండలేను" ఇంకా ఏదో అనాలనే ఉంది. కళ్ళలో నీళ్ళు తిరుగుతూంటే తుడుచుకుందుకు ఆగాను.

ఆయన నన్ను వారించి, "ఆ కన్నీళ్ళు దాచుకో. నేను నిజంగా నిన్ను విడిచిపెట్టినపుడవి లేకపోతే నా మనసుకు కష్టంగా ఉంటుంది" అన్నారు.



## 8

పాట మిఠాయి సంస్థకు ఆడిషన్‌కి వెళ్ళాను.

చిన్న స్టూడియో. కీబోర్డు, గిటారు వయోలిన్, తబలా వాయించే నలుగురు వాద్యగాళ్ళు. ఓ సంగీత దర్శకుడు. పది మంది గాయనీగాయకులు.

వచ్చిన ప్రతివారిచేతా సంగీత దర్శకుడు ఓ కొత్తపాట, ఓ పాతపాట పాడించి రికార్డు చేస్తున్నాడు. వచ్చిన గాయనీ గాయకుల్లో ఇద్దరు ఏ పాటా సరిగ్గా పాడ లేకపోయారు. ముగ్గురు పాత పాటలు మాత్రమే పాడగలిగారు. ముగ్గురు తమకు నిర్ణయించబడిన అరగంట వ్యవధిలో పాటలు ముగించారు. నాకు ఇరవై నిము షాలు పట్టింది. మరో కుర్రాడికి పన్నెండు నిముషాలే పట్టింది.

కార్యక్రమం ఉదయం పదింటికి మొద లైంది. మధ్యలో ఓ గంట లంచ్ బ్రేకు. అంతా పూర్తయ్యేసరికి సాయంత్రం నాలు గుదాటింది.

అప్పుడే వచ్చారు విశ్వనాథం మేస్టారు.

"వెరీగుడ్ మేస్టారూ! అమ్మాయి గొంతు చాలా బాగుంది. సాధన కూడా బాగుంది" అన్నాడు సంగీత దర్శకుడు.

నేను మాస్టార్ని చూసి ఆశ్చర్య పడి, "మీరు ఊళ్ళోనే ఉన్నారా మేస్టారూ" అన్నాను.

"ఔనమ్మా- కొన్నాళ్ళ ఇళ్ళకె ళ్ళడం, ఫోన్లు చేయడం మానే సాను. అన్నింటికీ ఉత్తరాలే! అవీ పని జరుగుతుందని నమ్మకమున్నప్పుడే రాస్తున్నాను. ఎందుకో నువ్వొస్తావనే అని పించింది. వచ్చావు. సంతోషం" అన్నారు మాస్టారు.

మాస్టార్ని చూసి చాలా కాలమైందేమో పరీక్షగా చూశాను. అప్పటికీ ఇప్పటికీ ఆయన రూపురేఖల్లోనూ ఉత్సాహంలోనూ కూడా చెప్పుకోదగ్గ మార్పేంలేదు.

ఆయనకు అన్నీ తెలిసినట్లే ఉంది. మావారి గురించి కానీ, నా కుటుంబం గురించి కానీ ఒక్క ప్రశ్న అడగలేదు.

అదాయన సంస్కారం. దాని గురించి నాకెప్పుడూ సందేహంలేదు.

ఆయనకు నా గొంతు అంటే ప్రాణం. నావల్ల తనకేం ప్రయోజనం లేదని తెలిసీ

ఆయన నా గొంతుకే ప్రాధాన్యాన్నివ్వడం విశేషం. అందువల్ల కాలేజీలో బాగా పలుకుబడి ఉన్న కొందరు పెద్దమనుషుల అసంతృప్తికి కూడా గురయ్యారు. అప్పట్లో ఆ రాజకీయాలన్నీ నాకు అర్థమయ్యేవి కాదు. కానీ ఆయన ప్రతిభకు పెద్దపీట వేయడమే ఆశయంగా పెట్టుకున్నారని మాత్రం అనుకున్నాను. అది నిజమని ఇప్పుడు మళ్లీ ఋజువౌతుంది.

ప్రజాస్వామ్యం ముసుగులో గూండాయిజానికి సలాం చేస్తున్న ఈ సమాజంలో ముసుగును [illegible]తనాన్ని గుర్తించడం ఇంచుమించు అసాధ్యం.




మాస్టారు నామీద ఓ కన్నేసే ఉంచారు. నా గొంతు సంగీతాభిమానుల్ని చేరాలన్న సంకల్పంలో అభిరుచే తప్ప స్వార్థం లేకపోవడం విశేషం.

నేను మాస్టారి దగ్గర సెలవు తీసుకుని ఇల్లు చేరాను.

పాట మిఠాయి సంస్థ నన్ను గాయనిగా ఎన్నుకోవడం మరపురాని అనుభూతి. దాన్ని ఎవరితో పంచుకోను?

అమ్మకు చెబుదామనుకున్నాను. కానీ తను అభినందిస్తుందని నమ్మకంలేదు. అలాంటి విశేషాన్ని అభినందించని వారికి చెబితే లేని అసంతృప్తి పుట్టుకొస్తుంది.

పోనీ చంద్రికకు చెబుదామా అనుకున్నాను. ఏ సంతోష వార్తైనా అమ్మమ్మతో పంచుకోవాలనుకుంటుందది. అది నాకిష్టంలేదు.

వికాస్‌కి చెబితే?

వాడు దూరంగా హాస్టల్లో ఉన్నాడు. కాబట్టి నాకా అనుభూతి పంచుకున్న తృప్తి ఉంటుంది. ఆ వార్త అంత తొందరగా ఇతరులని చేరదు.

హాస్టల్ కి ఫోన్ చేస్తే వికాస్ వెంటనే లైన్లోకొచ్చాడు.

ఓ రెండు కుశల ప్రశ్నలు.

క్లాస్‌లో రెండోవాడిగా వచ్చాట్ట వికాస్. ఆ విశేషం తల్లితో పంచుకోవాలన్న వాడి ఉత్సుకతను కనిపెట్టి "దీనికి మాచింగ్ గ్రేట్ న్యూస్ చెప్పనా? ఈరోజే 'పాట మిఠాయి' అనే సంస్థ నన్ను సింగర్‌గా తీసుకుంది. మొత్తం పదిమంది వచ్చారు. నాది రెండో పొజిషన్" అన్నాను.

వికాస్ అభినందిస్తాడనుకొని ఉత్సాహంగా ఎదురుచూస్తున్నాను. కానీ వాడు వెంటనే "ఎందుకమ్మా ఇప్పుడు నీకుద్యోగం? " అన్నాడు.

నాకు ఉత్సాహం చప్పబడిపోగా "ఏం నీకిష్టం లేదా? " అన్నాను.

"నీకు తెలుసుకదమ్మా- నాన్నకి ఇష్టంలేదని!"

సాధారణంగా వికాస్ తండ్రి ప్రసక్తి తీసుకురాడు. అందుకని, "నాన్నకి ఇష్టం లేకపోతే నీకేమయింది? " అన్నాను ఆశ్చర్యంగా.

"నేనిప్పుడు క్లాసులో రెండోవాణ్ణి కదా- మొన్ననే కాంపస్ ఇంటర్వ్యూలయ్యాయి. మొదటి ఐదుగురికీ ఉద్యోగం గ్యారంటీ. మంచి కంపెనీ, ముప్పైవేలు జీతం. ఇలా రిజల్ట్సు రాగానే ప్రొవిజినల్ తీసుకుని అలా చేరిపోవడమే- ఇంక ఉద్యోగం అవసరం నీకేమిటమ్మా!"

వికాస్ గొంతులో బుజ్జగింపు లేదు. అధికార స్వరముంది.

వాడికి నెలకు ముప్పై వేలొస్తే నేనింట్లో

ఉండిపోవాలట. గాయనిగా నేను నెలకు రెండు లక్షలు సంపాదించే అవకాశమొస్తే వాడింట్లో కూర్చుంటాడా?

మగబుద్ధి. అప్పుడాయన, ఇప్పుడు వీడు. ఇద్దరూ నాకు ఉద్యోగం వద్దన్న వారే!

"నేను ఉద్యోగంలో చేరితే నీకేమైనా అభ్యంతరమా? "

"అభ్యంతరం కాదు. చిన్నతనం. నాన్న లేకపోతే నేను పోషించలేనా అమ్మని! అలా చూస్తుండమ్మా- నాన్న కంటే గొప్పగా చూసుకుంటాను నిన్ను"...

"నువ్వు చూసుకుంటావు సరే- మరి ఇంట్లో కూర్చుని నేనేం చేయన్రా? "

"ఎంజాయ్ అమ్మా! లైఫ్ ఎంజాయ్ చేయాలి"

కళ్లలో నీళ్లు తిరిగాయి నాకు. "సరేలే- ఆరోగ్యం జాగ్రత్త!" ఉత్సాహకరమైన వార్త లోంచి రొటీన్ అమ్మ డైలాగ్‌లోకి మారిపోయాను.

"నీ ఆరోగ్యం జాగ్రత్తమ్మా! ఉద్యోగం మాట మర్చిపో"

వాడి దృష్టంతా నా ఉద్యోగం మీదే ఉంది. బై చెప్పి ఫోన్ పెట్టేసాను.

"ఎంజాయ్ అమ్మా! లైఫ్ ఎంజాయ్ చేయాలి" వికాస్ మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. ఆయన కూడా ఎప్పుడూ లైఫ్ ఎంజాయి చేయాలనే వారు.

లైఫ్ ఎంజాయ్ చేయాలని ఎవరికుండదు? కానీ పిల్లలెదుగుతున్న కొద్దీ నాలో ఏదో భయం.

వికాస్‌కైనా, చంద్రికకైనా ఒళ్లు కాస్త వెచ్చబడితే చాలు- నాకు గుండె కొట్టుకోవటం మానేసేది.

డాక్టర్లున్నారు. మంచి వైద్య సదుపాయాలున్నాయి. కానీ నాలోని కన్నతల్లికి పిల్లల ఆరోగ్యం గురించి చెప్పలేనంత కలవరం.

అప్పుడు నేను వికాసినిని కాదు. కాసులమ్మను. మరి కాసులమ్మకు విజ్ఞానశాస్త్రం కంటే దేవుడిమీద ఎక్కువ నమ్మకం, ఆధారం.

ఆయన డాక్టరనేవారు. నేను దేవుడనే దాన్ని.

ఒకసారి వికాస్‌కి నూటనాలుగు జ్వరం. ఏ మందులూ పని చెయ్యటం లేదు. దేవుడికి మొక్కుకున్నాను. అదే పనిచేసి వాడికి నయమైందని నా నమ్మకం.

మొక్కు తీర్చుకుందుకు నేను కార్తీకమాసమంతా ఎముకలు కొరికే చలిలో చన్నీళ్ల స్నానం చేసి తడిబట్టలతో దేవుడి ముందు కూర్చుని ఓ అరగంటసేపు పూజ చేశాను.

నేను మొక్కు తీర్చుకుంటూంటే ఆయనకు నా ఆరోగ్యం గురించి కలవరం.

"నీకు స్వేచ్ఛ లేదనుకుంటావు. ఉన్న స్వేచ్ఛనిలా దుర్వినియోగం చేసుకుంటున్నావు. ఐనా నీకిలాంటి పనులు పురమాయించడానికి ఆ దేవుడికి మాత్రం బుద్ధుండొద్దూ? "

కాస్త తీవ్రంగా మందలించారాయన. నేను కలవరపడి, "అయ్యో దేవుడి గురించి పరుషంగా మాట్లాడకండి. శపిస్తాడాయన" అన్నాను.

"నా సంగతి వదిలేయ్. నువ్వు పరుషంగా మాట్లాడవు కదా- మరి నిన్నెందుకు శపిస్తాడాయన? నీలాంటివాళ్లను శపిస్తున్నాడనే నాకాయన మీద నమ్మకం పోతోంది"

"నన్నెక్కడ శపించాడండీ ఆయన? "

"చూడు కాసులూ! ఎముకలు కొరికే చలిలో నేను హాయిగా రగ్గు కప్పుకుని గాఢ నిద్రపోతూ కమ్మని కలలు కంటూ ఎంజాయ్ చేస్తున్నాను. నువ్వేమో చలికి గజగజ వణుకుతూ చన్నీళ్లస్నానం చేసి తడిబట్టలతో దేవుడి ముందు కూర్చుంటున్నావు. అది నీకు శాపం కాదంటావా? "

"అది శాపం కాదు. దైవభక్తి అలా నేనొక్కదాన్నే కాదు. కార్తీకమాసంలో ఎందరో భక్తులు చేస్తారు"

"అదే, ఆ దైవభక్తే దేవుడు వాళ్లకిచ్చిన శాపమంటాను నేను. ఏ పూర్వజన్మలోనో చేసిన పాపానికీ ఈ జన్మలో ఇలా అనుభవిస్తున్నారు"

మీరు అన్నింటికి పెడర్థాలు తీస్తారు.

"పెడర్థమా? చనిపోయిన మనిషి స్వర్గానికి బదులు నరకానికి వెడితే అది పాపానికి శిక్షేకదా! బతికున్నంత మాత్రాన స్వర్గానికి బదులు నరకంలో ఉన్నవాడు పాపాత్ముడనే అనుకోవాలి"

"ఇప్పుడున్న నరకంలో ఉన్నదెవరుట?"

"రగ్గు, నిద్ర- ఇది స్వర్గం. చలి, చన్నీళ్ల స్నానం అది నరకం. కాదనగలవా?"

"ఏమో నా నమ్మకాలు నావి" అన్నాను. వాదించడం ఇష్టం లేనప్పుడూ, చేతకానప్పుడూ మా సంభాషణకు నేనలా ఫుల్‌స్టాప్ పెడతాను.

ఆయన భయపడ్డట్టే ఆ తర్వాత పదిరోజులు నా ఆరోగ్యం పాడై మంచమెక్కాను. అప్పుడాయన నాకు బండచాకిరీ చేసారు. ఒక్కరోజూ పల్లెత్తుమాట అనలేదు.

"ఇలాగే బాగుంది నాకు. రోగమొస్తే ప్రేమ చూపిస్తారు. లేకుంటే నానా మాటలు అంటారు" అన్నాను. ఉక్రోషం నటించాను కానీ ఆయన ప్రేమ నాకెంతో ముచ్చటగా ఉంది.

"అడపాదడపా రోగమొస్తే ఆదుకోవటం మానవతా ధర్మం. నిత్యరోగివయ్యావనుకో మరి నేను వేరే దారి చూసుకోకతప్పదు" అన్నారాయన వెంటనే.

ఆయన అలా అనగానే నాకు మీనాక్షి గుర్తుకొచ్చింది.

నేను అడపాదడపా మీనాక్షితో ఫోన్లో మాట్లాడుతూంటాను. అలాంటప్పుడు ఆమె యధాలాపంగా అడిగినట్లు నా ఆరోగ్యం గురించి అడుగుతుంది.

చిత్రమేమిటంటే మీనాక్షి జిర్రున చీదనైనా చీదదు. అందుక్కారణం ఆమె చేసే వ్యాయామం, పాటించే ఆరోగ్యసూత్రాలు.

"అందుకే మీరు నాకంటే చాలా చిన్నగా కనిపిస్తారు" అన్నానోసారి.

"నేను నా వయసుకు తగ్గట్లే కనిపిస్తున్నాను. మీరు మీ వయసుకంటే ఎక్కువ కనిపిస్తున్నారేమో చూసుకోండి"

"ఎలా కనిపిస్తే ఏంలేండి? పెళ్లైపోయింది- పిల్లలు పెద్దవాళ్లవుతున్నారు...."

"మన ఆరోగ్యం ఇతరులకోసం కాదుగా-ఫిజికల్ ఫిట్‌నెస్ ఉంటే మన శరీరం మనకే హాయిగా అనిపిస్తుంది"

"అందువల్ల ఏమిటి లాభం?"

"మనకు హాయి అనిపించే పని మనమే చేసుకోలేకపోతే- ఇతరుల నుంచి ఎలా ఆశిస్తాం?"

అంతవరకు ఈ పాయింట్ నాకు తట్టనే లేదు.

అంతకాలం శరీరపోషణ ఇతరులకు ఆకర్షణీయంగా కనిపించడానికి అనుకునే దాన్ని. చాలామంది ఆడవాళ్లు నాకులాగే అనుకోవడం వల్ల పెళ్లి కాగానే వారి లావణ్యం తగ్గిపోతుంటుంది.

"పెళ్లైపోయిందిగా!" అనుకోవడంలో అజ్ఞానముంది. అర్థం చేసుకున్నాక నేను వ్యాయామం మొదలెట్టాను. ఆరోగ్యసూత్రాలూ పాటిస్తున్నాను.

ఆయన చలికాలంలో చన్నీటిస్నానాలు వద్దనడం నా మంచి కోరే అని అనుభవపూర్వకంగా తెలుసుకున్నాక దైవభక్తి, మొక్కు వగైరాలు గురించి కూడా కాస్త ఆలోచించడం మొదలెట్టాను.

"ఎంజాయ్! లైఫ్ ఎంజాయ్ చేయాలి" అప్పుడాయన, ఇప్పుడు తనయుడు అదే మాట.

"వికాస్‌కి ఫోన్ చేసావా?"

అది అమ్మ గొంతు. అంటే అమ్మ వినేసిందన్న మాట. ఇక లెక్చర్ మొదలు కాబోలు...

చెవుల్ని, శరీరాన్నీ అమ్మకప్పగించాను.

"చాలా సంతోషమమ్మా- మీ నాన్నగారు చిన్నప్పటినుంచీ నీ గొంతును మెచ్చుకునేవారు. మా చాదస్తం కొద్దీ ఒప్పుకోలేదు కానీ నువ్వీపాటికి చాలా గొప్ప గాయనివయుండేదానివి"

అమ్మ గొంతులో గిల్టీనెస్. ఆపైన నేనూహించని అభినందన. అందుకని అన్యమనస్కంగా ఉన్నట్లు ముఖంపెట్టి "వికాస్ వద్దంటున్నాడు" అన్నాను.

"బొడ్డూడని వెధవ- వాడికేం తెలుసు? ఐనా నువ్వుద్యోగం చేస్తే వాడికేం నష్టమట? "

వికాస్ ఉద్యోగం గురించి చెప్పాను. వాడేమన్నాడో చెప్పాను.

"ఆ మాటకొస్తే వాణ్ణి, నిన్నూ పోషించగలం మేము. వాణ్ణుద్యోగం చెయ్యొద్దను చూద్దాం. ఉద్యోగం డబ్బుకోసం కాదు. వ్యాపకానికి" అంది అమ్మ.

నా కళ్లు చెమ్మగిల్లాయి.

ఏ తరం వారికైనా వాస్తవం తెలియక పోదు. అభిమానాలుండకపోవు.

అమ్మా నాన్న నాకు పెళ్లయ్యేదాకా పెళ్లి కోసం శాసించారు. పెళ్లయ్యాక అల్లుడి నీడను తల్చుకుని తృప్తిపడుతూ ఆయనకు అనుగుణంగా సలహాలిచ్చేవారు. ఇప్పుడు వాళ్లకు నా జీవితం ముఖ్యం.

ఆయన విడిచి పెట్టిన తర్వాత నాకు జీవితం శూన్యమైపోయింది. ఆ శూన్యాన్ని నింపడానికి ఏదో వ్యాపకముండాలి. అమ్మ కూడా ఆ అవసరాన్ని గుర్తించింది.

"అమ్మా! పాట మిఠాయి వాళ్ళు నా గొంతు మెచ్చుకుని నన్ను గాయనిగా ఎన్నిక చేశారు. తొందర్లోనే నా కాసెట్ ఒకటి విడుదల కావచ్చు" అన్నాను అప్పటికే ఆమెకీ విషయం తెలిసినా నా నోటితో చెప్పాలనిపించి.

"నువ్వు ఫోన్లో మాట్లాడుతూంటే అంతా విన్నాను. కంగ్రాచ్యులేషన్సమ్మా!" అంది అమ్మ.

అమ్మ అభినందించదని, తనకీ విషయం చెప్పకూడదనుకున్నాను. అమ్మ అభినందన వినగానే అంతకు మించిన ఆనందం మరో విధంగా లభించదనిపించింది. "థాంక్సమ్మా!" అన్నాను.

"నాన్న రేపు ఊర్నించొస్తారు. ఇది తెలిస్తే మురిసిపోతారు"

"నాన్నగారు పొలం వ్యవహారాలకని స్వగ్రామం వెళ్లారు. అక్కణ్ణించి ఫోన్ కాంటాక్ట్స్ కష్టం"

"సంతోషిస్తారంటావా? " నాలో గతం సృష్టించిన అనుమానం.

"సంతోషించక? విశ్వనాథం మేస్టారికి

## నరకంలో బుష్

బుష్ చచ్చిపోయాక నరకానికే వెళ్లాడు. అక్కడ యమభటుడు, 'ప్రస్తుతం గదులు ఖాళీలేవు. నీలాంటివాళ్లే మరోముగ్గురు ఉన్నారు. వారిలో ఎవర్నినైనా పంపేసి నీకా గది ఇస్తాను. ఏం రూమ్ ఎంచుకుంటావో నీ ఇష్టం' అన్నాడు. మొదటి గదిలో మాజీ అమెరికా అధ్యక్షుడు నిక్సన్ నీళ్లలో నిరంతరం ఈతకొట్టలేక ఆయాసపడుతున్నాడు.

'నాకు ఈత రాదు. రెండోగది చూపించు' అన్నాడు బుష్.

అందులో బ్రిటిష్ మాజీ ప్రధాని టోనీ బ్లెయిర్ కన్పించాడు. పెద్ద సుత్తితో లావుపాటి రాళ్లను పగులగొడుతున్నాడతను.

మూడోగదిలో క్లింటన్ నగ్నంగా బోర్లాపడున్నాడు. వీపుపై మోనికా కన్పించింది.

ఓకే, ఈ గది తనకివ్వమని కోరాడు బుష్.

యమభటుడు కూడా ఓకే అని, 'మోనికా... నీకు విడుదల లభించింది.. బయలుదేరు' అంటూ బుష్‌ను ఆ గదిలోకి నెట్టి మోనికాతో సహా మాయమయ్యాడు.

నీ గురించి వ్రాసింది నాన్నగారేకదా!"

ఈ విశేషం నాకో పెద్ద షాక్. నాన్న ఏ మేస్టారికి దూరంగా ఉండమని నాకు ప్రబోధించారో అదే మేస్టారికి నా గురించి ఉత్తరం రాశారు. అది నా ఊహకందని విచిత్రం.




అంటే మేస్టారిమీద అప్పట్లో జరిగిన దుష్ప్రచారంలోని నిజానిజాలు నాన్నగారికి తెలుసు.

అసలు ఏ ప్రచారంలోనైనా నిజానిజాలు ప్రతి మనిషికీ తెలుస్తాయి. తన అవసరాన్ని బట్టీ, వీలునుబట్టీ మనిషి ఆ ప్రచారాన్ని తనకు అనుకూలంగా వాడుకుంటాడు.

రాజకీయవాదులు వేదికలెక్కి ఎన్ని ఉపన్యాసాలిచ్చినా సామాన్యుడికి నిజానిజాలు తెలుసు. ఓటు వేసేటప్పుడతడు మార్పును మాత్రమే కోరుతున్నాడని ఎన్నో ఎన్నికల ఫలితాలు చెబుతాయి.

మన ఇళ్ళలో జరిగేదీ అదేనని నాకు తెలుస్తోంది.

నాన్నకు నా సుఖం ప్రధానం. అందుకాయన నాకంటే ఎక్కువ ఆలోచిస్తున్నారు.

విశ్వనాథం మేస్టారికి నా గొంతుపై ఉన్న నమ్మకం, అభిమానం, ఆయన ఎప్పుడో గుర్తించారు. కైకేయి వరాల్లా వాటినిప్పుడుపయోగించుకున్నారు.

కైకేయి వరాలు- పోలిక బాగో లేదనిపించింది. అవామెకు భర్తను, కొడుకును దూరం చేశాయి.

ఇప్పుడు భర్త విడిచివెళ్ళేక లభిస్తున్న వరమిది. ఈ వరం నా కొడుకును నాకు దూరం చేసే అవకాశమూ లేకపోలేదని ఇందాకటి ఫోన్లో మాటలు సూచిస్తున్నాయి.

వికాస్ నన్నుద్యోగం చెయ్యొద్దన్నాడు. కారణం నాన్నకిష్టం లేదని! మరి నాన్నంటే వాడికిష్టమా? వికాస్‌దీ ఆయనదీ విచిత్ర బంధం. ఆయన ఎప్పుడూ వాణ్ణి ద్వేషిస్తున్నట్లే కనపడేవారు.

అసలు గొడవంతా వాడి నామకరణం దగ్గరే మొదలైంది.

నేను వాడికి మా తాతగారి పేరు పెట్టాలన్నాను. ఆయన ససేమిరా అన్నారు. మా ఇద్దరికీ చాలా పెద్ద గొడవైంది. చివరికాయన, "ఐతే విడాకులు తీసుకుని అమెరికా వెళ్ళిపో" అన్నారు.

ఎంత గొడవలోనూ ఏదో తిరకాసు మాట అని ఆయన నా దృష్టినిట్టే మళ్ళిస్తుంటారు. నేను చిరాకుపడి, "విడాకులు తీసుకోమన్నారు, బాగానే ఉంది. మధ్య ఈ అమెరికా ఎక్కణ్ణుంచొచ్చింది? " అన్నాను. అబద్ధమెందుకూ ఆ చిరాకులోనే ఏం చెబుతారోనని కుతూహలంగానూ ఉంది నాకు.

"అమెరికాలో చాలా చిన్న కారణాలకు విడాకులు తీసుకుంటారని తెలిసే ఉంటుంది నీకు. ఐతే కొడుక్కి నీ తాతగారి పేరెట్టాలన్నావే- అలాంటి కారణం చెప్పి విడాకులు తీసుకున్న వాళ్ళింతవరకూ ఉండి ఉండరు. కొత్తదనానికి ప్రాముఖ్యాన్నిస్తారు అమెరికన్లు. నీ గురించి తెలిస్తే అమెరికన్ కన్సలేట్ మెచ్చి నీకు వీసా ఇస్తుంది. అమెరికా మెచ్చి గ్రీన్‌కార్డిస్తుంది. ఆ తర్వాత ఏ అమెరికన్నైనా మెచ్చి నిన్ను పెళ్లి చేసుకోవచ్చు కూడా...

"నాకు మళ్ళీ పెళ్ళా?" అన్నాను ఆశ్చర్యంగా.

"అమెరికాలో ఉన్నదానివి మళ్ళీ పెళ్ళా అని తెల్లబోతావెందుకు?"

"నేను అమెరికాలో ఉన్నానా? ఏమిటి మీ పిచ్చి మాటలు?" కోపంగా అన్నాను.

"అన్నట్లు నువ్వింకా ఇండియాలోనే ఉన్నావు కదూ! ఏమో- మళ్ళీ పెళ్ళా అని నువ్వడిగేసరికి నువ్వెదురుగా ఉన్నావనుకోలేదు. అమెరికానుంచి ఫోన్ కాల్ అనుకున్నాను"

"మీరు స్పీడుగా చాలా దూరం వెళ్ళిపోయారు. అసలు నేను విడాకులకు ఒప్పుకుంటానని ఎలా అనుకున్నారు?"

"ఏమో- విడాకులు తీసుకోవడందాకా బాగానే ఉందని నువ్వన్నావు. నీకు బాగానే ఉందేమోనని నేననుకున్నాను"

ఎప్పటిలాగే నేనా టాపిక్ అప్పటితో వదిలిపెట్టక తప్పలేదు.

ఐతే నేను యుద్ధానికి సిద్ధంగానే ఉన్నాను. మా వారు దుర్యోధనుడైతే నా అత్తమామలు భీష్మద్రోణుల్లాంటివాళ్ళు. అందుకని ముందే వాళ్ళను నమస్కారబాణాలతో ముంచెత్తాను.

"రోజులు మారుతున్నాయి. ఇప్పటి కాలం పిల్లలకు పాత తరహా పేర్లు నచ్చడం లేదు. మీకు తోచిన, నచ్చిన పేర్లు పెట్టుకోండి" అంటూ నాకు సహకారాస్త్ర ప్రదానం చేసారు వాళ్ళు.

అంతా పతిదేవుడంటారు. కానీ మావారు ఉన్నట్లుండి పూజారి ఐపోయారు. దేవుళ్ళలాంటి అత్తమామలిచ్చిన వరానికాయన పూజారిలా అడ్డు తగిలి, "మా వాళ్ళు పాత తరహా పేర్లు వద్దన్నారు. నీకు మీ వాళ్ళు పాత తరహా పేరు పెట్టారని ఇప్పటికీ గునుస్తున్నావు. మీ తాతగారి పేరు వీరవెంకయ్య. వజ్రాన్ని దేంతోనైనా కోయొచ్చేమో కానీ ఆయన పేరుని మాత్రం ఎంత ప్రయత్నించినా ఆధునికంగా మార్చలేం. అర్థమైందా?" అన్నారు.

మన సంప్రదాయంలో అదో పెద్ద సమస్యా? "బారసాల టైములో బియ్యంలో ఆ పేరు రాద్దాం. స్కూల్లో వేసినప్పుడు వేరే పేరు పెడదాం" అంటూ అంతా పాటించే ఉపాయం చెప్పాను.

"బారసాల పేరంటే ఎన్నికల వాగ్దానమనుకున్నావా? నేను సంప్రదాయాన్ని ఇష్టపడకపోయినా పాటించేదేదో త్రికరణశుద్ధిగా పాటిస్తాను. అందుకే డిగ్రీ సర్టిఫికేట్లో వికాసిని నాకు మాత్రం కాసులమ్మగానే ఉండిపోయిందని మర్చిపోకు" అన్నారాయన.

సపోర్టుకోసం అమ్మా నాన్నలకు చెప్పుకుంటే- వాళ్ళు నన్ను దుర్యోధనుణ్ణి చేసి తాము భీష్మద్రోణులైపోయి, "అల్లుడు అన్న దాంట్లో తప్పేంలేదు. తీరికూర్చుని అయిందానికీ కానిదానికీ గొడవ పెట్టుకోకు" అనేసారు.

అందుకే నాకిలాంటి విషయాల్లో అమ్మా నాన్నలంటే మహా చిరాకు. అసలు విషయమేమిటో తెలుసుకోరు. నేను చెప్పేది శ్రద్ధగా వినరు. లాజిక్ చూడరు. ఆయన చెప్పినట్లు వినమంటారు. అలా చెప్పి సంప్రదాయం పాటించామనుకుంటారు. నాకూ ఓ వ్యక్తిత్వముందనీ దానికి విలువ నివ్వాలనీ అనుకోరు. తలవంచక తప్పలేదు. కానీ ఆయన మా అబ్బాయికి వికాస్ అని పేరు పెడితే ఆశ్చర్యపోయాను. నన్ను వికాసినీ అని పిలవమన్నాను. ఆయన ఆ పేరుకి గుర్తింపే ఇవ్వలేదు. మరిప్పుడు...

"ఏ పేరు నా నోట పలికితే వినాలనుకున్నావో- ఆ పేరిప్పుడు సంప్రదాయబద్ధమై ప్రతిరోజూ నా నోట పలుకుతుంది. నీ కోరిక తీరినందుకు సంతోషించు" అన్నారాయన.

ఆయన ఆలోచనలు, పథకాలు లోతైనవి. అబ్బాయికి వికాస్ పేరు పెట్టడం నాకు సంతోషాన్నే కలిగించింది. ఐతే కొడుకు పేరు నాతో ముందుగా చర్చించకపోవడం పురుషాహంకారమేనని నాకు అనిపించి ఆయనకు చెప్పాను.

"నేను పురుషుణ్ణై అహంకరిస్తే నీవు స్త్రీవై హుంకరించి- మనవాణ్ణి వికాస్ అనకుండా వీరవెంకయ్యా అని పిలు. అభ్యంతర పెట్టను. నాకు తెలిసిన ఓ అమ్మాయి పేరు సరిత. ఇంట్లో అంతా ఉషా అని పిలుస్తారు. ఓ అబ్బాయి పేరు రమణ? అంతా రాజూ అంటారు. నీ పేరు కూడా కాసులమ్మైతే కాలేజీలో అంతా వేరే పేరుతో పిలిచేవారుగా..." అన్నారాయన.

"నేనైతే పేరు మార్చుకున్నాను"

"పేరు మార్చుకున్నదానివి- మొగుణ్ణి మార్చుకోమంటే వెనకాడుతావేం?"

"మీరు మరీనూ- అవేం మాటలండీ- పేరు, మొగుడూ ఒకటేనా?" అన్నాను.

"మన సంప్రదాయం మంత్రాలకూ ముహూర్తానికీ ఎంతో విలువనిస్తుంది. మంచి ముహూర్తంలో వేద మంత్రోచ్చారణతో పెట్టిన పేరు అతి సులభంగా మార్చుకుంటే- అదే పద్ధతిలో వచ్చిన మొగుణ్ణెందుకు అంత సులభంగానూ మార్చుకోకూడదు?"

"అరే- ఇది నాకెప్పుడూ తట్టనేలేదు. నాకు తెలిసి చాలామంది బారసాలలో- ఇష్టదేవతల నామాలన్నీ కలిపి కోనేటి చేంతాడంత పేరు వ్రాస్తారు. స్కూల్లో వేసినప్పుడా పేరును ముచ్చటగా మూడక్షరాలకు కుదించేస్తారు. ఒక్కోసారి బారసాల పేరుకీ, స్కూలు పేరుకీ పోలికే ఉండదు. అంటే మనం సంప్రదాయానికి విలువనిచ్చినట్లా? లేనట్లా? వ్యావహారికంగా అనుకూలం కాదని తెలిసినప్పుడు బారసాల సమయంలోనే అనుకూలమైన పేరును నిర్ణయించుకోవచ్చుగా!

"బారసాలలో మీ అమ్మా నాన్నా నీకే పేరు పెట్టారో ఆ పేరు శుభలేఖలో వేయించాను నేను. ఏ పేరుతో నువ్వు నా అర్ధాంగివయ్యావో- ఆ పేరుతోనే పిలుస్తున్నాను. నాకు హిపోక్రసీ నచ్చదు. ఐతే ఇంతకీ నేను మనవాడికి పెట్టింది మీ తాతగారి పేరే. స్కూల్లో చేరాక నీకులా ఇబ్బంది పడకుండా ముందే ఆయన పేరులోంచి రెండక్షరాలు తీసుకుని కాస్త మోడ్రన్ టచ్ ఇచ్చాను. మరి నువ్వు గమనించావో లేదో?" అన్నారాయన.

అది నిజమో వేళాకోళమో తెలియదు. కానీ ఆయన వికాస్‌ని విక్కూ అని పిలిచేవారు.

విక్కూ...

అది నేను ఆయన నోట వినాలనుకున్న పేరు. అప్పుడు నా కోసం నేనెన్నుకున్న పేరది. అదాయన మనసులో ఉండిపోయింది. ఇప్పుడా పేరు నా పేగు తెంచుకుని పుట్టిన మా అబ్బాయికోసం ఆయన నోట పలుకుతోంది.

ఆయనేంచేసినా, మాట్లాడినా దాని వెనుక చాలా ఆలోచన ఉంటుంది. అనాలోచితంగా మాట్లాడతాననేమో, ఆయన నా మాటకు అంతగా విలువనివ్వరు. కానీ నేనంటే ఆయనకు అభిమానమే!

ఆయన వాణ్ణి విక్కూ అని పిలవడం దాకా బాగానే ఉంది కానీ- చిన్నప్పట్నించీ కూడా వాణ్ణి కసురుతున్నట్లే కనపడేవారు. నా తల్లి ప్రాణం ఓ కొట్టుకుపోయేది.

"పసివాడు. కన్న కొడుకు. వాడితోనైనా కాస్త సున్నితంగా మాట్లాడండీ" అన్నానో సారి.

"నువ్వు కన్నతల్లివి. వాణ్ణి తెగ గారాబం చేస్తూ మురిసిపోతావు. నేను కూడా అలాగే చేస్తే వాడికీ ప్రపంచమంతా తన్ను గారాబం చేయడంకోసమే సృష్టించబడిం

దన్న ఫీలింగొచ్చేస్తుంది. అందుకని ఇప్పట్నించీ వాడికి తిట్లు అలవాటు చేస్తున్నాను" అన్నారాయన.

"కన్నకొడుకుని ఉత్తిపుణ్యాన కసురుకుందుకు మీకు నోరెలాగొస్తుందండీ?" అన్నాను.

"కన్నతల్లివి కాబట్టి ఉత్తిపుణ్యాన కసురుకుంటున్నాననిపిస్తోంది నీకు. వాడు చేస్తున్న అల్లరికి కన్నతండ్రిని కాబట్టే తిట్లతో సరిపెడుతున్నాను నేను"

"బొడ్డూడని వెధవ. తను చేసేది అల్లరని కూడా వాడికి తెలియదు..."

"తెలియదనే కదా- నేనూ తెలియచెబుతూంట. ఇప్పట్నించీ చెప్పకపోతే- ఇంకో పదేళ్ళకైనా వాడికి బొడ్డూడకపోదు. అప్పటికి వాడు మొనైపోతాడు. వంచడం నావల్ల కాదు"

ఇంతకీ ఆయన కసురుకున్నా వికాస్‌కది ఆటలాగే ఉండేది. అలా మూడేళ్ళొచ్చేదాకా వాడు ఆయన్ను చూస్తేనే ఉత్సాహపడేవాడు. కానీ వాడికి మాటల అర్థం తెలియడం మొదలయ్యేసరికి ఆ ఉత్సాహం తగ్గింది. క్రమంగా వాడాయన్ను ఎవాయిడ్ చేయడం మొదలెట్టాడు.

ఈలోగా చంద్రిక పుట్టింది. ఈసారి పేరు విషయంలో నేనేం రభస చెయ్యలేదు. ఆయనెలాగూ నా మాట వినరని పైకి అనేదాన్ని కానీ- ఆయన పెట్టే పేరు వెనుక గొప్ప ఆలోచన ఉంటుందన్న నమ్మకం నాలో ఉంది.

పిల్లలిద్దరిలో ఆయన చంద్రికపై ఎక్కువ మొగ్గు చూపించినట్లు కనపడేవారు. నా దగ్గర కూడా దాని చేష్టలు తల్చుకుని మురిసిపోతూండేవారు. వికాస్ ప్రసక్తే తెచ్చేవారు కాదు.

"నాకు చంద్రిక కంటే వికాసే బాగుంటాడు. వాణ్ణి వదిలి దీన్నెలా చేరదీస్తున్నారో?" విసుక్కున్నానోసారి ముచ్చటగానే.

"నీకు అందచందాలు బాగా తెలుసు. అందుకని నీ ఛాయిస్ నేనయ్యాను. నాకు అందచందాలు తెలియవు. కాబట్టి నువ్వు నా ఛాయిస్" సంజాయిషీ ఇస్తూనే నన్ను దెబ్బదీయకపోతే ఆయన ఆయనెందుకౌతారు?

"మన మొహాలకు ఛాయిస్ ఒకటి. పెద్దలు చెప్పారు... చేసుకున్నాం..." అన్నాను.

"పోనీ ఛాయిస్ ఉంటే నువ్వెవర్ని చేసుకునేదానివి?" అడిగారాయన.

"అచ్చం సినిమాహీరోలా ఉండేవాణ్ణి" ఠక్కున చెప్పాను.

"పాపం- వాడికి ఛాయిస్ అక్కర్లేదు కాబోలు" వెంటనే అని నిట్టూర్చారాయన.

"ఏం- నాకేం తక్కువ? అచ్చం ఫిల్మ్ స్టార్లా ఉంటానని మురిసిపోయేది మా అమ్మ..."

"కాకిపిల్ల కాకికి ముద్దని సామెత"

"అంటే అర్థమేమిటి?" అడిగాను కోపంగా.

"చెబితే బాగుండదు. మీ అమ్మగార్ని కాకి అన్నట్లౌతుంది. పాపం- నిన్ను ముద్దాడిన పాపానికి ఆవిణ్ణి కాకిని చెయ్యకూడదు"

ఆయన తీరు నాకు తెలుసు. ఐనా ఉక్రోషం తన్నుకొచ్చింది. ఏదైనా అనడానికి మాట స్ఫురించక ఆయనకేసి కోపంగా చూశాను.

"అవును- మీ అమ్మగారు నిన్ను అచ్చం ఫిల్మ్‌స్టార్లా ఉంటావన్నారన్నావు. ఏ ఫిల్మ్ స్టారో చెబుతావా?" నన్ను మాట్లాడించాలని ఆయన ప్రయత్నం.

"నేను చెప్పను" మూతి బిగించాను.

"చెప్పడానికి సంకోచమెందుకు? ఒకసారి చనిపోయాక మళ్ళీ ఎవరూ ఆత్మహత్య చేసుకోరు. నాదీ హామీ" అన్నారా

యన.

నన్ను మాట్లాడించడానికికాయన ఇలా తిరకాసుగా మాట్లాడి నాలో కుతూహలం రేకెత్తిస్తుంటారు. "ఒకసారి చావడమే మిటి- మళ్ళీ ఆత్మహత్యేమిటి- కాస్త వివరంగా చెప్పండి మహాశయా" అన్నాను. అలాగని చాలాసార్లు బలైపోయినా నేను మాయలో పడిపోతూనే ఉంటాను.

దివ్యభారతి ఆత్మహత్య ఎందుకు చేసుకుందో పెద్ద మిస్టరీగా ఉండిపోయింది కదా! కొందరది యాక్సిడెంటని కూడా అన్నారు కానీ నాకిప్పుడా మిస్టరీ విడిపోయింది. మీ అమ్మగారు నిన్ను దివ్యభారతిలా ఉంటావన్నారు. అదామెకు చేరింది. ఐపోయింది. అది నీకు తెలుసు. కానీ నా దగ్గర దాచిపెట్టావు. ఐనా నేను పట్టేశాను. చూశావా..."

"ఆс... బయల్దేరాడిక్కడ ఓ మహా పెద్ద డిటెక్టివ్! దివ్యభారతి పోవడానికి అసలు కారణం మీరు. ఆ అమ్మాయంటే మీకు చాలా ఇష్టం. అది తెలియగానే ఆ పిల్లకు యాక్సిడెంటైంది"

"నాకిష్టమైన హీరోయిన్ దివ్యభారతి కాదు. శ్రీదేవి. అది నీకూ తెలుసు..."

"పాపం- మరి శ్రీదేవిలాంటి పిల్ల దొరకలేదు కాబోలు...."

"నీ సంగతి తెలియదు కానీ- నాకైతే ఛాయిస్ ఉంది తెలుసా? మా నాన్నగారు నన్ను పిలిచి, పెద్దవాళ్ళం మేము చెప్పామని నువ్వు తలూపక్కర్లేదు. నీకు నచ్చితేనే ఈ సంబంధం స్థిరపరుస్తామని గట్టిగా చెప్పారు. ఐనా నేను నిన్ను కాదనలేదు"

"ఈ మాట నాకెప్పుడూ చెప్పలేదాయన. అంటే ఆయన కళ్ళకు నేను శ్రీదేవిలా కనపడ్డానా? ఇప్పుడా విషయం ఒప్పుకుంటూరా? "

"ఎందుకని? " అన్నాను కుతూహలంగా. ఐతే ఆయన ఇవ్వబోయే సమాధానాన్ని ముందుగానే ఊహించానేమో నా కళ్ళు మెరిసినట్లు ఆయన కళ్లలోని నా ప్రతిబింబం చూసి తెలుసుకున్నాను.

"నీకైతే నీ గురించి అవగాహన లేదు- కానీ నేనెలాగుంటానో నాకు తెలుసు. నిన్ను చేసుకుంటే గంతకు తగ్గ బొంత ఔతుందనుకున్నాను"




ఛీ- ఈ మనిషెప్పుడూ ఇంతే. మాటవరసకైనా నా గురించి ఓ మంచి మాట నరు.

"ఐతే నా గురించి మీ ఉద్దేశమేమిటీ? " అన్నాను.

"మీ ఆడాళ్ళకెప్పుడూ మీ గురించే ఆలోచన. నేను చెప్పిన సామెత అర్థం ఆలోచించి... నా గురించి నా ఉద్దేశమేమిటో తెలుసుకుంటావనుకున్నాను"

"అంటే? "

"నువ్వు నాకు గంతకు తగ్గ బొంతవి. నన్ను ఫిల్మ్‌స్టారే అనుకుంటావో, చెట్టు కింద ముష్టాడంటావో అది నీ ఇష్టం. నీ స్థానం నా స్థానంతో ముడిపడి ఉందని గుర్తుంచుకో"

"ఎక్కణ్ణించి ఎక్కడికొచ్చారూ? " అన్నాను.

ఆయన నవ్వి, "నాకు చంద్రిక ముద్దు. కాకిపిల్ల కాకికి ముద్దని అనుకోదలిస్తే అది

నీ ఇష్టం" అనేసి పిల్ల నెత్తుకుని బాల్కనీ లోకి వెళ్ళిపోయారు.

చంద్రిక ఎదుగుతున్నకొద్దీ తండ్రి తన పట్ల చూపుతున్న భేదభావం మరింత స్పష్టమౌతూండేది వికాస్‌కి.

"నాన్నకు చెల్లి అంటే ఇష్టం. నేనంటే ఇష్టం లేదు" అని వాడు తరచుగా నా దగ్గర బాధపడేవాడు. మొదటిది నిజమే కానీ రెండోది నిజం కాదని వాడికి చెప్పే దాన్ని. కానీ అందుకు నిదర్శనాలు దొరికేవి కాదు. వికాస్ మనోభావాల గురించి ఆయనకు చెప్పానొకసారి.

"నేను మా నాన్న గురించి ఇలాగే అనుకునేవాణ్ణి" అన్నారాయన.

"అది నాకు తెలియదు. కానీ వికాస్ మీ గురించి అనుకుంటున్నది నిజమేకదా!" అన్నాను.

"నేను మా నాన్న గురించి అనుకున్నదీ నిజమే! కానీ అప్పుడు నాకు తెలియని విషయమొకటి ఇప్పుడు తెలుస్తోంది. కన్నకొడుకుని కసరడంలో చాలా బాధ ఉంటుంది"

ఆశ్చర్యపడ్డాను. అంటే వికాస్‌తో కఠినంగా వ్యవహరిస్తున్నందుకాయన బాధపడుతున్నారు. అలాంటప్పుడు వాణ్ణి కసరడమెందుకు?

నేనడక్కుండానే తన మనోభావాల్ని నాతో పంచుకున్నారాయన.

మన సమాజంలో ఆడపిల్లదెప్పుడూ పరాధీనపు బతుకే. అందులోనే అదృష్టం, దురదృష్టం కలిసుండడం విశేషం.

చదువుకోని ఆడపిల్ల అయ్యేయస్సాఫీసరు భార్య అయితే- కలెక్టరు హోదా వచ్చేస్తుంది. డబ్బులేని ఆడపిల్ల వ్యాపారి భార్య అయితే- ఆ వైభవం అనుభవానికొస్తుంది.

అంటే పురుషుడు కష్టపడి స్వయంకృషితో సాధించిన లక్ష్యాన్ని- స్త్రీ అతడితో కలిసి ఏడడుగులు వేసి చేరుకోగలదు. కాబట్టి ఆమె డబ్బు, హోదా, వైభవం వగైరాలకోసం తనకు తానుగా శ్రమపడనక్కర్లేదు. ఎటొచ్చీ ఆమెకు తగిన వరుడు లభించడానికి అదృష్టం సహకరించాలి. దురదృష్టం దూరంగా ఉండాలి. ఆ రెండూ మన అదుపులో లేనివి. మనకు చేతనైనదల్లా పెళ్ళయ్యేవరకూ ఆడపిల్లను అబ్బురంగా చూసుకోవడం.

పురుషుడు నిత్యస్వతంత్రుడు. ఆ స్వేచ్ఛ నుంచి ఆనందం పొందడానికి పిన్నవయసులో అతడు చాలా ఎక్కువ కృషి చేయాల్సి ఉంటుంది. ఈ కృషి సత్ఫలితాలనివ్వడానికి అదుపు, క్రమశిక్షణ అవసరం. బండెడు బరువు మోస్తూ బడికి వెళ్ళే పిల్లల్ని చూసి ఆర్కేనారాయణ్ స్పందించినట్లే కన్నతండ్రీ స్పందిస్తాడు. కానీ అతడు అసహాయుడు. సమాజన్యాయాన్ని పాటించి చదువు పేరుతో కొడుకును హింసించాలి. అందుకు బాధ కలిగితే అది మనసులో దాచుకోవాలి.

ఆయన ఆలోచనల తీరే వేరు. నాకవి చిత్రంగా అనిపించినా నిత్యజీవిత సత్యాలనీ తెలుసు.

ఆయన వికాస్‌ని తరచుగా కసురుకున్నా- వాడిమీద ద్వేషం లేదని తనకు తానుగా చెప్పడం నాకెంతో సంతోషాన్నిచ్చింది. వికాస్‌కి కూడా చెప్పాను.

"నాన్న గురించి నువ్వు నాకేమీ చెప్పకు" అని మధ్యలోనే నామాట తుంచేసాడు వికాస్.

వికాస్ ప్రవర్తనలోనూ నేనో విచిత్రాన్ని గమనించాను. వాడికి తండ్రి అంటే భయముండొచ్చు కానీ ద్వేషం లేదు. ఎవరైనా ఆయన్ను విమర్శిస్తే సహించేవాడు కాదు. స్కూల్లో తనకు మంచి మార్కులొచ్చినా, ఏమైనా పోటీల్లో బహుమతులొచ్చినా ముందు ఆయనకే చెప్పేవాడు.

వాడంత ఉత్సాహంగా చెబితే ఆయన

తన స్టైల్లో నిరుత్సాహపర్చడమో, ఎగతాళి చేయడమో చేసేవారు. వాడు పట్టించుకు నేవాడు కాదు. తన్నైతే ఆయన్ను విమర్శిం చేవాడు కాదు.

"పిల్లలందరూ ఒక్కటి కాదు. తలిదం డ్రులది తెలుసుకోక పిల్లలందర్నీ ఒక్కలా పెంచి పెద్ద చెయ్యాలనుకుంటారు. అందుకే మనదేశంలో పిల్లల పెంపకం పెద్ద సమస్యగా మారింది. పిల్లల్ని బాగా అర్థం చేసుకుని వాళ్ళ మనస్తత్వాలకు అనుగుణంగా పెంచాలి. ఉదాహరణకు నన్నే తీసుకో. నేను స్వేచ్ఛను ప్రేమి స్తాను. మా నాన్న నన్నందరి పిల్లల్లా పెంచాలనుకుని నా స్వేచ్ఛను హరిం చారు. అందుకే నేనాయన్ను ద్వేషించాను. వికాస్‌ది నా పోలిక. స్వేచ్ఛ వాడి ప్రాణం. నేనా స్వేచ్ఛను ప్రోత్సహిస్తే అది వెర్రిత లలు వేసి విపరీతాలకు దారితీయొచ్చు. అదుపుచేస్తే వాడిలో పౌరుషం రేగి చెడి పోయే అవకాశముంది. అందుకని తెలిసో తెలియకో మా నాన్న ఎన్నుకున్న మార్గమే ఎన్నుకున్నాను. నేను వాణ్ణి అదుపు చేయ డానికీ, వాడి స్వేచ్ఛను హరించడానికీ ప్రయత్నిస్తున్నట్లు నటిస్తూ కొన్ని సూచన లిస్తాను. నా సూచనలు తప్పని ఋజువు చేయాలన్న పట్టుదలతో వాడు మరోవి ధంగా రాణిస్తాడు. నాక్కావలసింది వాడి రాణింపు. అంతే!' అన్నారాయన.

నాకు కొంత అర్థమయింది. కొంత కాలేదు. కానీ వాడు వృద్ధిలోకి రావడమే ఆయన ఆశయమని గ్రహించి, "మీ ఆలో చనలు, విశ్లేషణ చిత్రంగా ఉంటాయి" అన్నాను.

"ఇందులో చిత్రమేంలేదు. వికాస్‌ని నువ్వు కొడుకులా చూస్తున్నావు. నేను మనిషిలా చూస్తున్నాను. వ్యక్తిత్వంలో వాడు నా ప్రతిరూపం. నాకేంకావాలో నాకు తెలుసు. అదే వాడికీ ఇస్తున్నాను" అన్నారాయన.

ఆయన వికాస్‌తో, "నువ్వు డాక్టరువి కావాలి. అదీ నా కల" అన్నారు. వెంటనే వికాస్ దృష్టి ఇంజనీరింగు మీదకు మళ్ళింది.

"నీకు ఇంజనీరింగులో సీటొస్తే అప్పుడు చూద్దాంలే" అని వాణ్ణి ఎగతాళి చేసిన ఆయన నాతో, "వాడు మంచి డాక్టరు కాలే డని తెలుసు, ఇంజనీరింగులో రాణిస్తాడనీ తెలుసు. ఇక్కడా వాడిది నా పోలికే. నేను కాగలిగీ కాలేకపోయింది- వాడైనా కావా లని నా కోరిక" అన్నారు.

నేనెంతో సంతోషించి, "ఇదైనా వాడికి చెప్పండీ- సంతోషిస్తాడు" అన్నాను.

"అయ్యో... చండిక విషయంలో ఉద్దాల

**కొత్తగాలి...**

**మనసుని ఇచ్చేది**
**హార్ట్**
**మనసుని మెప్పించేది**
**ఆర్ట్**

**–లక్కోజు శ్రీనివాసరావు, నెల్లూరు**

కుడు చేసిన తప్పే నేను చేస్తే- పవిత్రమైన పిండాలు కుక్కల పాలు కాక తప్పదు" అన్నారాయన.

అలాగనడంలో నాకూ హెచ్చరిక ఉందని గ్రహించాను. వికాస్ వృద్ధిలోకి రావాలనే నా కోరికానూ. ఆయన ఆలోచ నల లోతు తెలిసిందాన్ని కాబట్టి వాడికి నేనూ అసలు విషయం చెప్పలేదు.

ఈరోజు వికాస్ నాతో, "నువ్వుద్యోగం చెయ్యొద్దు, నాన్నకిష్టముండదు" అన్నాడు.

అంటే వాడికి ఆయన ఇష్టాయిష్టాలన్నీ తెలుసా?

వాడిది నా పోలిక అంటారాయన. అవగాహనలో, తెలివిలో- వాడాయనకు తీసిపోడు. వాడు తెలిసి తండ్రి అభీష్టం నెరవేరుస్తున్నాడా లేక ఆయన్నెదిరిస్తున్నాననుకుని మోసపోతున్నాడా?

ఆలోచించినా కొన్ని ప్రశ్నలకు సమాధానాలు దొరకవు.

ఆయన వికాస్ మీద చేసిన ప్రయోగాన్నే నేనూ చంద్రికమీద చేసాను. ఒకటి కాదు రెండు కాదు. పది ట్రిక్కులు వేసాను. ఒక్కటీ ఫలించకపోగా ఆయనకా విషయం చెప్పాను.

"పిడుక్కీ, బియ్యానికీ ఒకే మంత్రం పనికిరాదు" అన్నారాయన.

"మీరు వికాస్‌ని అన్ని విషయాల్లోనూ మీ అభిరుచులకనుగుణంగా మార్చారు. అలాగే నేనూ చంద్రికను కొన్ని విషయాల్లో మార్చాలనుకుంటున్నాను. ఏదైనా ఉపాయం చెప్పండి" అన్నాను.

"పిడుక్కీ, బియ్యానికీ ఒకే మంత్రం పనికిరాదని తెలుసు కానీ నాకు తెలిసినదీ ఒకే మంత్రం. అదే ఉద్దాలక మంత్రం. అది చండిక మీదనే పనిచేస్తుంది. చంద్రిక మీద పనిచేయాలంటే ముందు నువ్వు దాన్ని చండికగా మార్చాలి" అన్నారాయన.

"అదెలా?" ఆత్రుతగా అడిగాను.

"చెప్పి లాభంలేదు. చంద్రికది నీ పోలిక. నీ ప్రయత్నాలు ఫలించవు"

"ఎందుకని?"

"ఎందుకేమిటి- అదంతే- స్వానుభవం మీద చెబుతున్నాను"

ఎంత ఆలోచించినా ఆయన స్వానుభవమేమిటో నాకు స్ఫురించలేదు. కానీ నన్నాయన చండిక లాంటిది కాదనుకుంటున్నందుకు సంతోషించాను.

ఈరోజు వికాస్- "నాన్నకిష్టముండదు, నువ్వుద్యోగం చెయ్యొద్దు" అంటున్నాడు. నేనేం చేయాలి?

ఇలాంటి సందిగ్ధాలు మరెన్నో నాకోసం ఎదురుచూస్తున్నాయని అప్పుడు నాకు తెలియదు.

నా ముందు బల్లమీదున్న మూడు కవర్లనూ తదేకంగా చూస్తున్నాను.

అవి మూడుత్తరాలు. మొదటిది నర్సరీ స్కూల్లో టీచరుద్యోగానికి అపాయింట్‌మెంట్ లెటర్.

ఆ నర్సరీ స్కూలు ప్రిన్సిపాలు విశాలాక్షి ఒకప్పుడు మా పొరుగింట్లో ఉండేది. తీరిక సమయాల్లో ఇరుగుపొరుగుల పిల్లల్ని చేరదీసి ఆడించే నన్ను చూసి, "నీ టాలెంటు గొప్పదమ్మా! ఏదైనా నర్సరీ స్కూల్లో టీచరుగా జాయిన్ కారాదూ?" అంది.

నేనాయనకు చెప్పాను. ఆయన వెంటనే, "నువ్వు పిల్లల్నేకాదు, ఆవిణ్ణీ భరిస్తున్నావు. తను స్టూడెంటుగా జాయినౌతుందేమో అడుగు. నువ్వు టీచరుగా జాయిన్ కావచ్చు" అన్నారు.

పిప్పళ్ళ బస్తాలా ఉండే విశాలాక్షిని నర్సరీ స్టూడెంటుగా ఊహించుకోవడంతో నాకప్పుడు నవ్వాగలేదు. ఇప్పుడా విశాలాక్షి తనే స్వయంగా అలాంటి స్కూలు పెట్టి ప్రిన్సిపాలు ఐనట్లుంది.

అపాయింట్‌మెంట్ లెటర్ చూడగానే ఆయన చెప్పిన షరతు గుర్తుకొచ్చింది. ఆవిడకు చెబితే ఏమంటుందో?

రెండో ఉత్తరం 'మాకో తోడు- మీకో నీడ' అనే సంస్థనుంచి వచ్చింది. అప్పడాలూ, వడియాలూ, ఊరగాయలూ, పచ్చళ్ళూ వగైరాల తయారీ- కుట్లూ, అల్లికలూ వగైరాల్లో శిక్షణ- ఇంకా అనేక గృహోపయోగకర విశేషాలను కలగలిపిన ఆ సంస్థ ఆశయం- సాధారణ మహిళను అసాధారణ కార్యకర్తగా మార్చడం. ప్రారంభమై ఆర్నెల్లు కాలేదు కానీ అప్పుడే ఆ సంస్థ ఆశయాలు చాలా గొప్పగా ప్రచార

మౌతున్నాయి. ఇప్పుడా సంస్థ భాగస్వామి శ్రావ్య ఒకప్పుడు నా దగ్గరకొచ్చి ఇలాంటి వన్నీ నేర్పమంటూండేది. ఆమె చాలా తొందరగా ఒకటొక్కటే నేర్చేసుకుంటుంటే నేను మెచ్చుకున్నాను. అప్పుడామె "క్రెడిట్ నాది కాదు. మీరు చాలా బాగా నేర్పు తారు. మీరేదైనా ఇన్‌స్టిట్యూట్ పెడితే నాలాంటి మరెందరికో సహాయకారిగా ఉంటుంది" అంది.

నన్నిలా ఎవరు మెచ్చుకున్నా ముందు ఆయనకే చెప్పుకుంటాను. ఆయన నన్ను గేలి చేస్తారని తెలుసు. కాని లోలోపల చాలా సంతోషిస్తారనీ తెలుసు.

నేను చెప్పింది విని, "ఉత్తినే నేర్పావు కదా- అందుకని ఉత్తినే పొగుడుతోంది. ఒక్క పైస అడిగిచూడు. ఈ మాత్రం దానికి అంతివ్వాలా అంటుంది" అని తీసి పారేసారు. అప్పటికీ ఇన్‌స్టిట్యూట్ పెట్ట మంటోందండీ అని కూడా అన్నాను.

"ఇన్‌స్టిట్యూట్ తనని పెట్టమను. అందులో నీకుద్యోగమిస్తుందేమో చూద్దాం" అన్నారాయన. ఇప్పుడు శ్రావ్య తన ఇన్‌స్టి ట్యూట్‌లో చేరమని నాకు అపాయింట్ మెంట్ లెటర్ పంపింది.

మరిప్పుడాయనేమంటారో?

ఇక మూడో ఉత్తరం ఓ ఆధ్యాత్మిక సంస్థనుంచి. ఆధ్యాత్మిక సందేశాలు, విశ్లేష ణలను శ్రోతలకు వినిపించే ఉద్యోగానికి దరఖాస్తుఫారం ఉందా కవర్లో.

నాకు తెలుసు- గ్యారంటీగా నాకా ఉద్యో గమొస్తుందని.

విశేషమేమిటంటే- దేవుణ్ణి హేళన చేసే ఆయన, జీవితాన్ని జాలీగా గడిపేయాల న్నది తన ఆశయమైనట్లు కనబడే ఆయన- ఏడేళ్ళక్రితం ఈ ఆధ్యాత్మిక సంస్థ వైపు ఆకర్షింపబడ్డారు. అందులో భాగ స్వామి కాకపోయినా ఆ సంస్థ తనదేన న్నట్లు మసిలేవారు. అప్పట్నించీ ఆయన మాటతీరు మారలేదు కానీ మాటలు మారాయి.

"ఈ జీవితం శాశ్వతం కాదు. ఉన్న కాసిని రోజులూ లైఫ్ ఎంజాయ్ చెయ్యా లంటే అందుకు ఎన్నో బాధలు, బాదరబం దీలు. వాటినుంచి తప్పించుకోవడం అసాధ్యం. ఐనా లైఫ్ ఎంజాయ్ చెయ్యా లంటే అందుకొక్కటే మార్గం. దేవుణ్ణి నమ్మాలి. దేవుడంటే అల్లా కావచ్చు, యెహోవా కావచ్చు, బ్రహ్మ విష్ణు మహే శ్వరుల్లోనో, ముక్కోటి దేవతల్లోనో ఏ ఒక్కరో కావచ్చు. వాళ్ళలో ఒకే ఒక్క దేవు ణ్ణెంచుకుని ఏకాగ్రతతో ఆరాధిస్తే జీవిత మంతా హుషారే హుషారు. ఎందుకంటే

> **కొత్తగాలి...**
>
> **పేదోడి బతుకు**
> **నివురు గప్పిన నిప్పు**
> **బూడిదనుకుని ఆడుకుంటే**
> **కాల్చేస్తుంది జాగ్రత్త!**
>
> -బద్దిగం పాండురంగారెడ్డి, కరీంనగర్

అప్పుడు బాధల్నీ, బాదర బందిల్నీ దేవుడే తీసేసుకుంటాడు" అనేవారాయన.

ఆయన గురించి తెలిసినవారికి- ముందాయన జోకేస్తున్నారా అనిపిస్తుంది. కానీ కాసేపాయనతో గడిపితే అలనాటి గొప్ప భక్తులను స్ఫురింపజేసేదాయన నమ్మకం. కోపమొచ్చి ఆయన్నెవరైనా నానామాటలూ అంటే, "నువ్వు నన్ను తిట్టడం న్యాయమే అయితే వాటిని నేను తీసుకుంటున్నాను. అన్యాయమైతే వాటిని దేవుడు తీసుకుంటాడు. ఎందుకంటే నీకై నువ్వు చేసేదేమీ లేదు. ఏం చేసినా ఆ దేవుడు చెప్పినట్లే చేస్తావు" అనేవారాయన.

## పథకం..?

ఓ హోటల్‌లో బుష్, బ్లెయిర్ మూడో ప్రపంచ యుద్ధం గురించి సీరియస్‌గా పథకం రచిస్తున్నారు. అప్పుడే అక్కడికి వచ్చిన ఒక తను 'ఏమిటి సంగతి?' అని అడిగాడు. 'మూడో ప్రపంచ యుద్ధం గురించి చర్చిస్తున్నాం. 10 లక్షలమంది ఇరాకీలతోపాటు ఓ సైకిల్‌వాలానూ చంపాలని అనుకుంటున్నాం' అన్నాడు బుష్.

ఆ యువకుడు 'సైకిల్‌వాలాను చంపడమెందుకు?' అని అడిగాడు ఆశ్చర్యపోతూ.

వెంటనే బుష్ బ్లెయిర్‌వైపు తిరిగి, 'చూశావా! 10 లక్షలమంది ఇరాకీలను చంపినా ఎవరూ పట్టించుకోరని నే చెప్పలేదా?' అన్నాడు.





తిట్టిన వ్యక్తి తెల్లమొహం వేసేవాడు.

ఎప్పుడైనా అభిమానంతోనో, స్వార్థంతోనో ఎవరైనా ఆయన్ను అదేపనిగా పొగిడితే, "అయ్యో! నువ్వు నన్ను కొన్నేళ్ళ క్రితం పొగిడుంటే బాగుండేది. నీ పొగడ్తలు నాకు దక్కేవి. ఇప్పుడు నాదంటూ ఏమీలేదు. పొగడ్తలతో సహా అన్నీ దేవుడివే" అనేవారు బాధగా.

ఆ బాధ నటన అని తెలుస్తూనే ఉండేది. ఎందుకంటే ఆ సంస్థతో పరిచయం పెరిగాక ఆయన మనోబాధలకే కాదు, శరీర బాధలకు కూడా చలించేవారు కాదు. వేలు తెగినా, జారి పడినా, పొరపాటున బరువైన వస్తువుమీద పడినా కిమ్మనేవారు కాదాయన.

"దేవుడు కరుణామయుడు. సంతోషాన్ని మాత్రం నాకు మిగిల్చి బాధలన్నీ తను తీసుకుంటాడు" అనేవారాయన.

మొదట్నించి ఆయన తత్వం తెలిసిన నాకిది నమ్మశక్యంగా ఉండేది కాదు. అందులో మర్మేదైనా అంతరార్థముందా అని ఆలోచించి ఆలోచించి ఏమీ తోచక విసిగిపోయి, "ఏమిటీ! మహాభక్తుడిలా మాట్లాడుతున్నారు. నిన్న మొన్నటిదాకా తననాడి పోసిన మీ బాధలన్నీ ఆ దేవుడు తీసుకున్నాడా? ఆహా... ఇంత కంటే గొప్ప భక్తుడింకెవరూ ఆయనకు దొరికినట్టు లేదు" అన్నాను.

"అదేమిటి కాసులూ... నీకు తెలియదా! దేవుడో రాజకీయవేత్త. సాత్వికుడనిపించుకున్న రాముడి అవతారంలోనే ఆయన అన్నకు వెన్నుపోటు పొడిచిన విభీషణుణ్ణి లంకకు రాజుని చేసాడు. మహాభారతంలో శ్రీకృష్ణుడి రాజకీయ చాతుర్యం గురించి వేరే చెప్పాలా? దేవుణ్ణి ఆశ్రిత పక్షపాతి అంటారు. అందుకే రాజకీయవాదులందరికీ దేవుడే ఆదర్శం. అందుకే వాళ్ళు తమను నమ్ముకున్నవారి కంటే తమ ప్రత్యర్థుల్ని దెబ్బతీసి తమతో కలిసినవారినే... అసలు సిసలు ఆశ్రితులుగా భావిస్తారు. కాబట్టే రాజకీయాల్లో పార్టీలు మారేవాళ్ళకే తప్ప పార్టీని నమ్ముకున్న వారికి మంత్రి పదవులు దక్కడం లేదు. అదలాగుంచితే పురాణాల్లో ఏ కథను తీసుకో... దేవుణ్ణి నమ్ముకుండానో, తిడుతూనో చాలా ఏళ్ళు గడిపి ఆ తర్వాత భక్తులైన వారికే పెద్దపీట. అలా- వాల్మీకి రామాయణం రాస్తే అది శతాబ్దాలుగా భక్తుల పూజలందుకుంటోంది. తిన్నడి కథ ఎన్నిసార్లు సినిమా తీస్తే అన్నిసార్లూ హిట్టే. చింతామణిలో బిల్వమంగళుడు, పాండురంగ మహాత్మ్యంలో- పేరు గుర్తు లేదనుకో- వాళ్ళ కథలను సినిమాలుగా తీస్తే ప్రజలు వాటిని హిట్టు చేయడమే కాక ఆ వేషాలేసిన ఎన్టీఆర్‌ని రాష్ట్రంలోనే

పెద్ద హిట్టు చేసారు. ఇది తెలిసే నేనూ నా స్ట్రాటజీ డెవలప్ చేసుకున్నాను. కొన్నాళ్ళపాటు దేవుణ్ణి ఆడిపోసాను. ఆ తర్వాత ఆయన పార్టీలో చేరిపోయాను. ఇప్పుడు నేను స్వర్గానికెడితే అక్కడ నాకు మంత్రి పదవి ఖాయం"

ఆయన చెప్పేది వింటూంటే నాకు నవ్వొస్తోంది కానీ ఆయన మాత్రం యమ సీరియస్‌గా ఉన్నారు. ఐతే స్వర్గం ప్రసక్తి రాగానే చటుక్కున నాలోని ఇల్లాలు స్పందించగా, "ఛీ- స్వర్గం గురించి మాట్లాడే వయసా మీది? " అని ఓ సారి మంగళసూత్రాలను కళ్ళకద్దుకున్నాను.

"మనమేం మాట్లాడినా... మాట్లాడించేదాయనే. మనమేం చేసినా నిర్ణయాలన్నీ ఆయనవే. అది తెలియక మంచి రోజనీ, మంచి మాటనీ, మంచి మనసనీ ఏమో అనుకుంటుంటాం" అన్నారాయన.

అలా మాట్లాడ్డం ఆయనకు కొత్త కాదు. ఆ మాటల్లోని ఆధ్యాత్మికతే కొత్త. ఐతే ఆ ఆధ్యాత్మికత పరిహాసం కాదనిపిస్తోంది. అందుకే ఆయన్ను ఆయన మాటలతోనే ఎదుర్కోవాలని, "నేను చలిలో స్నానం చేస్తే అది దేవుడి శాపమనీ భూలోక నరకమనీ అనేవారు కదా... మరి ఇప్పటి మీ భక్తిని కూడా భూలోక నరకమనాలా? " అనడిగాను.

"జీవుడికి దేహం నుంచి విముక్తి లభించేదాకా ఎక్కడున్నా అది నరకమే" అన్నారాయన.

ఆయనలో వచ్చిన ఈ మార్పు నాకు మింగుడు పడలేదు.

"ప్రతి భావానికీ ఓ వయసుంటుంది. మీకింకా భక్తి భావానికి తగిన వయసు రాలేదు" అన్నాను.

"వయసుదేముంది? అభిమన్యుడు అప్పుడే పోయాడు. ఆంజనేయుడు ఇప్పటికీ ఉన్నాడు. అంతా దైవ నిర్ణయం. నీ అభిప్రాయంలో భక్తి అంటే వయసుడిగిపోవడం. వయస్సుంటే పాపాలు చేయడం. నేనింకా పాపాలు చెయ్యాలనా- నీ ఉద్దేశం? "

ఆ మాటల్లో ఏదో అపశృతి ధ్వనించి భయమేసింది నాకు.

అంతలోనే ఆయన, నేనేదో పాపం చెయ్యబోతున్నాను, దేవుడి ముందరి కాళ్లకు బంధంగా ఈ భక్తిని ఉపయోగించుకుంటున్నాననుకో. నువ్వు నన్ను నమ్మకు. నా దారి నాది. నీ దారి నీది. ఆ ప్రయత్నాల్లో ఉండు..." అన్నారు.

ఆ మాటల్లో ఏదో హెచ్చరిక!

నాకు మీనాక్షి గుర్తుకొచ్చింది. ఆయనలో వచ్చిన మార్పు ఆమెకు తెలుసా?

ఓ రోజు ఆయన ఆధ్యాత్మిక సంస్థలో చర్చలకు వెడితే ఆ సమయంలో మీనాక్షికి ఫోన్ చేశాను. రమ్మనగానే ఇంటికొచ్చిందామె. ఆయనలో వచ్చిన మార్పు గురించి అడిగానామెను.

"విత్తనం మొక్కౌతుంది. మొక్క పూలు పూస్తుంది. పూలు కాయలౌతాయి. కాయ పండై నేలరాలి మళ్లీ విత్తనమొస్తుంది. మార్పు ప్రకృతి సహజం" అంది మీనాక్షి.

"నాకలా అనిపించడం లేదు" అన్నాను.

"కాలి నడకపోయి బండ్లొచ్చాయి. ఒకప్పుడు విదేశాలు వెళ్ళడానికి ఓడమీద వారాలు పట్టేది. ఇప్పుడు విమానాలు రావడంతో ఆ ప్రయాణం వ్యవధి గంటలకు పడిపోయింది. మనం దేవతలనుకునే గ్రహాలమీద మనిషి కాలు మోపాడు. ఇదీ ప్రకృతి సహజమే. ఐనా కొందరు ఆశ్చర్యపోతూంటారు. అది వారికి సహజం"

"మీరు మా వారికిలాగే మాట్లాడుతున్నారు" అన్నాను ఆశ్చర్యంగా.

"ఔను. మా ఇద్దరికీ రుచులూ, అభిరుచులూ ఒక్కటే!" అంది మీనాక్షి.

నా గుండె గుభేల్మంది. నాకూ ఆయ

నకూ అభిరుచులే కాదు, రుచులూ వేరే!

ఆ విషయం తెలిసే మీనాక్షి ఆ మాట అన్నదా?

"ఆధ్యాత్మికతకూ ఒక వయసుంటుంది కదా!" అన్నాను.

"మొదటిసారి మిమ్మల్ని కలిసినప్పట్నుంచీ నేను మీ వారి గురించి మరో కోణంలో ఆలోచిస్తున్నాను. ఆయన మామూలు మనిషి కాదు, మహా యోగి" అంది మీనాక్షి.

నవ్వాపుకున్నాను. చుట్టూ ఉన్నవారి మీద జోకులేస్తూ, తన గురించి అహంకరిస్తూ... సాధారణ జీవితం గడిపే మామూలు మనిషి. నాలుగు రోజులు భక్తి కబుర్లు చెప్పినంత మాత్రాన యోగి ఐపోతాడా? ఆయన్నామె ముందు చిన్న బుచ్చలేక, "మీకలా ఎందుకనిపించింది?" అనడిగాను.

"ఆఫీసులో చూస్తూంటానుగా. మీవారు దేనికీ చలించరు. చూస్తూంటే అరిషడ్వర్గాలను జయించారా అనిపిస్తుంది" అంది మీనాక్షి సాలోచనగా.

మా ఇంట్లో పాత తెలుగు సినిమా వీడియో కాసెట్లు చాలా ఉన్నాయి. వాటిలో పెద్ద మనుషులు సినిమాలో చూసిన ఓ సీన్ గుర్తుకొచ్చింది నాకు. అందులో ఓ బైరాగి- ఇంద్రియాల్ని జయించాలి, కోర్కెల్ని చంపుకోవాలి అంటూ ప్రబోధించి... ఒక్క బీడీ ముక్క ఇప్పించమని కోరతాడు. మా ఇంట్లో వీడియో కాసెట్ వేసినప్పుడల్లా మావారు ఆ సీను దగ్గర ఆపి ముసిముసిగా నవ్వుకుని మా అందరికీ దాని విశిష్టతను చెప్పి ఒకటికి రెండుసార్లు రీప్లే చేస్తుంటారు.

ఆ జోక్ మీనాక్షికి చెప్పి ఉంటారనుకుని, "ఇంద్రియాల్ని జయించి కోర్కెల్ని చంపుకుని రోజుకో సిగరెట్ ప్యాకెట్ తాగుతారంతే. ఆయన అరిషడ్వర్గాలనూ జయించే ఉంటారు" అని నవ్వాను.

మీనాక్షి నవ్వలేదు. "రాముడు చెట్టు చాటునుంచి వాలిని చంపాడు. కృష్ణుడు స్త్రీలోలుడు. గాంధీకి నెహ్రూ అంటే పక్షపాతం. ఇలా గొప్పవారనిపించుకున్న వారిలో ఏవో లోపాలు కనిపిస్తాయి. సామాన్యులకి, నమ్మినవారికి వాటిని సమర్థించే తర్కపు మెలికలుండనే ఉంటాయి" అంది గంభీరంగా.

"అమ్మ బాబోయ్... మీరు మావారిని అవతార పురుషుణ్ని చేసేస్తున్నారు"

"మన చుట్టూ అవతార పురుషులు చాలా మందే ఉంటారు. మన అవసరాన్ని బట్టి వాళ్లలో కొందరికే గుర్తింపునిస్తాం మనం" అంది మీనాక్షి.

"అదెలా?" అడిగాను ఆశ్చర్యంగా.

"చిన్నప్పుడు చందమామలో ఓ కథ చదివాను. అందులో ఎలాంటి రోగాన్నైనా నయంచేసి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న ఓ వైద్యుడు తన గురువే తన కంటే గొప్పంటాడు. ఆ గురువు తానున్న ప్రాంతంలో రోగాలే రాకుండా ఆపుతున్నాడు. అందువల్ల ఆయన గొప్పతనం ఎవరికీ తెలియదు"

నాకంటే చిన్నదైన మీనాక్షికి ప్రతి చిన్న విషయం మీదా ఎంతటి అవగాహన?

"నేను వారిని రోజంతా చూస్తూనే ఉంటానింట్లో. ఆయనింత గొప్పవారని నాకెప్పుడూ అనిపించలేదు. మీరు వారితో ఆఫీసులో రోజూ... అదీ వర్కింగ్ డేస్‌లో... జస్ట్ కాసేపు మాట్లాడతారు. మీకు వారిలో చెప్పలేనంత గొప్పతనం కనిపించింది. ఎవరు రైటన్నది అబ్వియస్. ఐనా మీరే రైటనుకుందాం. నాకు తెలియని మావారి గొప్పతనం మీకెలా తెలిసిందంటారు?"

నేనీ ప్రశ్న కాజువల్‌గా అడగలేదు. జవాబివ్వడానికామె తడబడక తప్పదని

నా ఉద్దేశం. అసలామెకూ, ఆయనకూ ఉన్న అనుబంధం కూడా ఆ జవాబులో బయట పడుతుందని నా నమ్మకం.

"ప్రతి మనిషిలో అహం ఉంటుంది. ఆ అహం మబ్బులా కమ్మేసినవారికి ఎదుట సూర్యుడున్నా చీకటే మిగులుతుంది. పోతన రాసిన శ్రీ మహాభాగవతం నాకెంతో ఇష్టమైన గ్రంథం. అందులో అష్టమ స్కంధంలో వామనావతార ప్రస్తావన ఉంది. వామనుడు బాలుడు. పొట్టివాడు. యాచకుడు. అల్ప సంతోషి. మూడడుగుల నేల దానమిచ్చేవరకూ బలి చక్రవర్తిలోని అహం చూసిన విశేషాలవి. ఆ తర్వాత..."

మీనాక్షి గొంతు సవరించుకుంది.

"ఇంతింతై వటుడింతయై మరియు దానింతై నభోవీధిపై
నంతై తోయదమండలాభ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రునికంతయై ధృవునిపైనంతై మహర్వాటిపై
నంతై సత్య పదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై
"రవిబింబంబుపమింప బాత్రమగు చత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంభద్వస్త్రమై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దా బ్రహ్మాండమున్నిండుచోన్"

మీనాక్షి ఆగింది. అప్పుడే నాకు తెలిసింది- అంతవరకూ నేనూ ఆమెతో గొంతు కలిపానని. చిన్నప్పుడా పద్యాలు నాకు బాగా వచ్చు కానీ ఇంత బాగా గుర్తున్నాయని ఇప్పుడే తెలిసింది.

"మీ గొంతు ఎంత బాగుందో- మొదటి పద్యం సగం చదివేక నేనాగిపోయి పెదాలు మాత్రమే కదిపాను" అంది. మీనాక్షి.

నేనా పొగడ్తకు సిద్ధపడి లేను. అందుకని మొహమాటంగా, "అయితే- ఇంతకూ మావారు అవతారపురుషుడంటారు" అంటూ అసలు విషయానికొచ్చాను.

"అలాగని నేననుకాని అహం విడిచి చూస్తే- మన చుట్టూ వామనరూపంలో చరించేవారిలో కొందరు అవతార పురుషులు తప్పక గోచరిస్తారు. వారి చర్యలు, మాటలు మనకు విచిత్రంగానో, విపరీతంగానో తోచవచ్చు కానీ వాటి వెనుక గూఢార్థముంటుంది. తెలుసుకుంటే మన అదృష్టం. తెలుసుకోలేకపోవడం మన దౌర్భాగ్యం"




"పోనీ మావారి గురించి మీకు తెలిసిన గూఢార్థాలు నాకు చెబుతారా?"

"చెప్పను. అవి ఎవరికి వారే తెలుసుకోవాలి. మీరు మీ వారిని అవతారపురుషుడనుకోండి. గూడార్థాలు వాటంతటవే బయటపడతాయి"

అన్నీ తెలిసీ ఆయన్ను అవతారపురుషుడనుకోలేను. అలాగని ఆ విషయం మీనాక్షికి చెప్పలేను. అందుకని తేలికగా నవ్వేసే ప్రయత్నం చేస్తూ, "పోనీ- మీకు నాలో ఏమైనా గొప్పలక్షణాలు కనిపించాయా?" అన్నాను. అనగానే కుతూహలమూ రేగింది ఆమె ఏమంటుందోనని.

"నేను మీ గురించి తక్కువా మీవారి గురించి ఎక్కువా ఆలోచిస్తూంటాను. అందువల్ల మీ విషయమై నేనేమీ చెప్ప లేను. ఐతే మీవారికి మీలో గొప్ప లక్ష ణాలు కనిపించాయనుకుంటాను..." సాలోచనగా అందామె.

ఊహించలేదేమో ఉలిక్కిపడ్డాను. ఆ వెంటనే ఉబ్బిపోయాను. మా వారు- అదీ తను చాలా గొప్పదనుకునే మరో స్త్రీతో- నా గురించి గొప్పగా చెప్పడమా?

ఏమన్నారో ఆయన?

అడిగిన వెంటనే బదులిచ్చింది మీనాక్షి, "మీలో సహనం ఎక్కువట. ఆవేశపరులని పిస్తుంది కానీ భర్త చేసిన ఎలాంటి తప్పు నైనా క్షమించగల ఔన్నత్యం మీకున్నదట. మీ విషయంలో తను ఎలాంటి తప్పు చేయడానికైనా సంకోచించకపోవడానికి అదే కారణమన్నారాయన"

ముందా మాటలకు సంబరపడ్డాను కానీ ఆ వెంటనే నా గుండెల్లో రాయి పడింది.

ఈ మీనాక్షి చాలా చాలా తెలివైనది. ఏం మాట్లాడినా అటుతిప్పి ఇటుతిప్పి సంభాషణను ఆయనకూ ఆమెకూ ఉన్న అనుబంధంవైపు మళ్ళిస్తుంది.

ఆయన సంకోచించకుండా చేస్తున్న ఆ తప్పేమిటి? అది నాకు తెలియదు కానీ మీనాక్షికి తెలుసు. అంటే ఆ తప్పు ఆ ఇద్దరూ కలిసే చేస్తున్నారు.

తప్పు విషయమై ఆమెను నిలదీయలేక పోయాను. అందుకని ఆ తర్వాత ఆమెతో సరిగ్గా మాట్లాడలేక పోయాను. ఆమె వెళ్ళేక కూడా ఆ తప్పు గురించే ఆలోచిం చాను.

ఆయన నాతో, "నేనేదో పాపం చెయ్య బోతున్నాను. దేవుడి ముందరి కాళ్ళకు బంధంగా ఈ భక్తిని ఉపయోగించుకుంటు న్నాననుకో. నువ్వు నన్ను నమ్మకు. నా దారి నాది. నీ దారి నీది. ఆ ప్రయత్నాల్లో ఉండు..." అని హెచ్చరించారు.

తానెలాంటి తప్పు చేసినా తన భార్య తనని క్షమిస్తుందన్నారు మీనాక్షితో.

వాళ్ళిద్దరికీ చెయ్యబోయే తప్పుల గురించి తప్ప మాట్లాడుకుందుకు వేరే టాపిక్కు లేవా?

చివరికాయన నన్ను మోసం చేసి వెళ్ళనే వెళ్ళారు. ఇప్పుడాయన మెచ్చిన ఆధ్యాత్మిక సంస్థ నుంచి ఉద్యోగానికి దర ఖాస్తు ఫారం.

కేవలం ఆయన కారణంగా ఆ సంస్థలో నాకుద్యోగమొస్తుంది. నామీద నిరాసక్త తతో నన్నొదిలి వెళ్ళిన మనిషికి- నాకేదో ఆధారం చూపాలన్న తాపత్రయం దేనికి?

నా కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. ఒకటి కాదు, రెండు కాదు... నాలుగు ఉద్యోగాలు నా వెంట బడుతున్నాయి.

"కాసులూ- నువ్వుద్యోగం చెయ్యడానికి వీల్లేదు" అనేవారాయన అప్పుడు.

"అమ్మా- నువ్వుద్యోగం చెయ్యడం నాన్న కిష్టం లేదు" ఇదిప్పుడు కొడుకంటున్న మాట.

"ఆయన్ను మామూలు మనిషనుకో కుండా అవతారపురుషుడిగా భావించి అహాన్ని చంపుకుని గమనిస్తే ఆయన ప్రవర్తనలో గూఢార్థాలు కనిపిస్తాయి" అంది మీనాక్షి.

మీనాక్షికి ఆయన అవతారపురుషుడు. కానీ నేనెలా చూడగలను- ఆయనలో అవ తారపురుషుణ్ణి? అన్నింటికీ నేనున్నాను- నువ్వేమీ చెయ్యడానికి వీల్లేదంటూ నమ్మించి ఉన్నపళంగా నా మానాన నన్ను బతకమని ఏకాకిని చేసి వెళ్ళిపోయిన మనిషి- ఏనాడూ నాకు గౌరవమివ్వలేదు సరికదా నిరసిస్తూ మాట్లాడే మనిషి- నాకు అవతారపురుషుడా? అలాగనుకో వడం నన్ను నేను చిన్నబుచ్చుకోవడమే. ఆయన స్వార్థపరుడు. అవతారపురుష

లకు స్వార్థముంటుందా?

ఆయనలా వెళ్ళిపోగానే ఇలా నాకు నాలుగు ఉద్యోగాలు.

ఉద్యోగంలో చేరాలా లేక- ఆయనిప్పుడు నా దగ్గర లేకున్నా- ఆయన ఆదేశాలనే శాసనాల్ని చేసుకుని జీవితం కొనసాగించాలా?

బుర్ర వేడెక్కిపోయింది కానీ కర్తవ్యం తోచలేదు.

అసలు సమస్యేమిటంటే- నాకు జీవితమంటేనే విరక్తి పుడుతోంది.

వికాస్ ఉద్యోగంలో చేరతాడు. చంద్రిక బాగోగులు చూడ్డానికి అమ్మా నాన్నా ఉన్నారు, అత్తమామలున్నారు. ప్రస్తుతానికి మోరల్ సపోర్టుగా అమ్మా నాన్నా నా దగ్గరకొచ్చి ఉన్నా- నాకు అత్తమామల నుంచీ వాళ్లంత సపోర్టు ఉంది.

ఇక నాన్నకు అమ్మ, అమ్మకు నాన్న, అత్తకు మామ, మామకు అత్త.

నాకే ఎవ్వరూ లేరు.

ఎవరికోసం బతకాలి? ఎవరికోసం సంపాదించాలి?

ఆయనలేని జీవితం శూన్యమనిపిస్తోంది. అర్థవిహీనమనిపిస్తోంది.

ఉద్యోగాలమీద ఉద్యోగాలు నా సమర్థతకు అద్దం పడుతూంటే- ఆయన నిరసన, నిర్లక్ష్యం, ఉదాసీనత ఆదేశాలై నన్ను నీరసపరుస్తున్నాయి.

డైవర్షన్ కోసం బల్లమీదున్న దినపత్రిక తీసి పేజీలు తిప్పాను. అందులో నాలుగు పేజీల ప్రత్యేక అనుబంధం. అందులో 'నేనెందుకు బతకాలి?' అన్న ఓ శీర్షిక. ఆ శీర్షికలో సుమతి కథనం.

సుమతి వయసు ముప్పై లోపే.

పదహారేళ్ళకే పెళ్ళయిందామెకు. ముత్యాల్లాంటి పిల్లలిద్దరు.

అన్యోన్యతకు మారుపేరు ఆమె దాంపత్య జీవితం. భర్త ఆమె ఆరో ప్రాణం. ఉద్యోగరీత్యా అతడు పల్లె ప్రాంతాలు తిరిగేవాడు. పిల్లల్ని తన తల్లిదండ్రుల వద్ద వదిలి అతడితోపాటే ఉండేదామె. వాళ్ళిద్దరిలో ఒకరైనా పిల్లల దగ్గరుండాలని ఎవరన్నా ఆమె పైకేమీ అనేది కాదు. ఎందుకంటే పిల్లలకంటే తనకు భర్తా, భర్తకు తనూ ముఖ్యమన్న నిజం చెబితే ఎవరూ హర్షించరు.

తన పిల్లల సంతోషానికి లోటేమీ లేదనుకునేదామె.

ప్రేమ పలు రూపాలైతే అన్నింట్లోకీ అపురూపమైనది భార్యాభర్తల ప్రేమ.

తల్లి బిడ్డను ప్రేమిస్తే అది సహజం, రక్త సంబంధీకులు పరస్పరం ప్రేమించుకుంటే అదీ సహజమే. కానీ ఒకరికొకరు ఏమీకాని స్త్రీ పురుషులొకచోట చేరి ఒకరి కోసమొకరన్నట్లు జీవితకాలాన్ని గడపడం అపురూపమైన వ్యవస్థ. దీన్ని గుర్తించిన మన సంప్రదాయం పురాణకాలంనుంచీ పాతివ్రత్యానికీ, పత్నీవ్రతానికీ ఇచ్చిన ప్రాధాన్యాన్ని సుతులకు, సుతలకు ఇవ్వలేదంటుంది సుమతి.

అలాంటి సుమతికి ఇంకా మూడు పదుల వయసు నిండకుండానే- భర్త యాక్సిడెంట్లో మరణించాడు. దాంతో ఆమెకు జీవితం శూన్యమైపోయింది. ఆవేశపడి సహగమనం చేస్తానంది. సమాజం అడ్డుపడింది. ఆవేశం తగ్గేదాకా ఆమెను

**కొత్తగాలి...**

**విధి చేతిలో చిక్కి**
**జీవితం చేరదు ఓ కొలిక్కి**
**చివరకు అంతా హుళక్కి**
**ఎలాగూ మృత్యువుంది నక్కినక్కి**

**–నున్నా మధుసూదనరావు, హైదరాబాద్**

కాపాడే బాధ్యత తమదనుకున్న తల్లిదండ్రులామెను కంటికి రెప్పలా కాపాడుకొస్తున్నారు.

క్రమంగా సుమతి ఆవేశం తగ్గిందికానీ జీవితంలోని శూన్యమలాగే ఉంది.

"నేనెందుకు బ్రతకాలి? " అంటుందామె.

"నీకు పిల్లలున్నారు. నువ్వు లేకపోతే వాళ్ళు బతకలేరు. వాళ్ళకోసం నువ్వు బతకాలి" అన్నారు అటు తల్లిదండ్రులూ, ఇటు అత్తమామలూ.

"నా పిల్లలకు జీవితంలో ధ్యేయముంది. చదువు, ఉద్యోగం, పెళ్ళి, పిల్లలు వగైరా లక్ష్యాలున్నాయి. నేను లేకపోతే వాళ్ళు నా కోసం ఓ నాలుగు రోజులు బెంగ పెట్టుకోవచ్చు. కానీ ఆ తర్వాత లక్ష్యసాధనే వాళ్ళను ముందుకు నడిపిస్తుంది. ఆపైన వాళ్ళకు మీరంతా ఉన్నారు" అందామె.

"మరి నీకు మేమంతా లేమా? " అన్నారు అయినవాళ్ళు.

"పెళ్ళయ్యాక నాకు ఆయనే సర్వస్వమైపోయారు. నా జీవితాన్ని ఆయనకే అంకితం చేసేసాను. ఆయనతోపాటే నా జీవితానికి అర్థమూ పోయింది. ఆయన లేకుండా నేనెందుకు బతకాలో నాకు అర్థం కావడంలేదు" అంటుందామె.

ఆమె ఆత్మహత్య చేసుకోలేదు. కానీ చేసుకునేలాగే ఉంది.

సుమతికి బతుకుమీద ఆశ పుట్టాలి. ఎందుకు బతకాలో తెలియాలి. ఆమెకు సాయపడమని ఆ పత్రిక పాఠకులను కోరుతూ ఉత్తమ సూచనలకు ఆకర్షణీయమైన బహుమతులు ప్రకటించింది.

నేనదంతా శ్రద్ధగా చదివినా- సుమతికి సూచనలేమైనా పంపాలని స్ఫురించలేదు కానీ- "నేనెందుకు బతకాలి? " అన్న ప్రశ్న ఇంతింతై వటుడంతయై అన్నట్లు క్రమంగా నా ఆలోచనలను ఆక్రమించింది.




"నేను ఉద్యోగం చెయ్యను" అన్నాను అమ్మతో.

అమ్మ ముఖం అదోలాగైపోయింది. వెళ్ళి నాన్నకు చెప్పినట్లుంది. వెంటనే ఆయన నా దగ్గరకొచ్చి నవ్వుతూ పలకరించి ఆ మాటా ఈ మాటా చెప్పి, "నువ్వుద్యోగం చెయ్యనన్నావట కదా- అలాగంటే ఎలాగమ్మా! నువ్వుద్యోగం చెయ్యకపోతే మాకు బోరు కొడుతుంది" అన్నారు.

అసంబద్ధంగా అనిపించి, "మరి నేనుద్యోగం చేస్తే మీకు బోరెలా పోతుంది? " అన్నాను.

"నేను రిటైరై ఆర్నెల్లైంది. నాకు నెలనెలా పెన్షనొస్తుంది. కట్టిన ఇళ్ళమీద అద్దెలొస్తాయి. పొలాలమీంచి ధాన్యం, పప్పులు, డబ్బు వస్తాయి. వీటిలో దేనికీ నా శ్రమ లేకపోవడంవల్ల నేను ఇంచుమించు రోజంతా ఫ్రీ. నేను ఫ్రీ కాబట్టి అమ్మ కూడా ఫ్రీ. అందుకని మేము పల్లె వదిలి పట్నమొచ్చి నీ దగ్గరుంటున్నాం. మరి నువ్వూ ఫ్రీగా ఉంటే ఇక్కడా మాకు పనుండదు. నువ్వుద్యోగం చేసావనుకో- అప్పుడు నీ పిల్లల బాధ్యత మాదౌతుంది. నీ బాధ్యతా మాదౌతుంది. అప్పుడిక మాకు బోరనిపించదు"

నాన్నమాటలు సబబే అనిపించినా అందులో నాకింకో పరిష్కామార్గం కనిపించింది.

నేనుండగా వాళ్ళు పిల్లల బాధ్యతను

తీసుకోరు. నేను లేకుంటే? !

మన వ్యవస్థలో భార్యాభర్తల అను బంధం ప్రత్యేకమైనదంటుంది సుమతి. అది నిజం.

ఆడది తల్లికి చెప్పుకోలేని నిజాలు కూడా భర్తకు చెప్పుకోగలదు. అందుకే ఆమె భర్తను మిస్సైనంతగా తల్లిని కూడా మిస్స వదు.

ముప్పైకే సుమతి భర్త లేకుండా "నేనెందుకు బతకాలి? " అంటోంది. మరి నాకు నలభై.

నేనో నిర్ణయానికొచ్చేసాను. సుమతిలాగే నేనూ నా పిల్లల బాధ్యతను తల్లిదండ్రులకు విడిచిపెట్టి- జీవితానికి చరమగీతం పాడాలనుకున్నాను.

నా నిర్ణయం ఎంత బలపడిందంటే నేనిప్పుడు- ఎందుకు బతకాలీ అని ఆలోచించడంలేదు. ఎలా చావాలీ అన్నది నా సందిగ్ధం.

చావుకు చాలా మార్గాలే ఉన్నాయి. ఏట్లో దూకొచ్చు. విషం మింగొచ్చు. కరెంటు షాకు తినొచ్చు.

ఏంచేసినా ఎవరికీ ఇబ్బంది కలగకూడదు. నా వాళ్ళను పోలీసులు బాధించకూడదు. అటూ ఇటూ మా కుటుంబం అప్రతిష్ఠ పాలు కాకూడదు. పిల్లల మనసు గాయపడకూడదు.

అలా జరగాలంటే నాది ఆత్మహత్యైనా సహజమరణమని అంతా అనుకోవాలి. అలాంటి ఉపాయాలు కొన్ని పుస్తకాల్లో చదివాను. ఆ వివరాలు సంపాదించాలి ఎలా?

ఆ రాత్రి మంచంమీద పడుకుని ఆ విషయమై తీవ్రంగా ఆలోచిస్తున్నాను. అప్పుడు నాన్న ఫోనొచ్చిందంటూ నన్ను పిలిస్తే - "ఎవరు నాన్నా? " అనడిగాను.

"రఘువీర్! నా ఫ్రెండు కొడుకు. కాలేజిలో నీకు రెండేళ్ళు సీనియరని గుర్తు"

రఘువీర్ గుర్తొచ్చాడు నాకు.

చలాకీగా ఉండేవాడు. ఆడపిల్లలు కనపడితే కబుర్లలోకి దింపి ఓ పట్టాన వదిలేవాడు కాదు. నాన్నగారి స్నేహితుడి కొడుకునంటూ మా ఇంటికి తరచుగా వచ్చి ఎక్కువగా నాతోనే మాట్లాడేవాడు. ఆ కబుర్లు వినడానికి బాగానే ఉన్నా శృతి మించడంవల్ల అప్పుడప్పుడు విసుగనిపించేది నాకు.

"రఘువీర్ నాన్న మీకెలాంటి స్నేహితుడు నాన్నా? " అడిగేసాను నాన్ననో సారి.

"ఆс ఏదో దూరపు స్నేహితుడు" అని నవ్వేసారాయన.




ఆ మాట రఘువీర్‌కి చెబితే, "దూరపు చుట్టాల్లా దూరపు స్నేహితులూ ఉంటారు, ఎటొచ్చీ ఎప్పుడైనా సరే- చుట్టాలకంటే స్నేహితులే సో బెటరు" అన్నాడు నవ్వుతూ.

"బెటరే కానీ- కాస్త తక్కువ మాట్లాడితేనే" అనేసాను ధైర్యంచేసి.

రఘువీర్ గలగలా నవ్వేసి, "నేను ఎక్కువ మాట్లాడతానని చాటుగా చాలామందే అనుకుంటారుట. మొహమాటం లేని కొందరు మొహంమీదే అంటారనుకోండి. ఐనా నేను నా అలవాటు మార్చుకోను. ఎందుకంటే మంచికో చెడుకో అంతా నన్ను నా అలవాటుతోనే గుర్తుం



చుకుంటారు. ఏ అలవాట్లూ లేని మనుషు ల్నెవరూ గుర్తుపెట్టుకోరు" అనేసాడు.

"చాలా ఎక్కువగా మాట్లాడతానని మీకూ అనిపిస్తుందా? "

"ఎంత మాట్లాడినా తక్కువనిపించడంవ ల్లనే నేను ఎక్కువ మాట్లాడుతున్నా నేమో!"

అప్పుడు నేను మనస్ఫూర్తిగానే నవ్వి, "మీరు బలే మాట్లాడతారు" అన్నాను.

"ఎక్కువగానా, తక్కువగానా? "

"గుర్తుండిపోయేంతగా" మళ్ళీ నవ్వాను.

అతడు వెంటనే "నేనీ రోజు చెబుతు న్నాను- గుర్తుంచుకోండి. మీరు చాలా చాలా గొప్పవాళ్ళై పోతారు" అన్నాడు.

"ఉన్నట్లుండి అలాగనేసారేమిటి? " అన్నాను తెల్లబోయి.

"నేను చాలామందితో చాలా ఎక్కువగా మాట్లాడుతుంటానుగా- ఆడవాళ్ళలో ఇంత

షార్ప్ అండ్ విట్టీ- మిమ్మల్ని మాత్రమే చూసాను" అన్నాడతడు.

ఇప్పుడు ఫోన్లో లైన్లో ఉన్నది ఆ రఘు వీరేనని గ్రహించి, వెళ్ళి ఫోనందుకుని "హలో" అన్నాను.

"హలో- వికాసిని గారేనా? "

"ఊс..."

"అబ్బ- చాలారోజుల తర్వాత వింటున్నాను మీ గొంతు"

"రోజులు కాదు- ఏళ్ళు" సవరించాను. అతడు నన్ను షార్ప్ అన్న విషయం నాకింకా గుర్తుంది మరి.

"ఔను కదూ... కాలేజి వదిలేక మనం మళ్ళీ కలుసుకొనే లేదు" అన్నాడతడు.

"మీకు నేనింకా గుర్తుండడం ఆశ్చర్యం"

"నేను గొప్పవాళ్ళనే కాదు, కాబోయే గొప్పవాళ్ళను కూడా గుర్తుంచుకుంటాను"

భారంగా నిట్టూర్చాను, "ఇంకా నేను గొప్పదాన్ని కాగలననే అనుకుంటున్నారా మీరు? "

"మీరెప్పుడూ గొప్పవారే. నేననేది మీ గొప్పతనానికి గుర్తింపునిచ్చేవారి సంఖ్య పెరగాలని!"

"అది సరే... ఇప్పుడేం చేస్తున్నారు మీరు? "

"మీకు ఫోన్ చేస్తున్నాను"

"ఇప్పుడంటే ఇప్పుడని కాదు..."

"అయితే కొన్ని రోజులు వెనక్కు వెడదాం. అప్పుడూ మీకు ఫోన్ చేసాను. కానీ మీరు- నేను వికాసినిని కాదు -అనేసి ఫోన్ పెట్టేసారు"

ఆ ఫోన్ నాకు గుర్తుంది- "అరే- ఆ ఫోన్ మీరా? " అన్నాను.

"మీరా కాదు... నేను"

జోకు పాతదే అయినా, "మీరు చమత్కారంగా మాట్లాడతారు" అన్నాను.

"అతివాగుడు తగ్గించాను. చమత్కారం పెరిగింది"

ఏమనాలో తెలియక నవ్వి ఊరుకున్నాను. ఆ నవ్వును ఫోన్ పట్టేసినట్లుంది. అతడు వెంటనే, "నవ్వుతున్నారు కదూ! ఆరోజు మీరు నిజంగానే వికాసిని కాదు. ఈరోజే వికాసిని!" అన్నాడు.

అంటే ఆ రోజుకీ ఈరోజుకీ నాలో చాలా తేడా వచ్చిందన్నమాట. మరి ఆ రోజు నేను కాసులమ్మ మాత్రమే. ఇంత తొందరగా ఈ కొద్ది రోజుల్లోనే నేను వికాసినినెలాగయ్యాను? నేను వికాసినినైతే - వికాసిని ఆత్మహత్య గురించి ఆలోచిస్తుందా?

పాపం - రఘువీర్ ఆ రోజు నాతో మాట్లాడాలని ఎంతగా ప్రయత్నించాడో!

"ఆ రోజు మీరు నాతో ఏం మాట్లాడాలనుకున్నారు? "

"మీకు సంబంధించిన ఓ ముఖ్య విషయం. చాలా చాలా ముఖ్య విషయం"

"ఏమిటది? " యధాలాపంగా అడిగాను కానీ నాలో కుతూహలం లేదు.

"ఒక విధంగా అది నాకూ ముఖ్య విషయమే"

"అంటే? "

"అది మీకూ నాకూ సంబంధించిన విషయం"

ఉలిక్కిపడి, "ఏమిటది? " అన్నాను.

"ఫోన్లో చెప్పలేను. స్వయంగా మా ఇంటికొస్తే చెబుతాను"

"మీరీ ఊళ్ళోనే ఉంటున్నారా? " ఆశ్చర్యంగా అడిగాను.

"చూసారా... ఆరేళ్ళుగా నేనీ ఊళ్ళో ఉంటున్నా ఆ విషయం మీకు తెలియదు"

"నా గురించి మీకూ అంతేగా? "

"కాదు. కాలేజి వదిలిపెట్టినప్పట్నించీ మీ విషయాలు నేను ఫాలో అవుతూనే ఉన్నాను. మరిప్పుడు మీకు ఫోన్ చేసానంటే అర్థం చేసుకోగలరు"

"మీరు నన్నెందుకు ఫాలో ఔతున్నట్లు? "

ఆశ్చర్యంగా అడిగాను.

"టెస్టుల్లోకి రాకముందునించీ సచిన్ టెండూల్కర్ని ఫాలో ఔతున్నాను. రామాయణం ముందునుంచీ జూనియర్ ఎన్టీఆర్‌ని ఫాలో ఔతున్నాను. వీరవెన్నెలకు ముందునుంచీ బాలచంద్రుణ్ణి ఫాలో ఔతున్నాను"

అతణ్ణి మధ్యలో ఆపి, "వీరవెన్నెలేమిటి-బాలచంద్రుడెవరు? " అన్నాను.

"వీరవెన్నెల నా కవిత, బాలచంద్రుడు నా కలం పేరు"

నవ్వకుండా ఉండలేకపోయాను. ఫోన్ ఆ నవ్వునతడికి చేరేసినట్లే ఉంది. "జీవితం శూన్యమనిపిస్తుంది. కానీ నవ్వడానికి బోలెడన్ని అవకాశాలు!" అన్నాడు.

"ఏమన్నారూ? "




"ఒక్కసారి మీరు మా ఇంటికి రండి. మనం మనసులు విప్పి మాట్లాడుకుందాం"

ఏమిటిది? మనసులు విప్పి మాట్లాడుకుందామంటాడు- అలా మాట్లాడుకుందుకు మేమేమైనా ప్రేమికులమా?

"జీవితం శూన్యమనిపిస్తుంది. కానీ నవ్వడానికి బోలెడన్ని అవకాశాలు!" అన్నాడు. అలా అనేముందే నన్ను నవ్వించాడు. నా జీవితంలో శూన్యం గురించి అతడికి తెలుసా? తెలిసే ఈ ఫోన్ చేసాడా? అసలతడి ఉద్దేశమేమిటి?

"మీరు కాలేజి రోజుల్లో కవితలు వ్రాసినట్లు గుర్తు లేదు" అన్నాను.

"అప్పుడూ వ్రాసేవాణ్ణి. కానీ ఫ్రెండ్సు వాటిని తమకు వినిపించొద్దనీ, కాలేజి మాగజైనుకి కూడా ఇవ్వవద్దనీ బ్రతిమాలేసారు"

నవ్వాపుకున్నాను, "అంటే ఆవిధంగా మొదలెట్టి ఇప్పటికి బాలచంద్రుడి అవతారమెత్తారన్నమాట. మరిప్పుడు మీ ఫ్రెండ్సేమంటారో? "

"ఏమీ అనరు. బాలచంద్రుడి గురించి నా భార్యకు తప్ప ఇంకెవ్వరికీ తెలియదు"

"మరి మీ వీర వెన్నెల? " అతడికి పెళ్ళైందని తెలియగానే నా మనసు కాస్త తేలికపడింది.

"అది తనకు వినిపించొద్దనీ, ఏ పత్రికలోనూ ప్రచురించొద్దనీ ఆమె నాచేత ఒట్టేయించుకుంది"

నాకు నవ్వాగలేదు. అతడు నేను నవ్వాపేదాకా ఆగి, "రేపు మా ఇంటికొస్తారు కదూ!" అన్నాడు.

"మీ కవితను వినడానికా? "

"నా భార్య ఒట్టుతీసి గట్టుమీద పెట్టమనేదాకా నా కవితల్ని నేనెవ్వరికీ వినిపించను. అయాం సిన్సియర్ టు మై వర్డ్"

"ఐతే నేనామెచేత ఒట్టుతీసి గట్టుమీద పెట్టించాలా? "

"ఆరేళ్ళ క్రితం మీరీమాట అంటే అవునేమో అనేవాణ్ణి"

"ఇప్పుడెందుకనలేరు? "

"నా భార్య పోయేకనే నేనీ ఊరొచ్చాను"

అంతవరకూ జాలీగా మాట్లాడుతున్నాడేమో- ఇలాంటి కబురు నేనూహించలేదు. మనసు దేవేసినట్లై, "సారీ" అన్నాను.

"సారీలు నాకు సాయపడవు. మీకుపయోగపడవు. మనమిద్దరం ఒకే పడవలో పయనిస్తున్నాం. మనసులు విప్పి మాట్లాడుకోవడం మంచిదికదూ"

అతడి ఉద్దేశం స్పష్టమైంది నాకు. ఎంత అసహ్యకరమైన విషయాన్ని ఎంత సుల

భంగా చెప్పాడు! ఛీ... అనుకున్నాను.

"హలో- వికాసినిగారూ!" అతడి గొంతులో ఆదుర్దా.

"ఊc" అన్నాను అన్యమనస్కంగా.

"నా ప్రపోజల్ మీకు అసహ్యంగా అనిపిస్తే... నేను రఘువీర్‌ని కాకుండా రాఘవిని అనుకోండి. అప్పుడు మనం మనసులు విప్పి మాట్లాడుకుందుకు మీకు అభ్యంతరం లేదు కదూ? "

రఘువీర్ అబ్బాయి. రాఘవి అంటే అమ్మాయి. ఇదో చిన్న ట్విస్టు. ఆలోచిస్తున్నాను. ఓ అమ్మాయీ అబ్బాయిల మధ్య స్నేహం- ఇద్దరమ్మాయిల మధ్య స్నేహం- ఒకటే ఔతాయా?

"మనమిద్దరం దూరపు స్నేహితుల బిడ్డలం. అందుకని మనమూ ఆ దూరపు స్నేహాన్నే వారసత్వంగా స్వీకరించాలా? నాకైతే మనం దగ్గర స్నేహితులం కావాలని అభిలాష..."

ఇంకా ఆలోచిస్తున్నాను.

"మీరు రేపు వచ్చేయండి. మీ పెద్దవాళ్ళనీ, పిల్లల్నీ తీసుకురండి. మా ఇంట్లో వాళ్ళని ఎంగేజ్ చెయ్యడానికి అన్ని వయసుల జనం ఉన్నారు. నేను మిమ్మల్ని ఎంగేజ్ చేస్తాను"

ఎంగేజ్... ఆ పదం నాకు ఎంగేజ్‌మెంట్‌లా ధ్వనిస్తోంది. నన్ను ఎంగేజ్ చేస్తాడట- అంటే?

"వస్తున్నారు కదూ? నేను రేపుకోసం ఎదురు చూస్తుంటాను. నా గుండె కూడా లబ్‌డబ్ అనడం మాని రేపు రేపు అని కొట్టుకుంటోంది"

రేపు... అది తెలుగా, ఇంగ్లీషా?

"హలో వికాసినిగారూ! మీరు బొత్తిగా మాట్లాడ్డంలేదు. మళ్ళీ చెబుతున్నాను. నేను రఘువీర్‌ని కాదు రాఘవిని. గొంతు కాస్త మగ గొంతు. మీరు రావాలి. వస్తున్నారు. వచ్చేక మీరెంతో సంతోషిస్తారు. నాకెంతో సంతోషాన్నిస్తారు"

మాటలు శృతిమించుతున్నాయి. నేనతడికి సంతోషాన్నివ్వడమేమిటి? ఎందుకు... ఎలా?

"మీ మౌనాన్ని అర్ధాంగీకారంగా కాదు, పూర్ణాంగీకారంగా భావిస్తున్నాను. రేపు సాయంత్రం సకుటుంబంగా మా ఇంటికొస్తున్నారు. ప్రోగ్రాం కన్ఫర్మ్డ్. ఏదైనా మార్పుంటే తప్ప మీరిక నాకు ఫోన్ కూడా చెయ్యక్కర్లేదు. నౌ ది బాలీజ్ ఇన్ యువర్ కోర్ట్"

అవతల క్లిక్‌మనేసరికి అప్పటికి తేరుకుని- కంగారుగా హలో హలో అన్నాను. అతడు ఫోన్ పెట్టేసాడని గ్రహించి నేనూ ఫోన్ పెట్టేసి భారంగా నిట్టూర్చి చుట్టూ చూసాను. దగ్గర్లో ఎవరూ లేరు. అంటే నాతో రఘువీర్ ఏం మాట్లాడేడన్న కుతూహలం ఎవరికీ ఉన్నట్లు లేదు. లేదా ఈ ఫోన్ గురించి అమ్మా నాన్నలకు ముందే తెలిసుండాలి.

దీపమార్పి నా పడకగదిలోకెళ్ళాను. బెడ్‌లైట్ వేసి మంచంమీద పడుకుని రఘువీర్ ఫోన్ మననం చేసుకుంటే- మనసులు విప్పి మాట్లాడుకోవడం, ఎంగేజ్‌మెంట్, రేపు, అర్ధాంగీకారం... కాసేపు ఈ పదాలే బుర్రలో తిరిగాయి.

అతడింటికెళ్ళి నేను సంతోషపడి అతణ్ణి సంతోషపెడతానుట... ఎందుకు, ఎలా?

ఈ ప్రశ్నలు నన్ను కుదిపేస్తుంటే- "నేను రఘువీర్‌ని కాదు, రాఘవిని అనుకోండి" అన్న అతడి మాటలు గుర్తొచ్చాయి. దాంతో నా ఆలోచనలు దారి మళ్ళాయి.

రఘువీర్ రాఘవి ఔతాడు. ఎందుకు? ఎలా?

తమ స్నేహం స్త్రీ పురుష సంబంధానికి అతీతమని సూచిస్తున్నాడతడు. నాతో పంచుకోవాలనుకుంటున్న విశేషాలెలాం

టివో సూచించాలనే అతడు నన్ను సకుటుంబంగా ఆహ్వానించాడు. కానీ ఉన్నట్లుండి ఇప్పుడెందుకీ ఆహ్వానం?

భార్య పోయిన రఘువీర్ ఆరేళ్ళుగా ఇక్కడే ఉంటూ ఒక్కసారీ తనింటికి పిలవలేదు. ఇప్పుడాయన నన్ను విడిచి వెళ్ళేక పిలిచాడు. మనసులు విప్పి మాట్లాడుకుందుకట!

అతడిప్పుడు రఘువీర్ కాదు, రాఘవిట! రాఘవి కావడానికతడు చీర కట్టుకుంటాడా? బొట్టు, కాటుక పెట్టుకుంటాడా? జడేసుకుని పూలు ముడుచుకుంటాడా?

"అరే- నేను అచ్చం ఆయనలా ఆలోచిస్తున్నాను. కానీ రఘువీర్‌కి భార్య లేకుంటే రాఘవికి భర్త ఉండడు, మరి బొట్టూ, పూలూ ఉండవుగా" అనుకున్నాను.

అప్పుడు నా మనసు మరి నీ సంగతేమిటంది. జవాబుగా లేచాను మంచంమీంచి. నడిచాను బీరువా దాకా. తెరిచాను బీరువా తలుపులు.

ఆ బీరువా నాది. నేను తప్ప ఇంకెవరూ దాన్ని తెరవకూడదన్న నియమాన్ని ఆయన కూడా గౌరవించేవారు.

బీరువా తలుపులు తెరుచుకోగానే ఎదురుగా ఓ అరలో చిరునవ్వులు చిందిస్తూ ఆయన ఫొటో!

ఆ ముఖంలో ప్రశాంతత. ఆ చిరునవ్వులో ఆత్మీయత.

అబ్బురంగా ఆయన్నే చూస్తున్నాను. అందర్నీ నవ్విస్తూండే ఆయన తనకు తానుగా నవ్విన సందర్భాలు తక్కువ. ఏ ఫొటో చూసినా ఆయన ముఖం గంభీరంగా ఉంటుంది. ఈ ఫొటోలో మాత్రం ఆయన శ్రీకృష్ణ పరమాత్మలా చిరునవ్వులు చిందిస్తున్నారు.

ఆ ఫొటో మరెవ్వరి దగ్గరా లేదు. ఆ రీలు డెవలప్ చేయించినప్పుడు అనుకోకుండా చూసానా ఫొటో. నేను తెగ మెచ్చుకుంటే నన్నేడిపించడానికాయన "నీతో కాపురం చేస్తూ ఇలా నవ్వడం అసాధ్యం. ఈ ఫొటో నాది కాదు. నాకులా ఉండే ఇంకెవ్వరిదో. ఇది చూసి నిన్ను చూస్తే నేను రాముణ్ణీ, నువ్వు సీతవీ ఐపోతాం. మన మధ్య అనుమానమే తప్ప ఈ మాత్రం అనురాగం కూడా మిగలదు" అంటూ వెంటనే చింపేసారు.

నేనాయనకు తెలియకుండా నెగెటివ్‌ని మళ్ళీ డెవలప్ చేయించి పెద్ద ప్రింటు తీయించి లామినేషన్ చేయించి ఈ బీరువాలో పెట్టాను. నాకా ఫొటో చూస్తే ఆయన్ను చూసినట్లే ఉంటుంది. దాని ముందు నిలబడితే ఆయనతో మాట్లాడినట్టే ఉంటుంది. అలా నిలబడినప్పుడల్లా, "నాకు తెలియదు కానీ నేనీయన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను" అనుకునేదాన్ని.

ఆ ఫొటోను చూస్తూ అలంకరించుకోవడం అలవాటు నాకు. అందుకే ఆ ఫొటో పక్కన ఓ అద్దం. నేనలంకరించుకుంటూంటే ఫొటోలోంచీ జోకులేస్తూ ఆయన సూచనలిచ్చేవారు. విసుగు, చిరాకు నటిస్తూ పాటించేదాన్ని. అద్దంలో చూసుకుంటే ఆ సూచనలే నా అందాన్ని పెంచాయనిపించేది. ఇప్పుడు అద్దంలో నా ప్రతిబింబం, బొట్టు, కాటుక నా ముఖ సౌందర్యానికి వన్నెలుదిద్దాయి.

"మీరిప్పుడు నన్ను విడిచి వెళ్ళినా ఏదో రోజున తిరిగొస్తారు. అందుకే నా బొట్టు, కాటుక అలాగే ఉన్నాయి, ఉంటాయి" గొణిగాను నెమ్మదిగా.

ఉన్నట్లుండి ఫొటోలో కదలిక, "నా దగ్గరకు రాకముందు మాత్రం నీకు బొట్టు, కాటుక లేవా? వాటికీ నాకూ ఎందుకు ముడి పెడతావు? " గద్దించారాయన.

"ఏమిటో ఈ మనిషి... మాట సున్నితం లేదు" అనుకుంటూనే అప్రయత్నంగా మెడ తడుముకున్నాను. మంగళ

సూత్రాలు, నల్లపూసలు లేవు.

"అవి మీరు నాకిచ్చినవి. అందుకే వాటిని తీసేసాను. మీకు సంతోషంగా ఉందా? "

అది సంతోషమో, వెటకారమో- ఫొటో లోంచీ పెద్దగా నవ్వుతున్నారాయన.

"అలా నవ్వకండి. వాటినీ దాచుంచాను. మీరు తిరిగొచ్చిన రోజున మీ చేతులతోనే వాటిని నా మెడలో వేద్దురుగాని" అన్నాను. ఫొటోలో ఆయన నవ్వు మళ్ళీ చిరునవ్వుగా మారిపోయింది.

"రేపు నేను రాఘవి ఇంటికి వెడుతు న్నాను. తిరిగొచ్చేక విశేషాలు చెబుతాను" అంటూ బీరువా తలుపులు మూసాను. ఆయనతో ఇంకా మాట్లాడాలనున్నా అదుపు చేసుకుని మంచంమీద వాలి కళ్ళు మూసుకుంటే అది కలో, నిజమో... ఆయన కనిపించారు. నేనెంత పిలిచినా దగ్గరకు రాకుండా, "నేను స్వార్థపరుణ్ణి. నా సుఖసంతోషాలకోసం నిన్ను విడిచిపె ట్టాను. అలాంటి నన్ను నువ్వు మరిచిపో వడమే మంచిది" అన్నారు.

అది సందేశంలా కాక ఆదేశంలా ఉంది.

అమ్మ, నాన్న, చంద్రిక కూడా రఘువీర్ ఇంటికెళ్ళడానికి ఉత్సాహపడ్డారు. అందు లోనూ ఆ రోజు ఆదివారం.

మార్పు. రొటీన్ జీవితంనుంచి అందరూ కోరేది మార్పు. ఆధునిక యుగంలో అలాంటి మార్పు ఆదివారం నాడు వస్తుంది కానీ టీవీలొచ్చేక కొందరికి అదీ రొటీనైపోయింది.

ప్రస్తుతానికి ఆదివారంతో సహా అన్ని రోజులూ శూన్యంగా కనిపిస్తున్న మా ఇంట్లో - రఘువీర్ ఇంటికెళ్ళడం చాలా పెద్ద మార్పు.

వికాస్ లేడు. నాతో కలిపి నలుగురం. బయల్దేరేముందే రఘువీర్‌కి ఫోన్ చేసాను. నాన్న కారు డ్రైవ్ చేసారు. రఘు వీర్ ఇల్లు కాస్త దూరమే. గంట పట్టింది కార్లో.

మేమెళ్ళేసరికి ఇంటికి గుమ్మంలోనే నిల బడి ఎదురుచూస్తున్నాడు రఘువీర్. రూపురేఖల్లో అప్పటికీ ఇప్పటికీ పెద్దగా మార్పు లేకపోవడంవల్ల వెంటనే గుర్తుప ట్టాను.

కారు దిగగానే అతడొక్క క్షణం నన్ను తేరిపార చూసాడు. ఆ వెంటనే అందర్నీ పలకరించి లోపలకు ఆహ్వానించాడు. అంతా లోపలకెడితే పెద్దలకు పెద్దలు. చంద్రికకు పిల్లలు. క్షణాలమీద జతలు కట్టేసారు. చాలాకాలం తర్వాత దూరపు స్నేహితులు దగ్గరయ్యారు.

పెద్ద ఇల్లు. విశాలమైన గదులు. ఇంటి చుట్టూ పెద్దతోట.

"సిటీలో ఇంత పెద్ద ఇల్లు. చాలా అదృష్టం" అన్నారు నాన్న.

"మా అదృష్టానికేలోటూ లేదు... ఒక్క కోడలు తప్ప" అన్నాడు రఘువీర్ తండ్రి.

ఆ టాపిక్ తనకు నచ్చదన్నట్లు రఘు వీర్ తండ్రివంక ఇబ్బందిగా చూసాడు.

ఫలహారం తిని టీలు తాగేక పిల్లలు థియేటర్ చూడ్డానికి మేడమీదకెళ్ళారు.

"తోటలో గాలి బాగుంటుంది. అంతా అక్కడకు వెడదాం" అని రఘువీర్ తండ్రి ప్రపోజ్ చేస్తే రఘువీర్ ఒక్కడూ లేవ లేదు.

"నేను, వికాసిని ఇక్కడే ఉంటాం. మా కాలేజి ముచ్చట్లు మీ కబుర్లతో కలవ్వ" అన్నాడతడు.

పెద్దలు తోటలోకెడితే నేను కూర్చుని, "మనమూ వాళ్ళతో కలవాల్సింది" అన్నాను.

"మన కబుర్లకు పెద్దలు ఇబ్బంది" అన్నాడు రఘువీర్.

"పెద్దలతో కలిసి జీవిస్తూ వాళ్ళ ఉనికి ఇబ్బందనుకుంటే ఎలా? " అన్నాను.

"ఎలాగో తెలుస్తుంది... నేను చెప్పేది వింటే. ఆరేళ్ళక్రితం నా భార్య పోతే... ఆమె పోయి ఆర్నెల్లు కాకుండా నాకు రెండో పెళ్ళి ప్రపోజల్ వచ్చింది. ఎవర్నించో ఊహించగలరా? " అన్నాడతడు.

"ఎలా ఊహిస్తాను? " అన్నాను.

"పోనీ అది మీ వార్నించేనంటే నమ్మగలరా? "

షాక్ తిన్నాను. ఆయనకు రఘువీర్‌తో పరిచయమెప్పుడయింది? ఎలాగయింది? ఎప్పుడూ సీరియస్‌గా కనపడే మావారు ఎవరికో రెండో పెళ్లి ప్రయత్నాలు చెయ్యడమేమిటి? వీటిలో ఏ ఒక్కటీ నాకు తెలియకపోవడమేమిటి? అంతా మిస్టరీగా అనిపించింది. అదే చెప్పానతడికి.

"అదో విచిత్రమైన కథ. మేమిద్దరం అనుకోకుండా ఓసారి సుజాత ఇంట్లో కలిసాం" అన్నాడతడు.

"సుజాత ఎవరు? "

"సుజాత భర్త మీ వారి స్నేహితుడు. అంతకు ముందురోజుదాకా నిక్షేపంలా ఉండి రాత్రికి రాత్రి గుండెపోటుతో చనిపోయాడు. అతడి కర్మకాండ పూర్తయిన వారానికే సుజాత ఇంట్లో ఫ్యానుకి చీరకట్టి ఉరేసుకోబోతే... కొసప్రాణంతో ఉండగా రక్షించారింట్లోవాళ్ళు. అది తెలిసి ఏదో బీరకాయపీచు సంబంధంతో నేనక్కడికెడితే అక్కడ చేరిన చాలామందిలో మీ వారూ ఉన్నారు"

అందులో ఆశ్చర్యంలేదు. ఎవరికే కష్టమొచ్చినా 'సిరికింజెప్పడు' అన్నట్లు వెళ్లేవారాయన. నా మనసు సున్నితమని అలాంటి విశేషాలన్నీ నాకు చెప్పేవారు కాదు.

రఘువీర్ కొనసాగించాడు...

మీవారప్పుడు ఆవేశపడి, "మనదేశంలో రూల్సన్నీ ఆడదానికే. మొగుడి చాప్టర్ క్లోజైతే ఆమెకు జీవితం ఉండగా జీవచ్ఛవాన్ని చేస్తారు. అలాంటి ఆమె ప్రాణాలు తీసుకుంటే ఇంత రభస దేనికి? కొసప్రాణంతో ఉండగా రక్షించడానికి బదులు పీక నొక్కేస్తే సరిపోయేదిగా" అన్నారు. అదాయన స్టైల్. అది తెలియక రఘువీర్ ఆ మాటలకు ఆశ్చర్యపడ్డాడు.

"సుజాతక్క బతకాలంటే- తను ఆత్మహత్యా ప్రయత్నం చేసినప్పుడల్లా రక్షించడం కాదు. తనకు జీవితంమీద ఆసక్తి పుట్టేలా చెయ్యండి. బొట్టు పెట్టుకుని, రంగుబట్టలు కట్టుకుని, తలనిండా పూలెట్టుకుని టింగురంగామంటూ తిరగమని ప్రోత్సహించండి. అప్పుడు తనలో కొంత ఉత్సాహం పుడుతుంది"




"ఏంటయ్యా... భర్తపోయి పుట్టెడు దుఃఖంలో ఉన్న అమ్మాయి గురించి అనాల్సిన మాటలేనా ఇవి? " అంటూ అక్కడున్న ఓ పెద్దాయన మావారిని మందలించాడు.

"అయ్యా... పుట్టెడు దుఃఖం సంగతి తెలియదు కానీ భార్యపోయి ఇంకా నెల తిరక్కుండా టింగురంగా మంటూ తిరుగుతున్న వాళ్ళు ఇప్పుడు మనమధ్యే కొందరుండొచ్చు. అందుకు వాళ్ళను నేను తప్పు పట్టడంలేదు. వాళ్ళు ఆత్మహత్యలు చేసుకోకపోవడానికి కారణం చెబుతున్నానంతే!" అన్నారు మావారు.

అప్పుడక్కడే ఉన్న రఘువీర్ భుజాలు

తడుముకున్నాడు. అతడు ముదురు నీలం రంగు పాంటుమీద లేత పసుపురంగు పొడుగు చేతుల చొక్కా ఇన్‌షర్ట్ చేశాడు. మ్యాచింగ్ టై కట్టాడు. షూస్ బయట విప్పి నేవీబ్లూ సాక్సుతో లోపలకొచ్చాడు. స్ప్రే కొట్టిన అతడి తలకట్టు నిశ్చలంగా ఉంది. అప్పటికతడి భార్యపోయి ఐదు నెలలే అయింది.

మావారి మాటలకు చాలామందికి నోళ్ళు మూతపడ్డాయి. అప్పుడాయన మళ్ళీ, "సుజాతక్క ఎందుకు ఆత్మహత్య చేసుకోబోయిందో అందరికీ తెలుసు. కాబట్టి చేసుకోకుండా ఆపడమూ మనకు తెలియాలి" అన్నారు.

"నీకేం తెలుసో నువ్వు చెప్పు బాబూ!" అన్నాడొకాయన ఎకసక్కెంగా.

"అది సుజాతక్కనే అడిగి తెలుసుకోవడం మంచిది కదా" అన్నారాయన.

అంతా గుసగుసలాడారు. కొందరు సుజాత చుట్టూ చేరారు. ఆమె చాలాసేపు మాట్లాడకుండా ప్రతిఘటించి చివరకు నోరు విప్పి, "నాకు వారి తోడిదే జీవితం. వారు లేకపోతే అంతా శూన్యం. నా మానాన నన్ను చావనిస్తే సంతోషిస్తాను" అంది విసుగ్గా.

వెంటనే అక్కడ సుజాతపై ప్రశంసల జల్లు కురిసింది. దీనికేమంటావన్నట్లు కొందరు మావారి వంక నిరసనగా చూశారు. ఆయన చలిస్తారా. "సుజాతక్కది పెద్దలు చేసిన పెళ్లి. అంటే తను భర్తను ప్రేమించి పెళ్లాడలేదు. పెళ్ళాడి ప్రేమించింది. అంటే తనకు పెళ్లి కాకపోయినట్లైతే అక్క ఆత్మహత్యా ప్రయత్నం చేసేది కాదు. పెళ్లి చేసుకున్నాక తను చావడమే కాక- పెళ్ళాన్ని కూడా బతకనివ్వని వాణ్ణి వీడెక్కడి మొగుడండీ బాబూ... అని అంతా తిట్టుకుంటారు. సుజాతక్కకి అదే ఇష్టమైతే సరే సరి. మనం చెప్పాల్సిందేం లేదు" అని బాంబు పేల్చారు.

అక్కడున్న అందరికీ కూడా ఆలోచనల్లో ఈ కోణం కొత్తది. వెంటనే అది చర్చనీయాంశమైంది.

పెళ్ళయ్యాక భార్యకు భర్తపట్ల అంకితభావమేర్పడి తన వ్యక్తిత్వాన్ని కోల్పోతుంది. భర్త లేకుంటే ఆమెకు వ్యక్తిగా తనపై తనకే ఆసక్తి నశిస్తుంది. అది న్యాయమేనన్నారు కొందరు.

పెళ్ళి వ్యక్తిత్వవికాసానికి దోహదం చేయాలి. వ్యక్తిత్వాన్ని నాశనం చేస్తే పెళ్లి నిరసించదగ్గ తంతు ఔతుందన్నారు కొందరు.

"ప్రతి మనిషికీ తన వ్యక్తిత్వమే తోడు. తన అర్హతలే తోడు. తన సామర్థ్యమే తోడు. తన ప్రజ్ఞాపాటవాలే తోడు. ఈ తోడునించి మనిషిని దూరంచేసే ఏ తోడూ గొప్పది కాదు... అది పెళ్లి ద్వారా లభించిన తోడైనా సరే" అన్నారాయన.

అంత గొప్ప భావాన్ని అంత స్పష్టంగా ఆయన చెప్పిన విధానం ఆ క్షణంలో అందర్నీ ప్రభావితం చేసింది. సుజాత కూడా ప్రభావితురాలైందని ఆ తర్వాత జరిగిన సంఘటనలు చెప్పాయి.

అక్కణ్ణించి కదిలేముందు రఘువీర్ తనకు తనుగా మా వారిని పరిచయం చేసుకున్నాడు. మాటల్లో ఒకరి గురించి ఒకరు తెలుసుకున్నారు. రఘువీర్ ఆయనకు కార్లో లిఫ్టిచ్చాడు.

"మీరు మా ఆవిడ కాలేజీ ఫ్రెండు కాబట్టి మా ఇంటికి రావాలి. తను చాలా సంతోషిస్తుంది" అంటూ ఆయన రఘువీర్‌ని మా ఇంటికాహ్వానించారు.

"సారీ, రాలేను. ప్రస్తుతం నేను పాత స్నేహాలను పునరుద్ధరించడం లేదు" అన్నాడు రఘువీర్.

"ఐతే మరి నన్నెందుకు పలకరిం

చారు? "

"మీరు చాలా గొప్పగా మాట్లాడారు"

"మాట్లాడనిస్తే ఎవరైనా గొప్పగానే మాట్లాడతారు. మీకో సీక్రెట్ చెబుతున్నాను... వినండి. వినేవాడికి ఏం చెబితే నచ్చుతుందో అదే మనం సలహాగా ఇవ్వాలి. అప్పుడు వాడు మనకు అడ్మైరింగ్ లుక్స్ ఇస్తూ మరీ వింటాడు. ఈ రోజు నేను చేసిందీ అదే!"

"ఏమో... నాకలా అనిపించలేదు. సమస్య మిమ్మల్ని కలవరపరిస్తే... మథనపడి మథనపడి కనుక్కున్న పరిష్కార మార్గాన్ని చెప్పారనిపించింది" అన్నాడు రఘువీర్.

"మీకు తెలియక అలాగనుకుంటున్నారు కానీ మనమంత సీరియస్ టైపు కాదు లెండి" అన్నారాయన.

"అదీ తెలుస్తోంది. భార్యపోతే టింగురంగా అంటూ తిరిగేవాళ్ళను నిరసిస్తూనే తోడు వ్యక్తిత్వాన్ని చంపకూడదని నొక్కించారు" అన్నాడు రఘువీర్.

ఆయన అనుమానంగా అతణ్ణి చూసి, "మీరు దేనికో హర్టైనట్లున్నారు గురూగారూ" అన్నారు.

"నా భార్యపోయి అయిదు నెలలైంది. నన్ను చూస్తే తెలుస్తూనే ఉంటుంది. టింగురంగా అంటూ తిరుగుతున్నానని" అన్నాడు రఘువీర్.

"వెరీ సారీ గురుగారూ! సుజాతక్క సమస్యను గ్లోరిఫై చెయ్యాలనుకోవడంలో నా నోరు జారింది" సంజాయిషీ ఇచ్చారాయన.

"మీ ఉద్దేశమేమైనా మీ మాటలు నన్ను బాణాలై గుచ్చుకున్నాయి"

"ఐతే సరే... ఇక సారీ చెప్పను. మీరేం చెప్పమంటే అదే చెబుతాను"

"కానీ ఇప్పుడు సారీ చెప్పడం నా వంతు. ఈ రోజు మీ ఉపన్యాసంలో రెండో భాగం నన్ను బాగా సమర్థించింది. అందుకింతవరకూ థాంక్సు చెప్పలేదు. సారీ!" అని నవ్వేసాడు రఘువీర్...

"అప్పుడిద్దరం విడిపోయాం. విడిపోయినప్పుడు తెలియదు- మళ్ళీ తొందరలోనే కలుసుకుంటామని" అన్నాడు రఘువీర్.

మావారి గురించి నాకు తెలియని కథ ఇది. కుతూహలంగా, "ఎలా కలిసారు? " అన్నాను.

"మీవారు నాకు పెళ్లి ప్రపోజల్ తెచ్చారు" అన్నాడు రఘువీర్.

"చీటికీ మాటికీ వీళ్ళకూ వాళ్ళకూ సంబంధాలు చెబుతూంటానని ఆయన నన్ను పెళ్ళిళ్ళ పేరమ్మని ఆటపట్టించేవారు. మరాయన పెళ్ళిళ్ల పేరయ్య ఎప్పుడయ్యారూ? " సందేహం, ఆశ్చర్యం, కుతూహలం కలగలిసిన స్వగతమది. కానీ పైకే అన్నాను.

"అప్పటికి నా భార్యపోయి ఇంకా ఆర్నెల్లు కాలేదు"

"ఏ సంబంధం చెప్పి ఉంటారబ్బా? " ఆలోచనలో పడ్డాను.

"చూసారా... ఈ విషయాన్నీ మీరు కాజువల్‌గానే తీసుకున్నారు" అన్నాడు రఘువీర్.

"అంటే? " అన్నాను అర్థం కాక.

"ఉదాహరణకు మిమ్మల్నే తీసుకోండి. మీ నాన్నగారు మీకు పెళ్లి సంబంధాలు చూస్తున్నారా ఇప్పుడు? "

ఆ ప్రశ్న బాంబులా పేలింది. నోట మాట రాలేదు నాకు.

"అయ్యో- అలాగైపోయారేమిటి? నా విషయంలో కాజువల్‌గా తీసుకున్నారు కదా... మీ విషయంలోనూ కాజువల్‌గా తీసుకుంటారనుకున్నాను" అన్నాడు రఘువీర్.

నాకిది మరో షాక్. రఘువీర్‌కి పెళ్లి సంబంధమనగానే ఎవరై ఉంటారా అని

ఆలోచించాను. నాకు పెళ్లి సంబంధమన గానే అదేదో వినకూడని మాట విన్నట్లు ఫీలయ్యాను.

అతడికీ పిల్లలున్నారు. నాకూ ఉన్నారు. భార్య లేక అతడు మరో వివాహం చేసుకుంటే అది సహజమైంది. పరిస్థితులు నన్ను ఒంటరిని చేస్తే మరో వివాహం నాకు తప్పయింది. ఎందుకు?

తప్పు సమాజానిది కాదు. ఎందుకంటే సమాజంలో ఇప్పటికే కొందరు పిల్ల తల్లులు పునర్వివాహాలు చేసుకుని చెప్పుకోతగ్గ ఒడిదుడుకులు లేకుండా జీవితాలు గడిపారు. సమాజం వారిని వేటాడలేదు. వెంటాడలేదు.

ప్రతి సమాజంలోనూ నాస్తికులుంటారు.

కొత్తగాలి...

**యాత్ర అంటే**
**ప్రయాణం కాదు**
**నీలోకి**
**నువ్వుగా వెళ్లే ప్రవాహం**

*- ఎస్. ఆర్. భల్లం, తాడేపల్లిగూడెం*

నాస్తికత్వం వారి సాంఘిక జీవనానికి అడ్డు రాదు. ఐనా ఏ సమాజంలోనైనా వారి సంఖ్య తక్కువే. ఎందుకంటే ఆస్తికత్వంలో నాస్తికత్వానికి మించిన ఆకర్షణ ఉంది. దైనందిన జీవితంలో అస్తికత్వం నాస్తికత్వాన్ని మించిన సదుపాయాలిస్తుంది.

అదేవిధంగా ప్రతి సమాజంలోనూ మహిళలు కొన్ని విషయాల్లోనైనా పురుషులకు భిన్నంగా ఉండడానికి ఇష్టపడతారు. మన సమాజంలోనూ పునర్వివాహం విషయంలో మహిళల ఆలోచనలు పురుషులకు భిన్నంగా ఉంటాయి. అందుక్కారణం పిల్లలే కావచ్చు. వాళ్లు సవతి తల్లిని ఇష్టపడకపోవచ్చు కానీ భరిస్తారు. సవతి తండ్రిని భరించలేరు. అదీకాక స్త్రీ ప్రేమలో అంకితభావం ఎక్కువ. పురుషుడు భార్య ఉన్నా తనకు తానుగానే పరస్త్రీ వెంటపడగలడు. స్త్రీ తన వెంటపడిన పరాయి పురుషుణ్ణి జుగుప్సాభావంతో చూసే సందర్భాలే ఎక్కువ. పురుషుడి అక్రమ సంబంధంలో ప్రయత్నమూ, కాంక్షా ఉంటాయి. స్త్రీ అక్రమ సంబంధానికి అసహాయతో, అమాయకత్వమో ఎక్కువగా కారణమవుతుంటుంది.

"ఏమిటాలోచిస్తున్నారు? మన సమాజంలో పురుషాధిక్యతకు పురుషులు మాత్రమే బాధ్యులు కారు. మనకు రాజరికం పోయి ప్రజాస్వామ్యమొచ్చినా-ప్రజలు ప్రజాస్వామ్య పద్ధతిలోనే రాజరికాన్ని ప్రోత్సహిస్తున్నారు. అలాగే ఆధునికత సరిసమానతను ప్రతిపాదించినా మహిళలు తామే పురుషాధిక్యతకు కొమ్ము కాస్తున్నారు. అందుకే మీరు నా విషయంలో కాజువల్‌గా తీసుకున్న విశేషాన్నీ మీ విషయంలో..."

ఒప్పుకుందుకు అహం అడ్డొచ్చింది. అందుకే అతణ్ణి మధ్యలో ఆపి, "అదేం కాదు. ఉన్నట్లుండి మీరు మన సంభాషణలోకి మా నాన్నగార్ని తీసుకొచ్చారేమిటా అని ఆలోచిస్తున్నాను" అన్నాను.

"నేను తీసుకుని రాలేదు. ఆయనే వచ్చారు" అన్నాడు రఘువీర్.

"అదెలా?"

"చెబితే మళ్ళీ షాక్ తింటారు. అయినా చెప్పక తప్పదు. సంబంధం చెప్పి నన్ను కదపమని మీ వారిని నా దగ్గరకు పంపింది మీ నాన్నగారే!"

అవాక్కైపోయాను.

నాన్న రఘువీర్‌కి సంబంధం చూసారని నేను షాక్ తినలేదు. ఎందుకంటే అమ్మా

నాన్నలు ఎందరో వృద్ధకన్యలకు రెండో పెళ్ళి సంబంధాలు చెప్పి పుణ్యం గడించారు. అది వారికి మామూలే! అంతే కాదు... పెళ్ళి సంబంధాలు చూడ్డం వాళ్ళకు హాబీ కూడా. వాళ్ళ పేరు చెప్పి ఎన్నో మొదటి పెళ్ళి జంటలు కూడా సుఖంగా జీవిస్తున్నాయి. అలాంటివారికి మొదటి పెళ్ళి వరులు దొరకడం కష్టమని ప్రాక్టికల్‌గా ఆలోచించడం వల్ల కానీ- వృద్ధకన్యలకు రెండోపెళ్ళి సంబంధాలు చూడాలన్న నియమమూ వాళ్ళకు లేదు.

ఇప్పుడు రఘువీర్ చెప్పేదాకా ఈ విషయంలో స్త్రీ పురుషుల అంతరాలకు సంబంధించిన జీవన్మరణ సమస్య ఒకటున్నదని నాకు తోచలేదు. ఐనా అతడు చెప్పిన విశేషానికి కాక... చెప్పిన పద్ధతి నాకు షాక్ కొట్టించింది.

నాన్న రఘువీర్‌కి సంబంధం చూసారు. నాకు చూడాలని ఆయనకు స్ఫురించలేదు. ఆయనకు స్ఫురించలేదని రఘువీర్ చెప్పేదాకా నాకూ స్ఫురించలేదు.

నేను పునర్వివాహాన్ని కోరుతున్నానా అన్నది కాదు సమస్య. ఇది మన వ్యవస్థకు సంబంధించిన ఓ కఠోర సత్యం.

ఎలాగో షాక్‌నించి తేరుకుని, "ఇంతకీ మీరు మా వారికి బదులేమిచ్చారు?" అన్నాను.

"అది తెలుసుకోవాలంటే మీరు నా బెడ్రూంలోకి రావాలి" అంటూ లేచాడు రఘువీర్- కాదు కాదు రాఘవి.

నేను లేచి తన బెడ్రూంవైపు వెడుతున్న అతడిననుసరించాను.

ఎదుటివారి సంస్కారంపట్ల నమ్మకం కుదిరితే మనం వారిని గుడ్డిగా అనుసరించగలుగుతాం. అది మహాత్ములకే కాదు- నిత్య జీవితంలో సామాన్యులకూ వర్తిస్తుంది. అందుక్కారణం- సామాన్యులు మహాత్ముల్లా మసిలే ఘట్టాలు అరుదేమీ కాదు.

నేను నిస్సంకోచంగా అతడిననుసరించి బెడ్రూంలోకెడితే-

ఆ గదిలో గోడలు నాలుగు, ఒకో గోడకు నాలుగేసి చొప్పున మొత్తం పదహారు పటాలు తగిలించి ఉన్నాయి. వాటిలో ఒక్కటీ దేవుడిది కాదు. అన్నీ ఒకే ఒక స్త్రీమూర్తివి.

"ఇవి దేవతవి. నా హృదయాధిదేవతవి" అన్నాడు రఘువీర్.

ఆ స్త్రీమూర్తి రఘువీర్ భార్య అని చెప్పకనే ఊహించాను. వివిధ దశల్లో ఆమె రూపాన్ని ప్రదర్శించే ఆకర్షణీయమైన పటాలవి. అవికాక...

మంచానికి పక్కగా గోడపైన ఓ పెద్ద పోస్టరు. అదీ ఆమెదే.

"మంచంమీద పడుకుని అటే చూస్తే ఆమె నన్ను పలకరిస్తుంది. ఆమె కబుర్లలో నాకు టైం తెలియదు. "ఆ విషయమే మీ వారికి చెప్పాను" అన్నాడతను.

అబ్బురంగా చూస్తున్నాను. అతణ్ణి కాదు, ఆ గదిని!

అది ఆ భార్యాభర్తల ఏకాంత జీవితానికి పరిమితమైన జ్ఞాపకాలను భద్రం చేసిన మ్యూజియం. ఆమె లేకపోయినా అతడక్కడ ఆమెతో జీవిస్తున్నాడు ఎప్పటిలా మామూలుగా!

"మాది పెద్దలు చేసిన పెళ్ళికాదు. ప్రేమించి పెళ్ళి చేసుకున్నాం. ఇరువైపులా పెద్దలు మమ్మల్ని చీదరించారు. మేము చలించలేదు. ఒకరికొకరు తోడైతే ప్రపంచాన్నే ధిక్కరించగలమనుకున్నాం. ధిక్కరించాం. క్రమంగా ఇరుపక్షాల వాళ్లు దిగి వచ్చారు. మాతో కలిశారు. కానీ విధి మమ్మల్ని విడదీస్తే ఇరుపక్షాల్లోనూ మూర్ఖత్వం మళ్ళీ పురి విప్పింది. పెద్దల మనసు క్షోభ పెట్టినందుకే మాకీ గతి పట్టిందన్నారు. మావాళ్ళైతే ఇకనైనా ఆమె

జ్ఞాపకాలు చెరిపేసి- తాము మెచ్చేలా మళ్ళీ పెళ్ళి చేసుకోమన్నారు. ప్రేమ పెళ్లిళ్లు శాశ్వతం కాదన్నారు. అది నేను సవాలుగా తీసుకున్నాను. పెళ్లి చేసుకున్నందుకు పెద్దలు నన్ను నిరసిస్తే- మళ్ళీ పెళ్ళి చేసుకోమన్నందుకు నేను పెద్దల్ని నిరసించాను. ఊరు మారాను. పూర్వంకంటే వైభవంగా, ఉత్సాహంగా జీవిస్తూ పెద్దలే నన్ను చూసి సిగ్గుపడేలా చేసాను. వాళ్ళే వచ్చి మళ్ళీ నాతో కలిసారు. ఇప్పుడిక నా పెళ్ళి గురించి సూటిగా నాతో మాట్లాడే సాహసం చెయ్యరు..." ఆగాడతడు.

నాకు ఆశ్చర్యంగా ఉంది. అతడామెను ప్రేమించాడు. పెళ్ళి చేసుకుందుకు పెద్దల్ని ఎదిరించాడు. ఆమెను మనసునిండా నింపుకున్నాడు. అతడి ప్రేమలో అంకిత భావముంది. ఆమె లేకపోయినా అతడింకా ఆమెనే ప్రేమిస్తున్నాడు. పరస్త్రీని తన జీవితంలోకి ఆహ్వానించాలన్న ఆలోచనే లేదతడికి. పురుషుల్లో ఇలాంటి వారుంటారా?

"మీ గురించి మావారేమన్నారు? "

"మీ వారు సూటిగా మాట్లాడతారు. అతడు నాతో అన్న మాటలు మరొకరైతే అనలేరు"

ఆగాడతడు. నేనూహించడానికి ప్రయత్నిస్తున్నాను. ఈలోగా అతడే చెప్పేసాడు.

"ఏమీ అనుకోకండి రఘువీర్! మీరు చాలా ఉత్సాహంగా ఉన్నారు. మీ శక్తి సామర్థ్యాలకు పూర్తి న్యాయం చేకూరుస్తున్నారు. మిమ్మల్ని చూస్తే అత్యంత ఆప్తులైన వారిని పోగొట్టుకున్నారన్న భావం కలుగదు. దిగులు, నీరసం బొత్తిగా కనపడనివ్వని మీరు- చనిపోయిన భార్యను ఇంతగా ప్రేమించారని చెప్పినా నమ్మడం కష్టం"

అదీ మావారు అతడితో అన్నమాట. ఆయనంతటివారేనని నాకు తెలుసు. ఎదుటివాళ్ళని ఎంతమాటనడానికైనా వెనుకాడని ఆ నిర్భయత్వం- నాకు చాలాసార్లు ఇబ్బందిగా అనిపించినా... అందులోనూ ఏదో బలమైన ఆకర్షణ ఉంది. మరి రఘువీర్ ఏమనుకున్నాడో?

"మీరేమన్నారు? " అడిగాను.

"నాకూ నా భార్యకూ కూడా వివాహానికి ముందూ, జీవితంలో గుర్తుంచుకోతగ్గ అనుభూతులున్నాయి. ఇద్దరికీ చెప్పుకోతగ్గ శక్తి సామర్థ్యాలున్నాయి. మేమిద్దరమూ అవే మాకు అసలు సిసలు తోడనుకున్నాం తప్ప ఒకరికొకరం తోడు అని ఎప్పుడూ అనుకోలేదు. మా వ్యక్తిత్వాలను కాపాడుకుంటూ, పరస్పరావగాహనను పెంపొందించుకుంటూ సామరస్యంతో జీవించాలనుకున్నాం. జీవించాం. దురదృష్టంకొద్దీ అకాలమృత్యువామెను కాటేసింది. ఆమె లేకపోవడం నాకు తీరని లోటు. ఆమెపై నాకున్న ప్రేమ తరగని గని. అలాగని జీవితంలో కొన్ని సుఖాలకు దూరమైనా జీవితానికే దూరం కాలేము కదా! నాకు తోడుగా ఉన్న శక్తి సామర్థ్యాలను అలక్ష్యం చేస్తే నా జీవితం ఆమెకోసం మాత్రమే అనిపించుకుంటుంది. మనిషికి ప్రేమానుబంధాలు స్వంతానికి. జీవితం మాత్రం సమాజానికి. ప్రతి మనిషికి సమాజంపట్ల బాధ్యత ఉంది. అదీ నా అభిప్రాయం. అదే నేను మీ వారికి చెప్పాను" అన్నాడు రఘువీర్.

అది నిజం. మనిషికి తోడు మనిషి కాదు. సుజాత దుస్థితికి చలిస్తూ, "ప్రతి మనిషికి తన వ్యక్తిత్వమే తోడు. తన అర్హతలే తోడు. తన సామర్థ్యమే తోడు. తన ప్రజ్ఞాపాటవాలే తోడు. ఈ తోడునించి మనిషిని దూరంచేసే ఏ తోడూ గొప్పది కాదు. అది పెళ్ళి ద్వారా లభించిన తోడైనా సరే" అన్నారాయన. ఆ సందేశం చాలా గొప్పది. అదే రఘువీర్ మళ్ళీ

ఆయనకు చెప్పాడు.
"అప్పుడాయన ఏమన్నారు? "
"మీవారు నాకు సారీ చెప్పారు" అన్నాడు రఘువీర్.
ఆయన సారీ చెప్పారా? అసలలాంటి అలవాటాయనకుందా? ఎన్నోసార్లు సారీ చెప్పాల్సొచ్చినా తన వాక్చాతుర్యంతో తప్పించుకునేవారాయన.
"ఆ తర్వాత? "
"మేమిద్దరం మంచి స్నేహితుల మయ్యాం"
ఆ తర్వాత కాసేపు మా మధ్య మాటలు లేవు. అతడు చెప్పాల్సిందేమీ లేదనుకుని, "ఇదేనా మీరు నన్ను మీ ఇంటికి పిలిచి చెప్పాలనుకున్న విశేషం? " అన్నాను. ఆశ్చ ర్యంగా నా గొంతులో కోపం, విసుగు, ఎగ తాళి, వ్యంగ్యం వగైరాలు పలకలేదు. ఏదో సందేహనివృత్తికన్నట్లు అడిగాను.
అతడు తల అడ్డంగా ఊపి, "ఆరేళ్ళ క్రితం మాట. ఇప్పుడు చెబుతాను" అన్నాడు. ఆ గొంతులోనూ ఏ భావమూ లేదు. నా సందేహ నివృత్తికన్నట్లుంది.
ఆయనకు రఘువీర్ మనస్తత్వం, జీవన విధానం బాగా నచ్చాయి. ఓ రోజున ఆయన అతణ్ణి మెచ్చుకుని, "స్వార్థంతో ఇతరులను పొగడను. మిమ్మల్నిప్పుడు నా స్వార్థానికి ఉపయోగించుకోవాల్సిన అవ సరం పడితే అది కాకతాళీయం" అన్నారు.
"చెప్పండి" అన్నాడు రఘువీర్.
"నా భార్య పేరు కాసులమ్మ. ఆ పేరు నచ్చక ఇంట్లో పోరిపోరి వికాసిని అన్న పేరును సాధించింది. కాసులమ్మ ఆమె బానిస మనస్తత్వానికి గుర్తు. వికాసిని ఆమె వ్యక్తిత్వం. ఆ వ్యక్తిత్వానికున్న శక్తిసా మర్థ్యాలు మీకు తెలుసు. ఒకే కాలేజిలో చదివారు కదా!" అన్నారాయన.
"నాకు వికాసిని తెలుసు. కాసులమ్మ తెలియదు. దూరపు స్నేహితుణ్ణి కదా!" అన్నాడు రఘువీర్ నవ్వుతూ.
"నేను వికాసినిని తెలుసుకుందామని ప్రయత్నించాను. కానీ ఆమెలో నాకు కాసు లమ్మ తప్ప ఇంకెవ్వరూ కనపడలేదు" నిట్టూర్చారాయన.
"అర్థమయ్యేలా చెప్పండి" అడిగాడు రఘువీర్.
"స్వేచ్ఛను ఇష్టపడే నాకు బాధ్యత అంటే నిరసన భావం. వ్యక్తులను ప్రేమించే నేను వ్యక్తిత్వాలను మాత్రమే ఆరాధించగలను. నా భార్యను నేను బాధ్యతగా స్వీకరిం చాను. ఆమె నా ప్రేమకే తప్ప ఆరాధనకు అందలేదు"
"అంటే? "
"వికాసినిగా మారిన కాసులమ్మ అందు కోసం తాను పడిన శ్రమనంతా బూడి దలో పోసిన పన్నీరు చేసింది. పెళ్ళి కాగానే ఆమె తిరిగి కాసులమ్మగా మారిపో యింది"
రఘువీర్ ఆశ్చర్యంగా, "ఆమె ఒక సాధా రణ గృహిణిగా మిగిలిపోయిందని మీ భావమనుకుంటాను. అందుకు మీరే కార ణమేమో ఆలోచించలేదా? " అన్నాడు.
"ఆమె వికాసిని. తను వికాసినిగా కొన సాగడానికీ, కొనసాగకపోవడానికి వేరొకరి ప్రమేయముంటుందా? " అన్నారాయన అతడివంక అదోలా చూస్తూ.
"అంటే మీరు వికాసిని వ్యక్తిత్వాన్ని చాలా ఎత్తులో ఊహించుకుంటున్నారు. కానీ నా అభిప్రాయంలో మనదేశంలో ఏ ఆడదీ భర్త సహకారం లేనిదే తన వ్యక్తి త్వాన్ని నిలుపుకోలేదు" అన్నాడు రఘు వీర్.
"మన సంభాషణ పక్కదారి పడు తోంది. మీ అభిప్రాయంలో మన దేశంలో ఆడవాళ్ళ వ్యక్తిత్వ వికాసానికి భర్తల సహ కారం కావాలి. కానీ అదే దేశంలోని సగటు భర్త వ్యక్తిత్వం కూడా ఆ ఆడవా

ళ్ళకు తగినట్లే ఉంటుంది కదా! దోపిడికి తల వంచమని మహిళలకు ప్రబోధించే ఈ వ్యవస్థలో భార్యల తలలు వంగి ఉండాలనుకునే భర్తలూ సహజమే. మన మిక పాత రోజులు మరచి వ్యవస్థను పక్కకునెట్టి వ్యక్తులు వ్యక్తులుగా వ్యక్తిత్వాలకు మెరుగులు దిద్దుకోవాల్సిన సమయం వచ్చిందని నా ఉద్దేశం"

"ఏమో" అన్నాడు రఘువీర్ అనుమానంగా.

"నాకేం అనుమానం లేదు. ఇప్పటి ఆడపిల్లలను చూస్తుంటే నాకు ముచ్చటేస్తోంది. పూర్వం ఆడపిల్లల చదువంటే ఆర్ట్సు కాలేజిలోనో, సైన్సు కాలేజి ఐతే బోటనీ, జువాలజీ సబ్జక్ట్సుతోనో ఉండేది. ప్రొఫెషనల్ ట్రైనింగంటే ఎక్కువగా టీచర్లూ, నర్సులూ తక్కువగా డాక్టర్లూ ఉండేవారు. చదువైనా ఉద్యోగమైనా ఉన్న ఊరికి దగ్గర్లో ఉండాలనుకునేవారు. పెళ్ళి కాని వాళ్ళే పీజీలు చేసేవారు. అలాంటిదిప్పుడు ఆడపిల్లలు ఇంజనీరింగు చదువుతూ మగపిల్లలతో పోటీపడి వారికంటే ముందుంటున్నారు. పెళ్ళికంటే ఉద్యోగానికే ప్రాముఖ్యాన్నిస్తున్నారు. ఒంటిగా విదేశాలు వెళ్ళొస్తున్నారు. తమకంటూ జీవితమొకటి ఏర్పరుచుకుంటున్నారు"

"ఇదంతా నాకెందుకు చెబుతున్నారు?"

"ఆడవాళ్ళ సామర్థ్యం అప్పుడూ ఇప్పుడూ ఒక్కలాగే ఉంది. దృక్పథంలోనే మార్పొచ్చింది. అప్పటి ఆడవాళ్ళకి పెళ్ళే పరమావధి. ఇప్పటివాళ్ళకి అదో సదుపాయం"

"నిజమే..." అన్నాడు రఘువీర్.

"జీవితంలో పెళ్ళి ఒక సదుపాయం మాత్రమే. పెళ్ళే జీవితం కాదు. కాసులమ్మను వికాసినిగా చూడాలని పెళ్ళి కుదిరినప్పట్నించీ మనసుపడ్డాను. కానీ..."

రఘువీర్ ఆయన ముఖంలోని నిరాశను అంచనా వేస్తూ "అందుకు మీరు చేసిన ప్రయత్నాలేమిటో నేను తెలుసుకోవచ్చా?" అన్నాడు.

"నేను మనుషుల్ని రెచ్చగొట్టగలను. వాళ్ళలో పట్టుదల రేపగలను. మా విషయానికొస్తే... వికాసినిని నేనే కాసులమ్మగా మార్చాను. వికాసిని ఊసెత్తొద్దన్నాను. పై చదువులొద్దన్నాను. ఉద్యోగం చెయ్యొద్దన్నాను. ఇంటికి నేనే బాస్నన్నాను. తను నాకు దాసి అన్నాను. నేను చెప్పింది నోరెత్తకుండా చెయ్యాలన్నాను"

"ఘోరం" అన్నాడతడు.

"కానీ అంతకంటే ఘోరం మా ఇంట్లో జరిగింది. నా భార్య దేనికీ ప్రతిఘటించ లేదు. నేను మాటంటే మాటకు మాట అనేదే తప్పు- తన వ్యక్తిత్వాన్ని నిరూపించుకునే సవాలు స్వీకరించలేదు. ఆమె గ్రాడ్యుయేట్. వివిధ రంగాల్లో ప్రావీణ్యమున్న వ్యక్తి. కానీ తన రాణింపుకు పూర్తిగా నామీదే ఆధారపడింది" నిట్టూర్చాడాయన.

"అది తెలిసి మీరామెను మార్చడానికి మరో పద్ధతిలో ప్రయత్నించాల్సింది"

ఆయన నవ్వి, "ఒకర్ని ప్రోత్సహించడం నాకు చేతకాదు. నాకు చేతనైనదల్లా రెచ్చకొట్టడమే. అది కొందరి మీద పని చేస్తుంది. కొందరిపైన పనిచేయదు. నేనే ప్రయత్నం చేసినా అది నా పరిధికి లోబడే వుంటుంది" అన్నారు.

"అలాగంటే మీ బాధ్యత తీరిపోదు. ఇంత చక్కగా ఆమె వ్యక్తిత్వాన్ని విశ్లేషించగలిగిన మీకు- వేరే ఉపాయాలు తెలియవంటే నమ్మడం కష్టం" ఆయనంత సూటిగానూ అన్నాడతడు.

"నేను మిమ్మల్ని నమ్మించే ప్రయత్నం చెయ్యను. కానీ నా పరిమితజ్ఞానానికి సంబంధించినంతవరకూ నా భార్య నాకు బాధ్యత. ఆమె వ్యక్తిత్వం ఆమె బాధ్యత" అన్నారాయన.

"బహుశా మీరన్న మాటలకు వేదాంతు లైతే లోతైన చర్చలు జరిపేవారేమో! నాకు సంబంధించినంత వరకూ ఒక్కటే సందేహం- మీ బాధ్యతా నిర్వహణపట్ల మీకు తృప్తి ఉందా? " అన్నాడతడు.

"నేను దూరమైతే ఏ లోటు లేకుండా చూసుకునే తల్లిదండ్రులు, అత్తమామలు ఆమెకున్నారు. అయినప్పటికి- ఆమెకు ఆర్థిక ఇబ్బందులేమీ లేకుండా నా తరుపు నుంచీ ఏర్పాట్లు చేస్తున్నాను. ఆ మేరకు నా బాధ్యతా నిర్వహణపట్ల తృప్తిగానే ఉన్నాను"

"ఐతే సమస్య ఏమిటి? "

"జీవితాన్ని భర్తతోనే ముడేసుకోవడం వల్ల ఆ భర్త దూరమైతే స్త్రీకి జీవితం శూన్యమైపోతుంది. మీకు డాక్టర్ జెకిల్ అండ్ మిస్టర్ హైడ్ కథ తెలిసే ఉంటుంది. అందులో డాక్టర్ జెకిల్ పెద్ద మనిషి, సహృదయుడు, శాంతికాముకుడు, అందగాడు, ఎత్తరి. ఆయన ఓ మందు తాగినప్పుడల్లా హైడ్‌గా మారిపోతుం టాడు. ఈ హైడ్ పొట్టిగా ఉంటాడు. అనాకారి. దుష్టుడు, నేరాలు చేస్తుంటాడు. మనిషిలోని విభిన్న వ్యక్తిత్వాలకు అద్దం పట్టే ఈ గొప్ప నవల మనదేశంలోని స్త్రీలకూ వర్తిస్తుంది. ఎంతో సమర్థురాలైన ఓ వికాసిని పెళ్లి అనే మందు తాగి కాసు లమ్మగా మారిపోయిందంటే- మీకు విషయం అర్థమయ్యే ఉండాలి"

"మీ ఆవేదన నాకర్థమైంది. సమస్యే మిటో ఇంకా తెలియలేదు" అన్నాడు రఘు వీర్.

"అదీ చెబుతాను. అదొక విచిత్ర విషా దగాథ" అన్నారాయన...

అప్పటికి సంవత్సరం క్రితం మా వారు ఆఫీసు పనిమీద వెళుతుండగా ట్రైన్లో ఓ సాధువు కలిసి, "నీ ముఖ లక్షణాలు చెబు తున్నాయి, నువ్వు సత్పురుషుడివి" అన్నాడు.

మా వారు వెంటనే తన ధోరణిలో, "నా దగ్గర నీకు టీ పోయించడానికి సరిపడే డబ్బులే ఉన్నాయి. టికెట్ కలెక్టర్ పట్టు కుంటే ఫైన్ కట్టడానికైతే మరో సత్పురు షుణ్ణి వెతుక్కోవడం మంచిది" అనేసారు.

"నిస్సంకోచంగా నీ మనసులోని మాట చెప్పావు. అందుకు నిన్ను నేను తప్పు పట్టను. ఐతే నేను నువ్వనుకున్నలాంటి సాధువును కాదు. నా దగ్గర టిక్కెట్టుంది.




నేను యాచన చేయను. ఆ పరమాత్మ తన సందేశాన్ని వినిపించడానికి మన ల్నిలా కలిపాడేమో" అంటూ సాధువు ఆయన గతానికి సంబంధించిన కొన్ని విశే షాలు చెప్పాడు.

"థాట్ రీడింగా? " అన్నారు మా వారు.

"ప్రస్తుతానికి అపనమ్మకాన్ని విడిచిపెట్టి నేను చెప్పేది శ్రద్ధగా విను. నీ ఆయువు కొద్ది సంవత్సరాలే ఉంది. నేనొక ఆధ్యా త్మిక సంస్థ వివరాలిస్తాను. అందులో చేరితే మరణమాసన్నమౌతోందన్న భావన నిన్ను బాధించదు" అన్నాడు సాధువు.

"అనుకున్నాను. నేను నిన్ను ఎగతాళి చేసానని శపిస్తున్నావు కదూ? " అన్నారా యన.

"నువ్వు నన్ను ఎగతాళి చేయలేదు. దొంగ సాధువులను విమర్శించావు. నువ్వు సత్పురుషుడివి. నేను సత్పురుషులను

శపించను. నేను నీకు నిజం చెప్పాను" అన్నాడు సాధువు.

"మరణం గురించి తెలిసినా ముందుగా చెప్పకూడదన్న నియమం మీకు లేదా? "

"ఉంది. నీవు సత్పురుషుడివని దాన్ని ఉల్లంఘించాను. ముందుగా నీకీ విషయం తెలిస్తే నీ కుటుంబానికి, సమాజానికి కూడా మేలు జరుగుతుందని నాకనిపించింది. ఇల్లు చేరగానే మంచి ఆస్పత్రికి వెళ్ళి అన్ని టెస్టులు చేయించుకో. నేను చెప్పిందే వాళ్ళు చెబుతారు. కానీ- వాళ్ళు నీ దగ్గర డబ్బు గుంజడానికి ప్రాణాలమీద ఆశ కల్పిస్తారు. ఏ వైద్యమూ నీకు ఆయువు పోయదని నా మాటగా నమ్ము. మృత్యు కౌగిలికి మానసికంగా సిద్ధపడు. పిలుపు రాగానే పరమాత్మ సన్నిధికి చేరుకో" అన్నాడు.

మా వారా మాటలను నమ్మలేదు. కానీ వాటి ప్రభావం కొంత ఉండటం వల్ల టూర్నించి తిరిగి రాగానే టెస్టులు చేయించుకున్నారు.

సాధువు చెప్పింది నిజమే. ఆయనకు ఇంకా సైన్సు అదుపుకు చిక్కని ఓ భయంకరమైన వ్యాధి. ఆయన ఆయువు ఇక ఏడు సంవత్సరాలు.

ఆయన సాధువు చెప్పిన ఆధ్యాత్మిక సంస్థలో చేరి చావుకోసం ఎదురు చూస్తున్నారు.

"మీ వారు నాకా విషయం చెప్పినప్పుడు గొంతులో తడిలేదు. కళ్ళలో నీళ్ళు లేవు. ముఖంలో బాధ లేదు. ఏ మాత్రం పరిచయంలేని మరో వ్యక్తి గురించి చెప్పినట్లు తన కథనాయన నాకు చెప్పారు" అన్నాడు రఘువీర్.

తెల్లబోయాను. తన భవిష్యత్ గురించి ఆయనకు తెలుసా? తెలిస్తే పొరపాటున కూడా నా దగ్గర ఆ ప్రస్తావన తేలేదేం?

ఎప్పుడైనా, "ఆ దేవుడి పిలుపు ఎవరికెప్పుడొస్తుందో సిద్ధంగా ఉండాలి" అనేవారు కానీ అలాంటి వేదాంతం అంతా చెబుతారు మరి.

ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ ఉండేవారు. పోయేనాటికి ముందురోజు కడుపు నొప్పి అని హాస్పటల్లో చేరారు. ఒకే ఒక్క రోజున్నారు. అంతే ఆ తర్వాత ఈ ప్రపంచానికాయన శూన్యం. నాకీ ప్రపంచమే శూన్యం.

ఆస్పత్రిలో చేరే ముందురోజు కూడా తాను తిరిగొచ్చేక ఏం చేయాలనుకుంటున్నదీ చెప్పిన మనిషికి తన చావు గురించి ముందే తెలుసునంటే ఇప్పటికీ నమ్మడం కష్టం.

"ఆయన నాతో తను వేరే పెళ్ళి చేసుకోబోతున్నాననేవారు. ఆమె ఎవరో తను చెప్పకపోయినా చూచాయగా నాకు తెలుసు. ఆమె పేరు..." మీనాక్షి పేరు అతడికి చెప్పడం ఎంతవరకూ సమంజసమోనని తటపటాయించాను.

"మృత్యువు" అన్నాడు రఘువీర్.

ఉలిక్కిపడ్డాను.

రఘువీర్ చెమ్మగిల్లిన కళ్లను తుడుచుకుని "మీ నుండి తనను విడదీయగలిగింది మృత్యువు మాత్రమేనని మీవారి ఉద్దేశం. తన చావును మృత్యువుతో పెళ్ళిగా మార్చి మిమ్మల్ని హెచ్చరిస్తూండేవారాయన" అన్నాడు.

ఇరవై ఏళ్లకు పైగా ఆయనతో కాపురం చేసాను. ఇప్పుడర్థమౌతున్నారాయన నాకు.

ఆయన నన్ను దాసిగా కాక బాస్‌గా చూడాలని మనసు పడేవారు. నేను గాయనిగా, ఉద్యోగినిగా, విద్యాధికురాలిగా రాణించాలని ఆశపడేవారు. అందుకు తనకు తెలిసిన, నమ్మకమున్న ఉద్దాలకుడి ప్రయోగం చేసారు. అది ప్రయోగమని గ్రహించడానికి నాలో పౌరుషమన్నదే లేక

పోయింది.

రఘువీర్ గొంతు సవరించుకుని, "వ్యక్తిత్వాన్ని చంపుకున్న ఆడది పెళ్లి చేసుకుని తోడులేని చెలి అవుతుంది. భర్తను పోగొట్టుకుంటే సమాజానికామె తోడులేని చెల్లి అనిపించుకుంటుంది. మిమ్మల్ని ఆ దశ నుంచి తప్పించి హెచ్చరించడానికి మీ వారు నన్నెన్నుకున్నారు. ఎందుకంటే భార్య పోయినా ఆమెను మరిచిపోకుండా ప్రేమను కొనసాగిస్తూ- వ్యక్తిగా జీవితాన్ని కొనసాగిస్తున్న నేను మీ వారికి ఆదర్శంగా అనిపించాను" అన్నాడు

అది మూఢ నమ్మకమో, భయంకర సత్యమో.. తన చావు గురించి ఆయనకు ముందే తెలుసు. ఆ విషయాన్నాయన అయినవాళ్ళందరి వద్దా దాచినా- రఘువీర్‌కి మాత్రం చెప్పారు.

"మీరైనా మాకు ముందుగా చెప్పాల్సింది" అన్నాను నిష్ఠూరంగా.

"చెప్పనని మీ వారికి మాటిచ్చాను. ఆ మాట నిలుపుకోవడం కష్టమని.. నేను మీ ఇంటికి రానే రాకూడదన్న నియమం పెట్టుకున్నాను" అన్నాడు రఘువీర్.

ఉన్నట్లుండి ఉప్పెనలా పొంగుకొచ్చింది దుఃఖం. వెక్కివెక్కి ఏడ్చాను.

నేనంతలా ఏడుస్తానని అతడూహించినట్లు లేదు. నేనేడుస్తూంటే అతడు కళ్లు మూసుకుని మౌనం వహించాడు.

క్రమంగా నా దుఃఖం తీవ్రత తగ్గుతోంది. ఆలోచిస్తున్నాను.

ఒక్కరోజులో ఆస్పత్రినుంచి మాయమైన ఆయన మరణాన్ని నేను వాస్తవంగా స్వీకరించలేదు. ఆయనెక్కడికో వెళ్ళారనీ, తిరిగొస్తారనీ నన్ను నేను మభ్యపెట్టుకుంటూ తెలిసీ భ్రమలో ఉంటున్నాను. కానీ ఇప్పుడు నాలో వివేకం మేల్కొంది.

దుఃఖాన్నదుపు చేసుకున్నాను. చీర చెంగుతో కళ్లు తుడుచుకున్నాను. ఎదురుగా ఉన్న రఘువీర్‌ని చూసాను.

భార్యపై అతడి ప్రేమ అనన్య సామాన్యం. వ్యక్తిగా అతడి జీవితం అందరికీ ఆదర్శం.

"వస్తాను రఘువీర్! మీకు మా వారెప్పుడైనా తటస్థపడితే వికాసినితో మాట్లాడేననీ, ఆమె తనకు థాంక్స్ చెప్పిందనీ చెప్పండి" అన్నాను చటుక్కున.




సరిగ్గా ఏడాది తర్వాత...

ఓ రోజు రాత్రి తొమ్మిది గంటల సమయంలో...

బెడ్రూంలో బీరువా తలుపులు తీసి ఆయన ఫొటోని చూస్తున్నాను. ఆయన ముఖంలోని చిరునవ్వుకు పరవశిస్తూ కాసేపలాగే ఉండిపోయాను.

'ఎంతసేపలా మౌనం వహిస్తావు? చెప్పాల్సింది చెప్పు?' హెచ్చరించింది మనసు.

"నా సూచన సుమతి జీవితానికి అద్భుతమైన మలుపునిచ్చిందని ఈ రోజు నాకు సన్మానం జరిగిందండీ. ఆ సన్మాన సభలో ఎందరో నా బహుముఖ ప్రజ్ఞను పొగిడారు. మీ వికూకి బహుముఖ ప్రజ్ఞ ఏమిటని నవ్వకండి. నేనిప్పుడు పాటలు పాడుతున్నాను. వ్యాసాలు వ్రాస్తున్నాను. ఉపన్యాసాలిస్తున్నాను. అలాగని నేనేదో ఇంటర్నేషనల్ ఫేం అయిపోయాననుకో

వడం లేదు. ఏదో గంతకు తగ్గబొం తగా..." అంటూ ఆగాను.

ఫొటోలో ఆయన పెదాలు కదిలినట్లై చెవులు రిక్కించాను.

"ఏయ్- విక్కూ! పెళ్లికిముందు నీకీ బహుముఖ ప్రజ్ఞ ఉండేది. పెళ్ళి కాగానే పోయింది. నేను పోయాను. మళ్ళీ నీ ప్రజ్ఞ నీకు తిరిగొచ్చింది. నాది చాలా నెగెటివ్ కంట్రిబ్యూషన్ కదూ?"

"నో" అన్నాను, "ఇదే మాట బయట కూడా కొందరన్నారు. కానీ నా టాలెంట్ను మరుగున పడ్డానికి పూర్తిగా నేనే కారణం. దగ్గర లేకుండానే ఇప్పుడు మీరు మరుగునపడ్డ నా టాలెంట్ను బయటకు తెచ్చారంటే- అప్పట్లోనే నేను మిమ్మల్నుపయోగించుకునుంటే నిజంగా ఇంటర్నేషనల్ ఫేం అయిపోయుండేదాన్నేమో!"

నా గొంతు రుద్ధమౌతుంటే, "నో విక్కూ! నీ గొంతు ఏడ్చినా బాగానే ఉంటుంది. కానీ నువ్విప్పుడు మరీ ఎదుటే ఉన్నావు. ఏడిస్తే నీ ముఖం ఏడ్చినట్లే ఉంది. చూడలేను... ఆపేయ్... మన విక్కూ ఏమంటున్నాడో చెప్పు..."

"వాడో వెబ్ సైట్ డెవలప్ చేస్తున్నాడు. పేరు మీది. పరిచయం నాది" అన్నాను గొంతు సవరించుకుని.

"పేరు కోసమే కదా పెళ్ళి చేసుకున్నాను. పేరే మిగిలింది" నవ్వేరాయన.

కళ్ళు చెమ్మగిల్లితే చీర కొంగుతో ఒత్తుకుని ఏదో అనబోగా 'అమ్మా' అన్న పిలుపు నన్నాపింది.

"చంద్రిక కాబోలు వస్తోంది. తలుపులు మూసేయ్..." అన్నారాయన కంగారుగా.

"ఏం... వస్తే రానీండి. ఈరోజు అదీ మాట్లాడుతుంది మీతో. అన్నట్లు మీరు లేరని నన్ను మమ్మీ అనడం మొదలెట్టింది... ఇప్పుడు మళ్లీ అమ్మా అనే పిలుస్తోంది..."

"పిలవకేం చేస్తుంది... అది నా కూతురు. కానీ తలుపులు మూసేయ్ విక్కూ! నేనిప్పుడు చాలా సంతోషంగా ఉన్నాను. దాన్ని చూస్తే నాకు దుఃఖం పొంగుకొస్తుంది. ప్లీజ్... తలుపులు మూసేయ్..." ఆయన గొంతులో నేనెన్నడూ ఎరుగని అర్థింపు.

నేనింకా తటపటాయిస్తూంటే అదురుకో ఏమో ఫొటో కింద పడబోయింది. చటుక్కున ఆపి దాన్ని సరైన స్థానంలో ఉంచి, "హుం... నాతో కూడా లేని అనుబంధం మీకు దాంతో ఉంది" అని ఉక్రోషపడుతూ బీరువా తలుపులు మూసాను.

సరిగ్గా అప్పుడే లోపలకొచ్చిన చంద్రిక, "ఎవరితోనమ్మా మాట్లాడుతున్నావు" అంది.

"ఆం... ఏదో పాట ప్రాక్టీసులే కానీ- ఏమిటీ... ఈ టైములో వచ్చావు ?" అన్నాను.

"నీకో ఉత్తరమొచ్చింది. సాయంత్రం ఇద్దామనుకుని మర్చిపోయాను" అంటూ ఓ కవరందించి అక్కణ్ణించి వెంటనే వెనక్కెళ్ళిపోయింది చంద్రిక.

ఉత్తరం తీసుకుని దానిమీద చిరునామా చూస్తే కాసులమ్మని ఉంది. ఈ కాసులమ్మెవరు చెప్మా అని ఆలోచనలో పడ్డాను.

అప్పుడో విచిత్రం జరిగింది. బీరువా తలుపులు చటుక్కున వాటంతటవే తెరుచుకున్నాయి.

"హమ్మయ్య... నీవిక ఈ సమాజానికి తోడులేని చెల్లివి కాదు" అన్నారాయన.

ఆ వెంటనే బీరువా తలుపులు మూసుకున్నాయి.

నేనా విచిత్రం గురించి ఆలోచించడం లేదు. ఇంకా కాసులమ్మ ఎవరో గుర్తు చేసుకునే ప్రయత్నంలోనే ఉన్నాను. ©

# మే విజేతలు వీరే!

మే చతుర ప్రవేశికకు వచ్చిన అసంఖ్యాక స్పందనల్లో సరైన సమాధానాలు పంపి డ్రాలో విజేతలైన ఈ అయిదుగురికీ అభినందనలు. వీరికి త్వరలో బహుమతులు అందుతాయి.



1. జె. ఇందిర - ట్రూప్‌బజార్, హైదరాబాద్
2. బి. విజయలక్ష్మి - సరూర్‌నగర్, హైదరాబాద్
3. పి. రాఘవరెడ్డి - మహబూబ్‌నగర్
4. ఎస్.రాజరాజేశ్వరీదేవి - సరూర్‌నగర్, హైదరాబాద్
5. రంగు చక్రపాణి - హనుమకొండ, వరంగల్



## అన్ని సమాధానాలు సరిగా పంపిన ఇతరులు

1. ఎన్. సుబ్బారావు, గుంటూరు 2. వై. సూర్యపద్మావతి, చెల్లూరు 3. పులి శ్రావణ్‌కుమార్, ముల్కలపల్లి, వరంగల్ జిల్లా 4. పారుపల్లి వెంకటేశ్వరరావు, నల్లకుంట, హైదరాబాద్ 5. నెల్లుట్ల ప్రేమలత, విద్యానగర్, హనుమకొండ 6. ఎ.వి.ఆర్. కృష్ణ, కాట్రేనికోన 7. జి. విజయశ్రీ, లుంబినీవనం, అరసవిల్లి 8. కేశవరపు వెంకటలక్ష్మి, పెద్దపల్లి, ఆలమూరు మండలం 9. పి.డి. పవన్‌కుమార్, హైదరాబాద్ 10. బి. కామేశ్వరి, విజయ్‌నగర్‌కాలనీ, హైదరాబాద్ 11. శ్రీపెరంబుదూర్ వినయశ్రీ, మేడ్చల్ 12. టి. హేమలత, మచిలీపట్నం 13. టి.ఆర్ బాలకృష్ణరావు, రాజమండ్రి 14. టి. స్వరాజ్యలక్ష్మి, రాజమండ్రి 15. వాయిల రమణమూర్తి, బెలగాం, పార్వతీపురం 16. తిప్పావఝుల లక్ష్మీనాగ స్వాతి, ఇందుకూరుపేట, నెల్లూరు జిల్లా 17. సంగబండ వర్ష, మక్తల్ 18. కలియుగం హుమాయున్ సంఘీర్, గోపాల్ పేట్, నిజామాబాద్ జిల్లా 19. యు. కృష్ణమూర్తి, ఊటుకూరు, నెల్లూరు జిల్లా 20. వి. లక్ష్మి, నాచారం, హైదరాబాద్ 21. అల్లంపాటి వెంకటేశ్వర్లు, సంగం, నెల్లూరు జిల్లా 22. రాయల్లి లాలెప్పచౌదరి, బళ్లారి 23. వి. పార్థసారథి, బళ్లారి 24. యు. శ్రీను, శ్రీశైలం డ్యాం ఈస్ట్ (పోస్ట్), కర్నూలు 25. వి. వెంకటరామనర్సయ్య, హన్మకొండ 26. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, హైదరాబాద్ 27. రామకూరు నాగేశ్వరరావు, శ్రీకాకుళం 28. యు.యు.యు, ఎమ్మిగనూరు 29. కె. కామేశ్వరరావు, జంగారెడ్డిగూడెం 30. వాసాల వెంకటేశ్వరరావు, మచిలీపట్నం 31. జి. స్వాతి, బెంగళూరు 32. పి. రేవతి, శేర్‌లింగంపల్లి, హైదరాబాద్ 33. వై.ఎస్. మూర్తి, పర్లాకిమిడి, ఒరిస్సా 34. బిల్లా మనోహర్, వరంగల్ 35. ఎన్. పద్మావతి, జీడిమెట్ల, హైదరాబాద్ 36. యు. శైలజ, మోటూరు, కృష్ణాజిల్లా 37. పి. నర్సింహారావు, రామంతపూర్, హైదరాబాద్ 38. జి. మోహన్ వెంకటరత్నాజి, సైదాబాద్, హైదరాబాద్ 39. శ్రీదేవి గుండిమెండ, పటమట, విజయవాడ 40. ఎం. అరుణరేఖ, లక్ష్మీపురం, గుంటూరు 41. గుడిచుట్టు ప్రవీణ్, ఖమ్మం 42. ఎస్. ఖాజావలి, గుత్తి రైల్వేస్టేషన్ 43. వి. అరుణ, నల్లకుంట, హైదరాబాద్ 44. ఎస్. హరనాథబాబు, విద్యానగర్, హైదరాబాద్ 45. దేవసేన, తిరుపతి 46. గంటి భానుమతి, మల్లాపూర్, హైదరాబాద్ 47. ఎం. శ్రీవాత్సవ్, సాయినాథపురం, హైదరాబాద్ 48. డాక్టర్ డి. లక్ష్మణస్వామిరెడ్డి, హుమాయున్‌నగర్, హైదరాబాద్ 49. డి. విజయలక్ష్మి, హిందూపూర్ 50. శ్రీనివాస్, రాయచూరు 51. కె. లక్ష్మీదేవమ్మ, కడప 52. ఎస్. హైమవతి, ఎస్.ఎన్.పురం, విజయవాడ 53. తవుటం సులోచన, కరీంనగర్ టౌన్ 54. అంకె సునీల్‌కుమార్, గెనిగెర, అనంతపురం జిల్లా 55. ఎన్. మనోహర్‌రావు, సిర్పూర్ కాగజ్‌నగర్, ఆదిలాబాద్ జిల్లా 56. ఎస్. విమలామూర్తి, జనగామ 57. అక్కినపల్లి రామారావు, లలితానగరం, విశాఖపట్టణం 58. బి. ఫణిజ, ఎర్రమంజిల్, హైదరాబాద్ 59. ఎం. సుమలత, దేవీనగర్, బళ్లారి 60. శైలూషి, అరసవిల్లి. 61. మామిడి వేదవర్ష, పూణె.



# చతుర ప్రవేశిక



## జూన్ - 08

జూన్ 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. అన్నీ సరిగా రాసినవారికి ఆకర్షణీయమైన బహుమతులు లభిస్తాయి.. (ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. విజేతల ఎంపికలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. సంపాదకులదే తుదినిర్ణయం).

1. ఆడవాళ్లమీద జాలితో కథలు రాసిన రచయిత?
2. రాజుకి కోపం తెప్పించిన విదూషకుడి మాట?
3. కాసులమ్మ కూతురిపేరు?
4. కాసులమ్మ భర్తని ఎలా పిలవాలనుకుంటుంది?
5. కాలేజీలో సంగీత విభాగానికి హెడ్?
6. కాసులమ్మకి గాయనిగా అవకాశమిచ్చిన సంస్థ?
7. కాసులమ్మకు ఆమె భర్త ఏ స్త్రీ గురించి చెప్పారు?
8. మీనాక్షి పొరుగున ఉన్న ఉత్తరాది అమ్మాయి?
9. 'నేనెందుకు బతకాలి?' శీర్షికలో ఎవరిగురించి ఉంది?
10. కాసులమ్మతో 'నన్ను రాఘవి' అనుకోండి అన్నదెవరు?
11. లేడీస్‌వింగ్ ప్రెసిడెంట్ పేరు?
12. లోవుడ్ స్కూల్లో ఎంతమంది పిల్లలున్నారు?
13. రోచెస్టర్ వ్యాపారరీత్యా ఏం చేస్తుంటాడు?
14. చలపతి మాస్టారి అమ్మాయి పేరు?
15. రాణులకు ఏ విద్యలో ప్రావీణ్యం ఉండేది?

పంపినవారి పేరు: ---------------------------------- వయసు (   )

చిరునామా: ------------------------------------------------

------------------------------------------------

------------------------------------------------

పిన్‌కోడ్:                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

కథా నిలయం

ట్యాంక్‌బండ్ 8 కథలు

సముద్రాల

# తప్పు!?



ట్యాంక్ బండ్‌పై నడుస్తున్న చలపతికి తెలుగు వెలుగుల విగ్రహాలకు వెనుకగా ఉన్న రెయిలింగ్‌ను ఆనుకుని పది, పదిహేనుమంది కుర్రాళ్లు కన్పించారు. వాళ్లంతా అక్కడి నుంచి లోయర్ ట్యాంక్ బండ్ రోడ్డువైపు చూడడం.. నవ్వడం అతన్ని ఆశ్చర్యానికి గురిచేసింది. అప్పటికే వాళ్ల సందడికి రోడ్డున పోయే ఔత్సాహికులూ అక్కడికి వెళ్తున్నారు... తర్వాత వాళ్లూ ముసిముసిగా నవ్వుకుంటూ నిష్క్రమించడం కన్పిస్తూనే ఉంది.

ఏముందక్కడ? వాళ్లంతా ఏం చూస్తున్నారు? ఎందుకు నవ్వుతున్నారు? తనలో చెలరేగే ప్రశ్నలకు జవాబులు తెలుసుకోవడానికి చలపతి అటుకేసి నడిచాడు.

ట్యాంక్‌బండ్ అంచు నుంచి కిందకు

చూస్తే అతనికి చెదురు మదురుగా పోయే వాహనాలుతప్ప మరేం కన్పించలేదు. ఇలా కాదని ఆ పిల్లల చూపు ఎటుందో గమనించి, తనూ అటుకేసి దృష్టి సారించాడు. ఇందిరాపార్కు లోపలిభాగం అది. చెట్లు, పొదలు, గుబుర్లుగా పెరిగి ప్రేమికులకు ఏకాంతాన్ని పంచుతున్నాయి. అక్కడ ఒక పొదచాటున ఇద్దరు.. 'రగులుతోంది మొగలిపొద' అన్నట్లు బిగియారా కౌగిలించుకుని ప్రేమమైకంలో మేను మరచి కన్పించారు. వారికి ఆశ్రయమిచ్చిన పొద పార్కులో ఆవైపు నుంచి వచ్చేవారి దృష్టి సోకకుండా కాపాడుతోంది కానీ ట్యాంక్‌బండ్‌పైని ఆకతాయి కళ్లకు కళ్లాలు వేయలేకపోతోంది. ఈ నగ్నసత్యం ఆ జంట గ్రహించినట్లు లేదు. అందుకే తమ మైకంలో.. తమకంలో తాము మునిగితేలుతున్నారు.

'ఛీ..' అనుకుని చటుక్కున ముఖం తిప్పుకున్నాడు చలపతి. అంతలోనే ఏదో అనుమానంవచ్చి మరోసారి ఆ జంటను పరిశీలనగా చూశాడు. ఆ చిలకపచ్చ చీర గట్టిన అమ్మాయి ఎవరు?

కొన్నిక్షణాల తర్వాత అతని ముఖం కోపంతో జేవురించింది. ఒంట్లోని రక్తం ఉడుకుతుండగా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ అక్కడి నుంచి వేగంగా వెళ్లిపోయాడు.

★ ★ ★

సాయంత్రం ఏడున్నర..

సరళ హుషారుగా ఏదో పాట హమ్ చేస్తూ ఇంటికి వచ్చింది..

ఆమె వచ్చిన అరగంటకు విశాల్ ఆఫీసు నుంచి ఉస్సురస్సురంటూ వచ్చాడు.

కూతురూ అల్లుడూ కబుర్లాడుతున్న దృశ్యం చలపతికి అదోలా అన్పించింది. వాళ్లిద్దరూ తనను పలకరించబోగా తలనొప్పిగా ఉందని గదిలోకొచ్చి పడుకున్నాడు.

★ ★ ★

చలపతి మాస్టారి అమ్మాయి సరళ అంటే ఆ పల్లెటూళ్లో అందరికీ ఎంతో ఇష్టం. చదువుల సరస్వతని తండ్రి కూడా తెగ ముద్దుచేసేవాడు. చిన్నతనంలోనే తల్లిపోయినా మరోపెళ్లి చేసుకోకుండా ఆమె మీదే పంచప్రాణాలు పెట్టుకుని పెంచి పెద్దచేశాడు. ఆస్తిపాస్తులకే కాదు.. తన నిజాయతీకీ, ఆదర్శాలకీ కూడా కూతురే తన వారసురాలని ఊరందరికీ గర్వంగా చెప్పేవాడు.

బీటెక్ చేసి హైదరాబాద్‌లో మంచి ఉద్యోగం సంపాదించిన సరళకు త్వరలోనే చక్కని సంబంధం చూసి అంగరంగ వైభవంగా పెళ్లిచేశాడు చలపతి. అల్లుడు విశాల్ చాలా మంచివాడు. హైదరాబాద్‌లోనే ఓ సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేస్తున్నాడు. సరళను ప్రాణంకన్నా మిన్నగా చూసుకునే అతను మామగారినీ వచ్చి తమతో ఉండమంటుంటాడు. మర్యాద కాదని ఆ ఆహ్వానాన్ని ఆరేళ్లుగా సున్నితంగా తిరస్కరిస్తూనే ఉన్నాడు చలపతి.

గట్టిగా అడిగితే- 'మూడు నెలలకోసారొచ్చి, ఎలాగో మీ దగ్గర వారం పదిరోజులు ఉండే వెళ్తున్నాగా..'అంటూ నవ్వేస్తాడు. లేదంటే- '..నాకో మనవడినో మనవరాలినో ఇవ్వండి.. వాళ్లతో ఆడుకుంటూ మీరు వద్దన్నా మీ ఇంట్లోనే ఉంటా' అనేవాడు.

అలాంటి దేవుడిలాంటి అల్లుడికి తన కూతురు అంత ద్రోహం ఎలా చేస్తోంది? చలపతి మనసు ఉడికిపోతోంది. తన ఆశయాలూ, ఆదర్శాలకు వారసురాలు అనుకున్న సరళ ఇలాంటి సిగ్గుమాలిన పని చేయడం ఏంటి? నంగనాచిలా ఏమెరగనట్లు ఎలా మాట్లాడుతోందో?

★ ★ ★

'నాన్నా.. నాన్నా.. ఏంటలా పడుకున్నావ్? ఒంట్లో బాగాలేదా?' సరళ కుదుపుకు ఉలిక్కిపడి నిద్రలేచాడు చలపతి.

అప్పటికే తెల్లగా తెల్లారిపోయింది.

ఆలోచనలతో బుర్రవేడెక్కి రాత్రి చాలాసేపు నిద్రపట్టలేదు. తెల్లవారు జామున పట్టినట్లుంది గట్టి కునుకు అనుకుంటూ చకచకా తయారైపోయాడు.

'ఏంటి నాన్నా... ఎక్కడకి బయలుదేరావ్?'

కూతురి ప్రశ్నకు సమాధానం ఇవ్వాలనిపించలేదు. ఆశ్చర్యంగా తననే చూస్తున్న విశాల్‌తో మాత్రం 'అల్లుడుగారూ.. అర్జంటు పనుంది. ఊరికెళ్లాలి. వస్తా' అంటూ సెలవుపుచ్చుకుని కూతురివైపు కనీసం చూడనైనా చూడకుండా బ్యాగ్ తీసుకుని మెట్లు దిగేశాడతను.

వెనక నుంచి కూతురు, అల్లుడూ పిలుస్తున్నా విన్పించుకోలేదు. అటుగా వెళ్తున్న ఆటో పిల్చి ఎక్కేశాడు.

మనసంతా చిరాకుగా ఉంది. మొదట బస్టాండ్‌కు వెళ్లాలనుకున్నాడు. ఊరికి వెళ్లి మాత్రం చేసేదేముంది? బిర్లామందిర్‌కు పొమ్మన్నాడు. అక్కడ దేవుడ్ని చూసి దగ్గరలోనే ఉన్న ఓ లాడ్జికి వెళ్లి రూం తీసుకున్నాడు. మధ్యాహ్నం దాకా కరువుతీరా నిద్రపోయాడు.

నిద్రలేచాక గదికి తాళంవేసి బయటకు వచ్చాడు. అప్రయత్నంగా అతని కాళ్లు ట్యాంక్‌బండ్‌వైపు నడిచాయి.

నిన్న వెళ్లిన ప్రదేశానికే వెళ్లి నిలబడ్డాడు. వద్దనుకుంటూనే ఆ పొదవైపు చూశాడు. అక్కడ ఎవరూ లేరు. మెల్లగా లోయర్ ట్యాంక్ బండ్ రోడ్డువైపు ఉన్న మెట్లుదిగి ఇందిరా పార్కులోకి నడిచాడు. ముఖద్వారం దగ్గరే ఉన్న సిమెంట్ బెంచీలో కూలబడ్డాడు.

మనసంతా పిచ్చిపిచ్చిగా ఉంది..

అంతలో ఓ జంట కిలకిల నవ్వుకుంటూ పార్కులోకి వచ్చింది. చిలకపచ్చ చీరలో ఉన్న ఆమెను దగ్గరగా చూశాడు. ఒడ్డుపొడవు అంతా సరళలాగే ఉంది కానీ ఆమె కాదు.. నిన్న నేను చూసింది ఈమెనా? లేక ఇలాగే ఉన్న మరో అమ్మాయినా? ఎవరినోచూసి తను సరళని భ్రమపడి పిచ్చి పిచ్చి ఊహలన్నీ చేశాడా? తన బంగారు తల్లి మనసు కష్టపెట్టాడా?

ఈ ఆలోచన రాగానే అతను అక్కడ కూర్చోలేకపోయాడు. కూతురి అమాయక ముఖం కళ్లముందు మెదిలింది. చకచక ఆటోపిలిచి కూతురింటికి చేరాడు. మెట్లు ఎక్కుతుంటే అల్లుడి గొంతు విన్పిస్తోంది..

'ఏంటి సరళా మరీ చిన్నపిల్లలా? నాన్నగారు సడెన్‌గా వెళ్లిపోయారని రోజంతా చుక్క కాఫీ తాక్కుండా, అన్నం తినకుండా ఉంటే ఎలా? ఆయన వెనుకే ఇద్దరం పొద్దున కార్లోవెళ్లి బస్టాండ్, రైల్వేస్టేషన్ అంతా గాలించే వచ్చాం కదా? ఎక్కడా కన్పించలేదంటే సిటీలో ఉన్నట్లే. అంచేత స్థిమితపడు. ఆయన తప్పకుండా వస్తారు'

'లేదు విశాల్! నాన్న ఎప్పుడూ ఇలాచేయలేదు. నాతో ఒక్కమాట మాట్లాడలేదంటే నాపై ఆయనకెందుకో కోపం వచ్చింది.. ఏదో తప్పు చేశాను. దానికి శిక్ష పడాల్సిందే' అంటూ వెక్కివెక్కి ఏడుస్తోంది.

కూతురి ఏడుపు చలపతి గుండెలు దేవేసింది. కళ్లలో నీళ్లు తిరిగాయి. ఒక్క ఉదుటన తలుపుతోసుకుని లోపలికి పరుగున వెళ్లాడు..

'తప్పు చేసింది నువ్వుకాదు తల్లీ.. ఈ మూర్ఖుడు! మన్నించమ్మా' అంటూ కూతుర్ని గుండెకు హత్తుకున్నాడు. అతని కన్నీళ్లు ఆమె తలను అక్షతల్లా అభిషేకించాయి.

–చంద్రప్రతాప్

# కాలాతీతం

(1847)

# జేన్ ఐర్



**ఈ** నవలలో జేన్ ఐర్ తన కథ ఇలా చెప్పుకుంటుంది.

'చిన్నతనంలో కష్టపడ్డాను' అంటే నా భావనలు మీకర్థం కావు. తల్లి ప్రేమకు

**ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక**

దూరమైన పిల్లల మనోవ్యథ అనుభవిస్తే గాని తెలియదు. నాన్న కూడా మరణించాక, ఆయన తమ్ముడి భార్య మిసెస్ రీడ్ నన్ను పెంచింది. "ఇంత పెద్ద బాధ్యత" మీదేసుకున్నందుకు ఆమె తనను తాను తిట్టుకోని క్షణంలేదు. అనాథాశ్రమంలో గడిపినా అంతకన్నా సుఖంగానే వుండేదాన్నేమో! ఆమె పిల్లలు ఎలిజా, జార్జియానా, జాన్ నన్ను అంటరానిదాన్నిలా చూశారు. వాళ్లు చేసిన తుంటరి పనులన్నీ నా మీదికి తోసి పిన్నిచేత తిట్టించటం వాళ్ల సరదా.

నేనాయింట్లో వుండటమే ఎవరికీ ఇష్టం లేదు. ఒకనాడు నన్ను అనాథపిల్లల కోసం నడుపుతున్న లోవుడ్ స్కూల్లో చేర్పించింది పిన్ని.

"నేనేం నేరం చేశాను? ఎందుకీ శిక్ష?" అంటూ ఏడ్చాను. కాని నాకన్నీరామెకు మరింత కోపం తెప్పించింది.

ఆ స్కూల్లో ఎనభైమంది పిల్లలున్నారు. పిల్లలక్కావలసిన కనీస సౌకర్యాలు కూడా లేవు. మనుషులు తినలేని భోజనమది. కప్పుకోవటానికి లేక చలికాలమంతా గజ



గజా వణికి చచ్చాం. అలా ఎనిమిదేళ్లు గడిచింది. చదువు ముగించి, గవర్నెస్ వుద్యోగం సంపాదించుకుని థార్న్ ఫీల్డ్ హాల్ అనే సంపన్నుల ఎస్టేట్ చేరాను. అక్కడి హౌజ్ కీపర్ మిసెస్ ఫెయిర్ ఫాక్స్. ఆ ఇంటి యజమాని మిస్టర్ రోచెస్టర్ యింటి వద్ద వుండే సమయం చాలా తక్కువ. వ్యాపారరీత్యా ఎప్పుడూ ప్రయాణాలు చేస్తుంటాడు. నా డ్యూటీ ఏంటంటే ఆయన పెంపుడు కూతురు ఎనిమిదేళ్ల అదీల్ వారెన్స్‌కు ట్యూషన్ చెప్పడం.

థార్న్‌ఫీల్డ్ చాలా పెద్ద భవనం. యజమానులెవరూ వుండనప్పుడు మూడంతస్తుల ఇల్లెందుకు కట్టించుకున్నారో అర్థం కాలేదు.

ధనవంతుల స్వభావాలు విచిత్రంగా వుంటాయి. వాళ్లను సంతోషపెట్టటం కష్టం.

"మిస్టర్ రోచెస్టర్ ఎలాంటివాడు?" అంటూ మిసెస్ ఫెయిర్ ఫాక్స్‌తో సంభాషణ ప్రారంభించాను.

"మితభాషి. పనిమనుషులతో ప్రేమగానే వుంటారు. కాని ఆయనకెందుకు కోపం వస్తుందో, ఎందుకు సంతోషిస్తాడో తెలియదు"

మూడో అంతస్తు నిండా పాత సామాను పెట్టారు. తలుపులు మూసిన రెండు మూడు గదులు కూడా కనిపించాయి. ఒక దాంట్లో ఏదో అలికిడైంది. వింత ధ్వనులు కూడా వినిపించాయి.

"భయపడకు. అది పనిమనిషి గ్రేస్ పూల్ గొంతు" అంటూ భుజం తట్టింది మిసెస్ ఫెయిర్ ఫాక్స్.

జనవరి నెలలో, ఒక మధ్యాహ్నం, పూపొదల మధ్యన నడుస్తున్నప్పుడు గుర్రపు డెక్కల సవ్వడికి వులిక్కిపడ్డాను. నా వైపు పరిగెత్తుకుంటూ వచ్చాడొక అశ్వికుడు. మొరుగుతూ ఒక జాగిలం అతణ్ణి వెంబడించింది. పక్కకు తప్పుకోవాలని కూడా నాకు తోచలేదు. నిశ్చేష్టురాలినై నిల్చున్న నన్ను తప్పించుకోటానికి ప్రయత్నించి, వేగంగా వచ్చిన గుర్రం మంచు మీద జారింది. దానితోపాటే పైనున్న అశ్వికుడు "అమ్మా" అంటూ వెల్లకిలా పడిపోయాడు. నేను కోలుకుని, చేయి అందించి, అతణ్ణి లేపటానికి ప్రయత్నిస్తూ.

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ?" అంటూ అడిగాను.

"దారికి ఓ పక్కన నడవాలి. స్తంభంలా మధ్యన నిలుచోకూడదు" అన్నాడతడు చిరుకోపంతో.

"సారీ"

పెద్ద దెబ్బలేమీ తగిలినట్టులేదు. ఎవరో అమాయకుడు. ఎక్కడి నుండి వస్తున్నాడో లేచి కుంటుతూ, అతికష్టం మీద మళ్లీ గుర్రమెక్కాడు.

"ఎక్కడికెళ్లాలి?"

"అక్కడికి" అంటూ థార్న్‌ఫీల్డ్ వైపు వేలు చూపాడు.

"అది రోచెస్టర్ గారిల్లు. మీకెవరు కావాలి?"

"మీరిక్కడేం చేస్తున్నారు?"

"గవర్నెస్‌ని"

"అవునుగదూ. మరిచేపోయాను" అంటూ గుర్రాన్ని దౌడు తీయించాడా అపరిచితుడు.

నేను మరికాసేపటికి ఇల్లు చేరేసరికి, జాగిలం ఓ మూలన తోకాడిస్తూ పడుకుని వుంది.

మిసెస్ ఫెయిర్‌ఫాక్స్ చిరునవ్వుతో, యజమాని వచ్చాడని చెప్పింది.

మరుసటిరోజు సాయంత్రం మిస్టర్ రోచెస్టర్ నాకు ఇంటర్వ్యూ యిచ్చాడు. అతని హుందాతనం నన్ను ఆకర్షించింది. ప్రేమగా పలకరించి అనేక విషయాలు తెలుసుకున్నాడు. అయితే అతడెంత

# ఛార్లొట్ బ్రాంటీ
## (1816-1855)

**బ్రాం**టీలది ఐరిష్ సంతతి. చర్చి ఆఫ్ ఇంగ్లండ్‌లో ఫాదరీగా పనిచేసిన రెవరెండ్ పాట్రిక్ బ్రాంటీ ఆరుగురు సంతానంలో మూడోది ఛార్లొట్. అయిదేళ్లప్పుడే తల్లి కాన్సర్‌తో మరణించింది.

ఆర్థిక ఇబ్బందులవల్ల పిల్లల్ని దాతల విరాళాలతో నెలకొల్పిన క్లెర్జీ కాటర్స్ స్కూల్‌కు పంపాడు తండ్రి- ఇదే 'జేన్ ఐర్'లో వర్ణించిన లోవుడ్ స్కూల్. అక్కడి అపరిశుభ్రత, చాలీచాలని భోజనం ఇత్యాది కారణాలతో విద్యార్థులందరూ ఏదో ఒక జబ్బుతో బాధపడుతూనే వుండే వాళ్లు. కొన్నాళ్లకు చలి తీవ్రతను తట్టుకో లేక, ఇద్దరు బ్రాంటీలు- మారియా, ఎలిజబెత్- క్షయతో మరణించారు. తండ్రి మిగతా పిల్లల్ని యింటికి తీసుకువచ్చి తనే చదువు చెప్పాడు.

అక్కలిద్దరూ మరణించటంతో- ఛార్లొట్ జీవితంలో విషాదం నిండింది. మరోవైపు దుర్భర పేదరికం. కలల్లోనైనా వీటి నుండి విముక్తి కావాలంటే ఫాంటసీలే శరణ్యం. బైరన్ ప్రభావంతో రొమాంటిక్ కవితలు రాసింది. ఇంటి పరిస్థితి మరింత దిగజారింది. సంపన్నుల ఇళ్లలో గవర్నెస్‌గా పనిచేసి తండ్రికి సాయపడింది.

చిన్న ఉద్యోగాలు చేయటం కన్న, తనే స్వయంగా ఒక స్కూలు ప్రారంభిస్తే, ఆర్థికంగా నిలదొక్కుకోవచ్చని, బ్రసెల్స్‌కెళ్లి విదేశీ భాషా పరిజ్ఞానం సంపాదించింది.

1846-55ల మధ్యకాలంలో ఛార్లొట్,

స్నేహంగా ఉన్నా యజమానికీ, ఉద్యోగికీ మధ్య అంతరమెప్పుడూ చెరిగిపోదు.

ఒక రాత్రి మూడో అంతస్తులో మళ్లీ కేకలు విన్పించాయి. గ్రేస్ పూల్ కాబోలు ననుకున్నాను. ఇంతలో మంటలు వ్యాపించి పరదాలు తగలబడ్డాయి. పరిగెత్తి, మంటలార్పటానికి బకెట్‌లతో నీళ్ళు గుమ్మరించాను.

నేను చేసిన పనిలో తప్పేం కనిపించిందోగాని, మిస్టర్ రోచెస్టర్ కోపంగా, "నీళ్లు పోసి నన్ను చంపాలనుకుంటున్నావా ఏమిటీ?" అంటూ అరిచాడు. కోపంతో మొహం ఎర్రబడింది. నా కళ్లలో నీళ్లు చూశాడేమో కాస్త శాంతించి, "డోంట్ వర్రీ. ఇది గ్రేస్‌పూల్ పనేలే" అంటూ వెళ్ళిపోయాడు. బాధను అణుచుకొంటున్నట్టుగా ఉంది గొంతు. ఇల్లు తగలబడినా పట్టించుకోడా ఈ మనిషి!

మరుసటి ఉదయం బిజినెస్ ట్రిప్ మీద వెళ్లి వారం రోజుల తర్వాత తిరిగి వచ్చాడు. ఈసారి చాలా ఉత్సాహంగా కనిపించాడు. అర్జెంటుగా ఒక పార్టీ అరేంజి చెయ్యాలని మిసెస్ ఫెయిర్ ఫాక్స్‌కి ఆదేశాలిచ్చాడు. రెండు రోజులు నిరంతరాయంగా పనిచేసి పని మనుషులు ఇల్లంతా అలంకరించారు. ఫర్నిచర్ పాలిష్ చేశారు. కొత్త కర్టెన్లు, కొత్త పూల కుండీలు, కార్పెట్లతో యింటికి కొత్త కళ వచ్చింది. పార్టీకి వచ్చిన అతిథుల్లో ముఖ్యురాలు మిస్ బ్లాంష్ ఇంగ్రామ్. గవర్నెస్ లాంటి చిరుద్యోగులామెకు కనిపించరు. రోచెస్టర్ మాత్రమామెమీద మనసు పడ్డారు. ఆటా, పాటా ముగిసిన తర్వాత, నా ముఖ కవళికలు గమనించి కారణమడిగాడు.

ఎమిలీ, ఆన్ (ఈవిడ కరర్ ఎల్లిస్ అనే మగపేరుతో రాసింది)ల జీవితాల్లో సృజ నాత్మకత పరిణితి చెందింది.

ఎమిలీ నవల 'ఊదరింగ్ హైట్స్', ఆన్ రాసిన 'ఆగ్నెస్ గ్రే' వెంటనే అచ్చయ్యాయి. కాని ఛార్లొట్ తొలి ప్రయత్నం 'ది ప్రొఫె సర్'ను ప్రచురణకర్తలు తిరస్కరించారు. అయితేనేం, 1847లో అచ్చయిన 'జేన్ ఐర్' కు పాఠకులు బ్రహ్మరథం పట్టారు. 300 పౌండ్లు పారితోషికం కూడా లభించింది.

అయినా ఛార్లొట్‌ను జీవితమంతా మృత్యువే వెంటాడింది. తమ్ముడు పాట్రిక్ 1848లో క్షయతో కన్నుమూశాడు. ఆ తర్వాత వెనువెంటనే ఎమిలీ, ఆన్‌లు కూడా మరణించారు. 'షిర్లీ' నవల ప్రారం భించిన తర్వాత, ఈ రచయిత్రికి, అప్పటికే లబ్ధప్రతిష్ఠులైన విలియం మేక్‌పీస్ థాకరే, ఎలిజబెత్ గాస్కెల్ వంటి ప్రముఖులతో పరిచయమేర్పడింది.

ఛార్లొట్‌ను అనారోగ్యం ఎప్పుడూ వీడ లేదు. 1851లో 'విలెట్' రాస్తున్నప్పుడు లివర్ జబ్బు వచ్చింది.

తండ్రి అభీష్టానికి వ్యతిరేకంగా, 1854లో రెవరెండ్ ఆర్థర్ బెల్ నికల్స్‌ను వివాహం చేసుకుని, ఐర్లండ్‌లో హనీమూన్‌కు వెళ్లిన ప్పుడు గుర్రం మీది నుండి జారిపడింది.

ఆ తర్వాత గర్భం దాల్చిన ఛార్లొట్‌ను క్షయవ్యాధి పీడించింది. చివరికి 1855 మార్చి 31న పురిట్లోనే తల్లీ, పిల్లా మరణిం చారు.

ఆమె చివరి అసంపూర్తి నవల 'ఎమ్మా' ను కార్న్ హిల్ మాగజైన్ 1860లో ప్రచు రించింది.

ఒకే కుటుంబంలో ముగ్గురు ప్రముఖ రచయిత్రులుండటమే అరుదనుకుంటే, ముగ్గురూ అల్పాయుష్కులే కావటం విధి వైచిత్రి.

ఏమని చెప్పను? ఊహల్లో తేలిపోవడం తగ్గించి సజావుగా ఉద్యోగం చేసుకోవటం లోనే విజ్ఞత ఉందని గ్రహించాను.

చీకటి పడిందంటే చాలు ఆ ఇంటి వాతావరణమే మారిపోతుంది. అర్ధరాత్రి, మూడో అంతస్తులో అరుపులు మళ్లీ విని పించాయి. ఒక్క ఉదుటున గ్రేస్ పూల్ గదికి పరిగెత్తాను. అప్పటికే రోచెస్టర్ అక్కడున్నాడు. మా అతిథిగా ఉంటున్న మిస్టర్ మేసన్ (అతడి గురించి నాకు తరువాత తెలిసింది) చేతిమీద పళ్ల గుర్తు లున్నాయి. రక్తం కారుతున్నది. గదిలో క్రూర జంతువును బంధించి ఉంచారా? డాక్టర్ వచ్చి చేతిని శుభ్రం చేసి కట్టు కట్టాడు.

తరచుగా జరుగుతున్న ఈ వింత సంఘటనల వెనక మిస్టరీ అంతు పట్ట లేదు. ఎంత గుచ్చి గుచ్చి అడిగినా ఫెయిర్ ఫాక్స్ గానీ, రోచెస్టర్ గానీ కార ణాలు చెప్పరు. నేను ఈ షాక్ నుండి కోలుకోకముందే మా పిన్ని మిసెస్ రీడ్ ఎక్కువరోజులు బతకదని వర్తమానం వచ్చింది. అప్పటికే ఆమె కొడుకు జాన్ మరణించాడు. చివరిక్షణాల్లో ఆమె ఎంతో కొంత పశ్చాత్తాపపడిందనే అనుకుంటాను. 'మదేరా'లో వుంటున్న ఒక అంకుల్ నన్ను దత్తత తీసుకోవాలనుకుంటున్నాడని చెప్పి కళ్లు మూసింది. అంటే నాకిక వుద్యోగం చెయ్యవలసిన అవసరం వుండదు.

నెలరోజుల తర్వాత థార్న్‌ఫీల్డ్‌కు తిరిగి వచ్చేసరికి నా యజమాని చిర్రుబుర్రు లాడుతూ కనిపించాడు.

"నన్నొంటరిగా వదిలి వెళ్లిపోగలవన్న మాట" అంటూ నిష్ఠూరంగా మాట్లాడాడు.

నిజానికి నాకూ బాధగానే వుంది. కాని చేస్తున్నది ఉద్యోగమేగా? ఎప్పుడో అప్పుడు సెలవు తీసుకోకతప్పదు.

"మీ పెళ్లెప్పుడండీ?"

"దాని గురించి ఆలోచించలేదు గాని నీకో కొత్త ఉద్యోగం వెదికాను" అన్నాడు రోచెస్టర్. మొహం వాడిపోయింది. లోపల ఏదో బాధ తొలుస్తున్నట్టుంది.

"ఎక్కడ?"

"చాలా దూరం వెళ్లాలి. థార్న్‌ఫీల్డ్‌నుండి- ఇంగ్లాండు నుండి దూరంగా- ఐర్లండ్‌కు-"

నేను కన్నీళ్లాపుకోలేకపోయాను.

"ఇష్టం లేకపోతే వెళ్లొద్దులే"

"నేను మనిషిని. యంత్రాన్ని కాదు. నాకూ ఇష్టాయిష్టాలుంటాయి. మనసు కట్టేసుకుని బతకటం సాధ్యం కాదు" అంటూ ఉద్రేకంగా మాట్లాడాను.

పెద్దగా నవ్వుతూ,

"ఆహా యిప్పుడు తెలిసింది నీ అభిప్రాయం..." అంటూ నన్ను చేతుల్లో అదుముకుని పెదాలమీద ముద్దు పెట్టుకున్నాడు రోచెస్టర్.

"ఇది తప్పు. మీరు వివాహితులు"

"అన్నీ మరచిపో. మనం వీలైనంత త్వరగా పెళ్లి చేసుకుందాం"

థార్న్‌ఫీల్డ్‌కు సమీపంలో వున్న చర్చిలో అన్ని ఏర్పాట్లూ పూర్తిచేశాడు రోచెస్టర్. కాని చట్టరీత్యా వివాహం వీలుపడదు. అతని భార్య యింకా బతికే వుందట. ఇది నయవంచనే. ఇటువంటి మోసకారితో పెళ్లికి అంగీకరించిన నేనెంత మూర్ఖురాలిని!

"అసలు విషయం చెబుతాను" అంటూ ప్రారంభించాడు రోచెస్టర్. "నిజమే. పదిహేనేళ్ల క్రితం నాకు వివాహమైంది. భార్య పేరు బెర్తామెసన్. ఆమెది ఉన్మాదుల కుటుంబమట. బెర్తా కూడా పిచ్చిదే. ఆమెను కంట్రోల్ చెయ్యటానికే గ్రేస్‌పూల్‌ను ఉద్యోగంలో పెట్టుకున్నాను"

ఏం చెయ్యాలి? నాకిక్కడుండే హక్కుందా?

తెల్లవారుజామున, ఎవరూ చూడకుండా యిల్లు వదిలి వున్న డబ్బంతా కోచ్‌మాన్‌కిచ్చి దూరంగా తీసుకెళ్లమన్నాను. ఆ తర్వాత మరి కొన్నాళ్లు ఒంటరిగా తిరిగి రివర్స్ గారింట్లో శరణుజొచ్చాను. అక్కడ మిస్ డయానా, మేరీ, మిస్టర్ జాన్‌లు నన్నాదరించి, ఒక స్కూల్లో టీచర్‌గా ఉద్యోగమిప్పించారు. జీతం ఏడాదికి ముప్పై పౌండ్లు.

రోసామండ్ ఆలివర్ అనే ఒక ధనిక యువతి సెయింట్ జాన్ రివర్స్‌ను ఆకర్షించటానికి ప్రయత్నించింది. ఆమె అందగత్తె కూడా. అయినా అతడు నాతో సాన్నిహిత్యానికే యిష్టపడ్డాడు. మరి కొన్నాళ్లకు, వుత్తర ప్రత్యుత్తరాలు జరిపి, కొందరు లాయర్లను సంప్రదించి మా బంధువు ఒకతను ఆస్తి వదిలివెళ్లాడనీ, అందులో నా వాటాగా 20,000 పౌండ్లు వస్తుందనీ చెప్పాడు.

సెయింట్ జాన్‌కు దైవభక్తి ఎక్కువ. మిషనరీ కార్యక్రమాల కోసం ఇండియా వెళ్లటానికి సిద్ధపడ్డాడు. నన్ను కూడా తనతో తీసికెళ్లాలని కోరిక. అక్కడెవరికీ ఇంగ్లీషు రాదు. హిందుస్తానీ నేర్చుకొమ్మని ఒత్తిడి చేశాడు. పెళ్లి వీలుపడదు. స్నేహితురాలిగా ఉంటానని తేల్చి చెప్పాను.

కాని సెయింట్ జాన్‌లో ప్రేమ తీవ్రత పెరిగింది. ఇద్దరు పురుషులను భర్తలుగా ఊహించుకోవటం నాకు సాధ్యం కాదు. భగవంతుడే నాకోదారి చూపాలి. రోచెస్టర్ ఎక్కడున్నాడో! ఈ జీవితంలో నాకు దక్కుతాడా. అతడిని చూడక ఉండలేననిపించింది. నన్ను పిలుస్తున్నాడు నా ప్రియుడు.

మరునాడే థార్న్‌ఫీల్డ్‌కు బయల్దేరాను. సందేశం మోసుకెళ్లిన పావురం యజమా నివద్దకు తిరిగి వెళ్లినట్టుగా సుపరిచితమైన చెట్లు, పూల మొక్కలు, వీధులు చూసి ప్రాణం లేచివచ్చింది. కాని యింటికి చేరాక, ఆ దృశ్యం చూసి పిడుగువాత పడిన చెట్టులా నేల కూలాను.

థార్న్‌ఫీల్డ్ హాల్ అగ్నికాహుతైంది. మొండిగోడలు నన్ను వెక్కిరించాయి.

నన్ను గుర్తుపట్టిన ఒక వృద్ధురాలు.

"అంతా విధిలీల" అంటూ నిట్టూర్చింది.

"రోచెస్టర్ గారెక్కడుంటున్నారు? ఎలా జరిగిందీ ఘోరం? "

"కొన్ని నెలల కిత్రం, పంట నూర్పిళ్ల సమయంలో, ఒక రాత్రి అకస్మాత్తుగా మంటలు లేచాయి. ఈ యింట్లో ఒక పిచ్చిదాన్ని బంధించి వుంచారట. కాపలా వున్నా మిసెస్ పూల్, జిన్ తాగి స్పృహ తప్పినప్పుడు ఆ పిచ్చిది, గది తాళంచెవులు తీసుకుని యిల్లు తగలబెట్టింది.

"అప్పుడు యజమాని యింట్లోనే వున్నాడా? "

"ఆc... రక్షించటానికి కూడా ప్రయత్నిం చాడు. కాని ఆ పిచ్చిది కిందికి దూకింది. పాపం, బతకలేదు. తల పగిలింది"

"యజమానికేమైంది? "

"ఆయనకు తీవ్రంగా గాయాలైనాయి. ఒక కన్ను కాలిపోయింది. మరో కన్ను కూడా కనిపించటం లేదన్నారు. ఒక చెయ్యి తీసేశారు"

"ఎక్కడుంటున్నాడు? "

"ఇక్కడికి ముప్ఫై మైళ్ల దూరంలో ఫెర్న్‌డీన్ వద్ద"

రోచెస్టర్ క్షేమంగా వుంటే అంతే చాలు. హుటాహుటిన కోచ్‌లో బయల్దేరాను.

థార్న్‌ఫీల్డ్‌కీ, ఫెర్న్‌డీన్‌కీ పోలికలేదు. ఆడదిక్కు లేని ఆ చిన్న యిల్లు నిర్జీవంగా కనిపించింది. భయంతో వణికిపోయా. తలుపు తట్టాను. లోపల బూట్ల చప్పుడు వినిపించింది. పనిమనిషి తలుపు తీసింది. ఎదురుగా రోచెస్టర్! గుండె జారి పోయింది. సర్వస్వం పోగొట్టుకున్న బికా రిలా కన్పించాడు.

"నీళ్లు కావాలా? " అంటూ అడిగి గ్లాసు అందించాను.

"ఎవరు? ఎవరిదా స్వరం? "

నాకు గొంతు పెగల్లేదు.

"నువ్వేనా జెన్? "

"అవును నేనే. మీ జెన్‌ని" అంటూ నా



ప్రియుణ్ణి గాఢంగా ఆలింగనం చేసుకు న్నాను.

ఇదీ నా కథ. ఇద్దరం పెళ్లి చేసు కున్నాం. ఇప్పుడు మాకో బాబు ఆయనకు గాయపడిన కంటిలో కొద్దిగా చూపు వచ్చింది.

సెయింట్ జాన్ రివర్స్ అప్పుడప్పుడూ ఇండియా నుండి ఉత్తరాలు రాస్తుంటాడు.

-ఎం.వసంత

# ॥ఇది వేదం॥

# స్త్రీ - రాజనీతిజ్ఞురాలు

-డాక్టర్ సంధ్యావందనం లక్ష్మీదేవి

**వే**దాలలో స్త్రీలు నిశ్చయంగా రాజనీతి, యుద్ధనీతుల్లో ప్రావీణ్యాన్ని సంపాదించాలని వుంది. స్త్రీలు అన్ని రంగాలలో వారి ప్రతిభా సామర్థ్యాలను చూపించాలని వుంది. ఈనాటి రాజకీయ వ్యవస్థ కంటే ఒకప్పటి రాజనీతి వ్యవస్థ ఎంతో న్యాయంగా ప్రజాస్వామ్య సూత్రాలకు అనుకూలంగా వుండేది. ఒకసారి మనం వేదకాలం నాటి స్త్రీల పరిస్థితులను పరిశీలిస్తే ఆనాటికి ఈనాటికి ఎంతో వ్యత్యాసం, వివక్ష మనకు కనిపిస్తుంది.

"ధ్రువాసి ధరుణా స్త్రుతా విశ్వకర్మణా"
(యజుర్వేదం 13-16)



రాజు రాజనీతి చదివినట్లే రాణి రాజ్య పరిపాలనకు సంబంధించిన విద్యలను నేర్చుకోవాలని వేదమంటుంది.

పక్షపాతం లేకుండా ధర్మబద్ధంగా స్త్రీలకు రాణి, పురుషులకు రాజు న్యాయం చేయాలి. తీర్పు చెప్పాలి. స్త్రీలకు స్త్రీలే న్యాయాధికారులుగా ఉండాలి కాని పురుషులుండకూడదని వేదమంత్రార్థం వివరిస్తుంది.

"ఆ జంఘంతి సాన్వేషాం జఘనాం ఉపజఘ్నతే" (ఋగ్వేదం 6-75-13)

రాజు లేనప్పుడు రాణి సేనాపతి కార్య భారాన్ని వహించాలని వేదమంటుంది. రాజు రాజ్యాంగాన్ని చదివినట్లే రాణి రాజ్యాంగ సూత్రాలను చదవాలని యజుర్వేదంలో వుంది.

పూర్వకాలంలో రాణులు యుద్ధ విద్యలలో మంచి ప్రావీణ్యం సాధించేవారు. అందుకే త్రేతాయుగంలో దశరథ మహారాజుతో రాణి కైకేయీ కూడా యుద్ధానికి వెళ్ళి విజయాన్ని సాధించింది.

నమ ఆవ్యాదినీభ్యః వివిధ్యన్తీభ్యశ్చవో నమో!

నమ ఉగణాభ్యః స్తృంహ తీభ్యశ్చవో నమో! (యజుర్వేదం)

యుద్ధ భూమిలో శత్రువులను తరిమి

కొట్టే స్త్రీలకు, శత్రువులను చీల్చిచెండాడే స్త్రీలకు, శత్రువులను సంహరించే స్త్రీలకు నమః నమస్కారమని వుంది. ఈ వేద మంత్రంలోని 'ఉగణా' శబ్దానికి ఋషులు, "వివిధ తర్కయుక్తా గణాః యాసుతాభ్యాః స్త్రీభ్యాః"- అంటే వివిధ ప్రకారములుగా తర్కము చేసే స్త్రీలకు నమః నమస్కార మని వ్రాశారు. సభాపతులు పురుషులను యుద్ధ విద్యలలో యోగ్యులను చేసినట్లే స్త్రీలను కూడా ఆయా విద్యలలో సుశిక్షితు లను చేయాలని, వీర పురుషులు యుద్ధం చేసినట్లే స్త్రీలు కూడా న్యాయధర్మాలను రక్షించేందుకు యుద్ధం చేయాలని వేద మంటుంది.

**ప్రజాపతిష్ట్వా సాదయత్వపాం**

(యజుర్వేదం 13-17)

రాజపురుషులు యే రాజ్యకార్యాలలో స్వయంగా పనిచేస్తారో ఆయా కార్యాలలో తమ స్త్రీలకు పనిచేసేందుకు ప్రేరణ నివ్వా లని వేదం బోధిస్తుంది.

మధ్యకాలంలో స్త్రీని అబలగా అల్ప బుద్ధిగా, బాధ్యతాయుత కార్యాలను చేసేం దుకు అనర్హురాలుగా ఒకనాటి సమాజం ఎంచేది. కాని వేదంలోని ఈ విప్లవాత్మక భావాల ఫలితంగా స్త్రీలు అన్ని రంగాలలో ప్రగతిని సాధిస్తున్నారు.

యజుర్వేదంలోని 10వ అధ్యాయంలో 26, 27 మంత్రాలలో రాణులు న్యాయ విద్య- రాజనీతిలో ఇతరులకు శిక్షణ నివ్వా లని వుంది. చక్రవర్తిలా రాణి స్త్రీలకు తగిన న్యాయం చేయాలని వేదంలో వుంది. న్యాయవ్యవస్థలో న్యాయాధికా రులు పురుషులకు, వారి భార్యలు స్త్రీలకు న్యాయం చేయాలని యజుర్వేదమం టుంది.

"స్యోనాసి సుషదాసి క్షత్రస్యయోనిరసి" స్త్రీలకు స్త్రీలే న్యాయం చేయడం వలన రాజధర్మం దృఢంగా బలపడుతుందని, ధర్మంగా పాలింపబడుతుందని వుంది.

ఇట్లాగే ఋగ్వేదంలోని 4-22-7 మంత్రం లోను వుంది.

యజుర్వేదంలో 12-65వ మంత్రంలో "నిర్వతే" అంటే సత్యాచరణ గల స్త్రీ న్యాయాధీశురాలై దుష్టులను దండించి నిర పరాధులను రక్షించమని చెపుతుంది. అన్యాయాన్ని అక్రమాలను తన వజ్రశాస నంతో కఠినంగా శిక్షించాలని వుంది. యజుర్వేదం 29-50వ మంత్రంలో స్త్రీని "అశ్వాజని" అని సంబోధిస్తుంది. అంటే యుద్ధ విద్య తెలిసిన స్త్రీ గుర్రాలకు శిక్షణ నిస్తుందని వుంది. యజుర్వేదంలో 12-64వ మంత్రం స్త్రీని "ఘోరా" అని పిలు స్తుంది. అంటే దుష్టులను భయపెట్టే స్త్రీ అని అర్థం.

**యమేనత్వం యమ్యా సంవిదానో త్తమే!**

**నాకే అధిరోహయైనమ్!!**

(యజుర్వేదం 12-63)

రాజ్యాన్ని రక్షించటానికి చక్రవర్తి న్యాయ సింహాసనాన్ని అధిరోహించి పురు షులకు న్యాయం చేసినట్లే, రాణి స్త్రీలకు న్యాయం చేయాలని వేదమంటుంది.

ఈ ప్రమాణాలను బట్టి వేదం స్త్రీలకు సంబంధించిన అంశాలలో ఎంత ఉదాత్త మైన భావాలను తెలియచేసిందో మనం గ్రహించాలి.

ఈ 21వ శతాబ్దంలో కూడా స్త్రీని అణచి వేసేందుకు ఎన్నో ప్రయత్నాలు జరుగు తూనే వున్నాయి. ఆకాశంలో సగం, భూమిలో సగం అనుకున్న స్త్రీ అడుగడు గునా అవమానాలకు, అత్యాచారాలకు లోనవుతూనే వుంది. శాసనమనే వజ్రా యుధం తన కళ్ళ ముందు వుండి కూడా స్త్రీ అశక్తురాలవుతోంది. ప్రేమ అనే ముసు గులో కిరాతకులు స్త్రీలను అతి దారుణంగా గొంతులు కోసి అఘాయిత్యాలు చేస్తు

న్నారు. వారిని శారీరకంగా, మానసికంగా హింసిస్తున్నారు. స్త్రీ తనను తాను రక్షించుకోలేక పోతోంది. విషమ పరిస్థితుల మధ్య దుర్భర జీవనం గడుపుతోంది. ఆమె స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పురుషాధిక్య సమాజం హరించి వేస్తోంది. ఈ పరిణామాలను చూచి మేధావంతులు, సంస్కరణవాదులు ఆందోళన చెందుతున్నారు.




వేదకాలం నాటి స్త్రీ ఆత్మగౌరవంతో జీవించింది. ఈనాటి కాలంలోని స్త్రీ (చాలావరకు) ఆత్మన్యూనతా భావంతో జీవిస్తుంది. నేడు ఆమె అడుగడుగునా అత్యాచారాలకు, అఘాయిత్యాలకు లోనవుతోంది. అభద్రతాభావంతో భయం భయంగా జీవిస్తోంది. (ధర్మ) శాసనంలో ఈ వ్యవస్థను చక్క దిద్దకపోతే భారీ మూల్యాన్ని మనం చెల్లించుకోవాల్సి వస్తుంది.

నేరస్థుల వలయంలో చిక్కుకున్న స్త్రీల జీవితంలో కొంతవరకు మెరుగైన అవకాశాలు కనిపిస్తున్నాయి. మహిళా న్యాయవాదులు స్త్రీలకు న్యాయం చేసేందుకు కృషి చేస్తున్నారు. మహిళా న్యాయమూర్తులు అపరాధులను శిక్షించి స్త్రీలకు రక్షణ కల్పిస్తున్నారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సత్వరమే మహిళలకు న్యాయం జరిగేందుకు మహిళా కమిషన్‌లు ఏర్పాటు చేశాయి. బాధిత మహిళలు వెంటనే ఫిర్యాదు చేసేందుకు మహిళా పోలీస్ స్టేషన్లు ఏర్పడ్డాయి. వీటి వలన బాధిత మహిళలకు కొంత ఊరట కలుగుతుంది. స్త్రీల జీవితంలో ఇదొక ఆశాకిరణం. ఒకప్పటి కంటే ఇప్పుడు స్త్రీ రాజకీయంగా ఎదిగింది. తన ఉనికిని సమాజానికి నిరూపించుకుంటుంది. గృహంలో, సమాజంలో బహువిధాలైన పాత్రను పోషిస్తుంది. ఇది ప్రస్తుతం మహిళలకు మహోన్నత విజయంగా చెప్పుకోవచ్చు.

లోకాః సమస్తా సుఖినోభవంతు 

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

